ఫిబ్రవరి '80

# వనిత

వెల: 2 రూపాయలు



scan / Bindu

ఫిబ్రవరి. 1980

# జీవితంలో మధురమయిన అనుభవాలు అవి ఎప్పటికీ సరికొత్తవే




PIL-2133

ఈ 'అభిప్రాయాలు'
పేజీలలో
ప్రచురింపబడే
ప్రతి లేఖకూ
పారితోషికం పది రూపాయలు



మూఢాచారాలు నశించాలి !!!

మనదేశంలో యింకా కొన్నిచోట్ల మూఢాచారాలు వేళ్లు పాతుకొని వున్నాయంటే ఆశ్చర్యం లేదు. అందులోనూ మన మహిళలే వాటికి ప్రాధాన్యం యివ్వటం విచారించదగ్గ విషయమే! వాటిలో 'యింట్లోకి రాకూడదు' ముఖ్యమైనదేమో! మన పూర్వీకులు ఏదో ఆడవాళ్లకి ఆ మూడురోజులు విశ్రాంతి కోసం ఈ ఆచారాన్ని పెడితే, దానికి మనవాళ్ళు విపరీతంగా రంగులుపూసి...ఆచరించటం శోచనీయం. దీన్ని ఆచరించేందుకు ఏ స్త్రీ వెను కాడదు. ఏ ఆచార వ్యవహారాలైనా కాలాను గుణంగా మారకపోతే, మన పెద్దల విలువ తగ్గి పోయే ప్రమాదం ఎంతో వుంది. మాకు తెలిసిన ఒక అమ్మాయి (చదువుకున్నది అయినా!) ఈ విష యంలో పెద్దలతో పడలేక, శాశ్వతంగా పరిష్కారం చేసుకునేందుకు మార్గం కోసం డాక్టరు దగ్గరికి వెళ్ళింది. ఆ డాక్టరు ఆమెకి లాభనష్టాలు నచ్చ చెప్పి పంపిందన్నది తరువాత విషయం. ఎంతోమంది యింటా బయటా ఆ విషయంలో సతమతమవు తున్నారు. అఫ్‌కోర్స్! చాలాచోట్ల యిది అంతగా ఆచరించటం లేదు కాని, ఇంకా దాన్ని ఆచరిస్తున్న వాళ్ళు మాత్రం మారాలి. ఈ మూఢాచారాలకి స్వస్తి చెప్పాలి.

వి. ఎన్. ఎస్. లక్ష్మి — ఖమ్మం

బాలల ప్రగతి !!

అంతర్జాతీయ బాలల సంవత్సరం అయిపోయింది. ఈ సంవత్సరం నాకు తెలిసినంతవరకూ బాలలకు ప్రభుత్వం చేసిన మేలు ఇలా ఉంది :

ప్రతీ సంవత్సరం పాఠశాల విద్యార్థుల నుండి వసూలు చేస్తున్న 'టర్మ్‌ఫీ' పెంచారు. ప్రతీ విద్యార్థి నుండీ (ఓనమాలు నేర్చుకుంటున్న బాలలతోసహా) ఒక్కో రూపాయి రాష్ట్రప్రభుత్వా దేశాలమేరకూ, మరో రూపాయి బాలల సంవత్సరం సందర్భంగా ఇవ్వబడుతున్న స్టాంపుల కొరకూ వసూలు చేశారు. కాగా ప్రతీ సంవత్సరం వసూలు చేస్తున్న రెండు రూపాయల పరీక్ష ఫీజును నాలుగు రూపాయలకు పెంచి, జిల్లా కామన్‌బోర్డు పరీక్షాధి కారులు, సొంత లాభాన్ని కొంత....సారీ....పూర్తి గానే మానుకుని ఇలా పూర్తిగా బాలల మేలుకే అంకితమై పోయారు. ఇలా బాలల సంక్షేమం విషయంలోనూ వరంగల్ జిల్లా ముందంజ వేసింది. బహుశః అన్ని జిల్లాలూ, ఇలాగే సంక్షేమ కార్య క్రమాలను చేపట్టి పల్లె, పల్లెనా ఉంటున్న బాల బాలికలకు ఈ రీతిగానన్నా 'బాలల సంవత్సర' మంటే ఎమిటో అవగతమయ్యేలా చేస్తున్నాయను కుంటాను.

ఈ కూటికిలేని పేద బాలబాలికలు పాఠశాలకు వచ్చి ఎలాగూ కూర్చుంటున్నారు కదా? దీనికి 'ఉచిత విద్య' అని పేరు పెట్టి, ఇన్ని రకాల ఫీజులు తలకు కట్టి, పుస్తకాలనీ, నోట్సనీ, ఇంకా ఏవేవో అనీ....అన్నట్టు ఇంకా కొన్ని తరగతులకు ప్రభుత్వం పాఠ్య పుస్తకాలే విడుదల చేయలేదు. ఇదీ అంతర్జాతీయ బాలల సంవత్సర సందర్భంగా మన ప్రగతి!

లక్ష్మిప్రసన్న ఎస్. — మల్లంపల్లి


# వనిత

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి: 5 సంచిక: 8

ఫిబ్రవరి: 1980

విడి ప్రతి: రెండు రూపాయిలు

సం॥ర చందా: ఇరవైనాలుగు రూపాయిలు

శ్రీలంక: రూ. 2.00 (ఇండియా)

మలేసియా: 90 సెంట్స్

చిరునామా:

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026


కులమతాలు లేవా?

ఈనాటి మన సమాజంలో వర్గభేదాలుండకూడదని కులాలు, మతాలు కేవలం మనిషే సృష్టించాడని,

## రచయిత్రి జవాబులు

పాఠకులకు అనేక రచనల మీద పలు సందేహాలు కలుగుతూ వుంటాయి. ఇలాటి వాటిని నివృత్తి చెయ్యాలన్న ఉద్దేశంతో—

### "మీ రచయిత్రితో మీరు"

అన్న కొత్త శీర్షికను ఆరంభిస్తున్నాము. ఈ శీర్షికలో పాఠకుల సందేహాలకు ఆయా రచయిత్రులు సమాధానాలు ఇస్తారు. ఇటీవల 'వనిత'లో పూర్తయిననవల — "నింగి నుండి నేలకు" రచయిత్రి కుమారి వాసిరెడ్డి సీతాదేవి—సమాధానాలతో ఈ శీర్షికను ఏప్రిల్ నెల నుంచి ఆరంభిస్తున్నాము. పాఠకులు, ఆమె కథల మీద గాని, నవలల మీద గాని, వ్యక్తిగతంగా గాని, ఇతరత్రా గాని ఎలాంటి ప్రశ్నలయినా అడగవచ్చును.

ప్రశ్నలు కార్డు మీదనే రాయాలి. ఒక కార్డులో ఒక్క ప్రశ్నే వుండాలి. పైన పంపిన వారి పేరు, చిరునామా వుండాలి. ప్రశ్నలు "మీ రచయిత్రితో మీరు" అని రాసి, 'వనిత' చిరునామాకు ఫిబ్రవరి 15వ తేదీలోగా మాకు చేరేలా పంపాలి. ఈ ప్రశ్నలకు సమాధానాలు — ఏప్రిల్ సంచికలో వస్తాయి.

మంచి ప్రశ్నగా భావింపబడిన ప్రశ్న పంపిన వారికి పాతిక రూపాయలు బహుమానం!

పుట్టుకతో అవి రాలేదని చాలామంది వ్యక్తపరిచారు. కులం, మతం అని భేదం లేకుండా వివాహం చేసుకుంటే, బహుమతులు కూడా అందజేస్తున్నది మన ప్రభుత్వం. మనదేశంలో కులమత భేదాలు నిర్మూలించటానికి మన సంఘ సంస్కర్తలు అమితంగా కృషి చేస్తున్న తరుణమిది.

అయితే పెళ్లిళ్ల దగ్గర, గుడిలో పూజల దగ్గర లేని ఈ కులం, మతం, ఉద్యోగం దగ్గరకొచ్చేసరికి షెడ్యూలు తరగతి, వెనకబడిన జాతి అనే పేర్లతో తలెత్తుతున్నది. గమ్మత్తేమిటంటే మామూలుగా మన కులం గురించి మనం పట్టించుకోకపోయినా ఇంటర్వ్యూ కెళ్లిన తర్వాత మొదటి ప్రశ్న "నీవే కులం?" అనేదే. ఆ అభ్యర్థి తెలివి తేటలు, ఆర్థిక పరిస్థితి ఏవీ అవసరం లేకుండా, కులంతోనే అవసరమా? కులం పేరుతో అతన్ని లేక ఆమెను ఏ విధంగా అంచనా వేయగలం? బీదవాడనా, ధనవంతుడనా, మంచివాడనా, చెడ్డవాడనా? ఇవేవీ కులం లేక మతం నిర్ణయించలేదు కదా! దీనివల్ల కులమత భేదాలు తీసెయ్యలేక పోగా, ఇంకా సృష్టించినట్లే అవుతుందేమో!

కులమత ప్రసక్తిలేక ఆర్థిక పరిస్థితినిబట్టి వర్గాలు విభజించినట్లయితే బాగుంటుంది. ఒక కుటుంబంలో ఎంతమంది సభ్యులున్నారు, అందులో ఎంతమంది అర్జించేవారు? తరువాత ఆ అభ్యర్థి తెలివి తేటలు ఎలా వున్నాయి? ఈ లెక్కన వుద్యోగావకాశాలు కల్పిస్తే బాగుంటుంది గదా!

వెల్లట్ల మంజులారాణి — హైద్రాబాదు

### భావితరానికి మంచి భవిష్యత్తు

మనదేశాన్ని పట్టి పీడిస్తున్న సమస్యలలో జనాభా సమస్య ఒకటి. దీనికి పరిష్కారం స్త్రీ విద్య ద్వారా కొంతవరకు సాధ్యపడుతుందని మీరు ప్రచురించిన వ్యాసం అక్షరాలా ఈ సత్యాన్ని నిరూపిస్తుంది. చదువుకొన్న స్త్రీలు మాత్రమే సంతానమును అదుపు చేసుకొనే విధానమును అనుసరిస్తారు. వారికి మాత్రమే కుటుంబ నియంత్రణ యొక్క ఉద్దేశ్యం సులువుగా అర్థమవుతుంది. కావున ప్రతి స్త్రీ కనీసం డిగ్రీస్థాయివరకు కాకపోయినా ఇంటర్మీడియట్ స్థాయివరకు విద్య నభ్యసించడం ఎంతో అవసరం. కాని నేడు మధ్య తరగతి కుటుంబాలలో ఆడపిల్లలను పెద్ద చదువులు చదివించడం కష్టసాధ్యమే గాక, తరువాత వారికి పెళ్ళి చేయడం ఒక సమస్యయి కూర్చుంటున్నది.

ఎందుకంటే పెద్ద చదువులు చదివి డిగ్రీ అందుకునేసరికి వారికి వయస్సు పెరగటమేకాక కట్నం కూడా ఎక్కువగా ఇవ్వాల్సి వస్తుంది. అందుకని ఆడపిల్లలను పెద్ద చదువులు చదివించే బదులు ఆ డబ్బుతో వారికి పెళ్ళి చేయడమే మంచిదన్న అభిప్రాయం పెద్దలలో ఏర్పడుతోంది. అయితే దీనికి కారణం కేవలం కట్నాల సమస్యే కాదు. పెరుగుతున్న ధరలు, కుటుంబ సమస్యలు కూడా దీనికి కారణభూతమవుతున్నాయి. అందుకని ప్రభుత్వము వారు స్త్రీ విద్యకు హెచ్చు ప్రోత్సాహమివ్వాలి. ప్రోత్సాహం మాత్రమే కాదు, అందుకు తగిన విధంగా డిగ్రీస్థాయి వరకు స్త్రీలకు ఉచిత విద్యా సౌకర్యం కల్పించాలి. ప్రస్తుతం ఇది ఇంటర్ స్థాయిలో స్త్రీలకు కల్పించబడుతున్నది. అంతేకాదు. చదువుకున్న అమ్మాయి కావాలనుకొనే 'మగ పురుషులు' తమ కట్నాల రేట్లను కూడా తగ్గించుకుంటే చాలా మంచిది.

డి. నాగపద్మావతి — శ్రీకాకుళం

### భార్యకంటె భర్త చిన్నవాడైతే?

స్త్రీ తనకంటే తక్కువ వయసుగలవాణ్ణి వివాహం చేసుకోవచ్చా? శాస్త్రప్రకారం చేసుకోకూడదు. అందుచేతనే మన పెద్దవాళ్ళు వివాహం చేసుకునే స్త్రీ పురుషుల మధ్య ఐదు సంవత్సరాలైనా తేడా వుండాలి అన్నారు. పూర్వంలో అయితే యీ వ్యత్యాసం పది సంవత్సరాలు పైబడి కూడా వుండేది. హిందూశాస్త్రం ప్రకారం కుటుంబంలో పురుషుడు సర్వాధికారి. అతని అదుపు ఆజ్ఞలకు మిగిలిన సభ్యులు కట్టుబడి వుండాలి. భర్త వయసులో పెద్దవాడయినట్లయితే భార్య, పిల్లలు కూడా భయభక్తులతో మెలుగుతారు.

అదేకాకుండా విజ్ఞాన శాస్త్రరీత్యా కూడా స్త్రీ, పురుషునికంటే శారీరకంగా మానసికంగా కూడా త్వరితగతిన ఎదుగుతుంది. పదిహేను సంవత్సరాలు నిండిన స్త్రీలో కలిగే మానసిక పరిపక్వత పురుషునిలో యిరవై సంవత్సరాలకు గాని కలుగదు. పదిహేను సంవత్సరాల వయసుకే మన యిళ్ళలోని ఆడపిల్లలు వివాహానికి సిద్ధమైపోతుంటే అంతకంటే తక్కువ వయసుగల లేక సమాన వయసుగల పురుషునికిచ్చి వివాహం జరిపించటం అనే ఆలోచన ఎంత అర్థరహితమైనది! ప్రభుత్వం కూడా స్త్రీ వివాహ వయస్సు 18 సంవత్సరాలు, పురుషుని వయస్సు 21 సంిలు అనేది పైకారణాల వల్లనే. పిల్లల తల్లి అయిన స్త్రీలో యవ్వనంలో వుండే మార్దవం తొలగిపోయి ఓ విధమైన హుందాతనం, పెద్దరికం చోటు చేసుకుంటాయి. మగవారిలో త్వరితగతిని ఈ విధమైన మార్పులకు అవకాశం వుండదు. శారీరకంగా కూడా అతనిలో ఎలాటి మార్పు వుండదు. ఇలాంటప్పుడు ఇద్దరూ సమ వయసులో పురుషుడు చిన్నవాడో అయితే ఆ స్త్రీకి అతడు తమ్ముడుగానో, మరిదిగానో అని పిస్తాడు చూసేవాళ్ళకు. 'ఈడు-జోడు' అని అనుకునే దానికి అర్థమే లేదప్పుడు. మానసికంగా కూడా స్త్రీలో కలిగిన మార్పులు పురుషునిలో రాకపోవటం వల్ల అతడు ప్రక్కదారులు త్రొక్కే అవకాశం; తద్వారా సంసారాలు విచ్ఛిన్నమయ్యే పరిస్థితులు కూడా ఏర్పడవచ్చు. దాంపత్య జీవితంలోని సెక్సును దృష్టిలో వుంచుకుని కూడా స్త్రీ, పురుషుని కంటె చిన్నదైవుండాలి అని పెద్దలు నిర్ణయించి వుండవచ్చు.

కాకాని ప్రమద — ఖమ్మం

---

వచ్చే సంచిక నుంచి ఒక పెద్ద కథ:

## "ఈ దీపం ఆరిపోదు"

అన్న పెద్ద కథను వచ్చే సంచిక నుంచి 'వనిత'లో ఆరంభిస్తున్నామని తెలియజేయడానికి సంతోషిస్తున్నాము.

రచయిత్రి

**విన్నకోట సుశీలాదేవి**

'వనిత' సంక్రాంతి సంచిక నూతన సంక్రాంతి శోభలను వెదజల్లుతూ మా ఇంటికి వచ్చింది. మకర సంక్రాంతి విశిష్టతను గురించి ప్రకటించిన వ్యాసం చాలా బాగున్నది. సంక్రాంతి ముగ్గులు చాలా అందంగా వున్నాయి. మంచి ఎన్నిక చేశారు. మన దేవాలయాలు శీర్షికలో శ్రీరంగం గురించి చదువుతూ వుంటే, వ్యాసం చదువుతున్నట్టుగా లేదు. స్వయంగా వెళ్ళి ఆ పుణ్య క్షేత్రాన్ని దర్శించుతున్నామన్న అనుభూతి కలుగుతున్నది.

—బి. మృదులా కమలాకర్, రాజమండ్రి

మన దేవాలయాలలో 'శ్రీరంగం' గురించి తెలిపినందుకు చాలా సంతోషం. కొత్త శీర్షిక 'సంగతులూ - సమాచారాలు' ఉత్సాహంగా వుంది. అమర కళాకారుడు రవివర్మ చిత్రించిన వర్ణచిత్రాలను అందిస్తున్న 'వనిత'కు కృతజ్ఞతలు.

—కె. జి. హేమలత, కుప్పం

జనవరి నెలలో ప్రారంభమయిన శీలంశెట్టి రమాదేవి గారి నవల ప్రారంభం బాగున్నది. రవివర్మ తైల వర్ణచిత్రం మత్స్యగంధి చాలా బాగున్నది. ధరలు ఆకాశమంటుతున్న సమయములో తల నూనెలు తయారు చెయ్యడం గురించి వివరించి, కొంత ఖర్చు తగ్గేట్టు చేశారు.

—బి. గీత, ఖమ్మం

వనిత మధ్యపేజీలో 'మత్స్యగంధి' తైలవర్ణ చిత్రం చూసేను. మగవారిని ఉద్రేకపరచే ఇటువంటి చిత్రాన్ని స్త్రీల మాస పత్రికలో వేయడం అంత సమంజసంగా లేదు. వనితని మగవారు కూడా చదువుతారు గదా. అటువంటి చిత్రాలు ప్రచురించడం వల్ల మనల్ని మనమే కించపరచినట్లవుతుంది.

—కె. ఇందిరాహరనాథ్, చోడవరం

మీరు ప్రచురిస్తున్న 'నేరస్థుల కథలు' అనే శీర్షిక చాలా ఆసక్తికరంగా ఉంటోంది. పరిస్థితుల ప్రభావం వలన నేరస్థులుగా మారి శిక్ష అనుభవిస్తున్న అమాయకుల గురించి ముఖ్యంగా 1980 జనవరి సంచికలో ప్రచురించిన రచనలో 'చున్నీ' గురించి చాలా వివరంగా, చక్కగా మాకు తెలియపరచిన 'గౌరాపంత్ శివాని' గార్కి మా అభినందనలు.

—ఎల్. జ్యోతి, అనపర్తి

జనవరిలో ప్రచురించిన మకర సంక్రాంతి విశిష్టత చాలా బావుంది. వీల్డ్ రెబెకాలా తయారయిన ఎమ్. వేదకుమారిగారు కళ్ళు మిరుమిట్లు గొలిపేలా తయారు కావడం బావుంది.

—కె. లీలావతి, రాజమండ్రి

సంక్రాంతికి బహుమతి పొందిన 3 ముగ్గులు చాలా అందంగాను ఆకర్షణీయంగాను ఉన్నాయి.

—ఎం. రాఘవమ్మ, రాజమండ్రి




ముగ్గుల పోటీలో ఎంతో ఆకర్షణీయమైన ముగ్గులు వెలువడగలవని ఆశించిన మాకు చాలా నిరాశ గలిగింది. ముగ్గుల పోటీ న్యాయనిర్ణేతలకు అసలు ముగ్గు వెయ్యటం వచ్చా? పోటీకోసం అని పంపిన ముగ్గుల్ని 'వనిత'లో ప్రచురించి మీ వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకోటానికి మంచి ఉపాయం ఆలోచించారు!

—జి. ఎ. ఆర్., విజయవాడ

అందరికి తెలిసిన రెండవ ముగ్గును బహుమతికి ఎందుకు ఎన్నిక చేశారో అర్థం కావటంలేదు. 'బామ్మ గారి పేజీ' ఉపయోగకరంగా వుంది. 'మన దేవాలయాలు' శీర్షిక ప్రచురిస్తున్నందుకు మీకు కృతజ్ఞతలు ఎలా చెప్పుకోవాలో తెలియటం లేదు. 'అతిథి దేవుళ్ళు' కథ వాస్తవానికి దగ్గరగా వున్నది.

—కె. దుర్గాభవాని, మచిలీపట్నం

## వనిత మాటల కొలువు – 54

సరైన సమాధానం:

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 అ | ను | 14 శా | 15 స | 16 న | ము | ■ | 17 అం |
| ను | ■ | 2 కి | మా | టి | ■ | 3 కొం | త |
| శృ | ■ | 4 ని | ధి | ■ | 18 ఈ | ■ | ట |
| 5 తి | జ్యో | ■ | ■ | 6 క | త | 19 న | ■ |
| ■ | ■ | 20 భ్రూ | ■ | 7 సు | గా | గ | ■ |
| 8 క | 21 రు | ణ | ■ | 9 క | డు | ■ | 22 స్వా |
| 10 సి | గ | ■ | 23 శ్వా | ■ | ■ | 11 చే | దు |
| ■ | 12 వ | ఙ్ఞ | న | ■ | 13 క | టు | వు |

పై సమాధానంతో సరిపోయే సమాధానం పంపిన వారు ఇద్దరు. వారు:

1. పి. విజయలక్ష్మి, విజయవాడ
2. ఆర్. దీప, కొరగుంటపల్లి

బహుమతి మొత్తం రూ. 150 లను వీరికి సమానంగా పంచి అందజేస్తున్నాము.

అనామికగారి 'అతిథి దేవుళ్ళు' కథలో క్రొత్తదనం ఏ మాత్రము లేదు. నేమ్‌ప్లేట్ చూచి అతిథులమని, స్నేహితులమని చెప్పుకుని ఇంట్లో చేరిన వారికి సకల మర్యాదలు చేసి, వారు ఇల్లు గుల్లచేసి పోయాక వారి రాకకు నేమ్‌ప్లేట్ కారణమని తెలిసి బాధపడేవారి కథలు వివిధ పత్రికల్లో వచ్చాయి. స్త్రీకి స్త్రీయే శత్రువన్న నగ్నసత్యాన్ని చాటి చెపుతున్నది 'చున్నీ' కథ, 'ఇంట్లోకి రాకూడదు' వ్యాసం.

—ఎ. కామేశ్వరీశేఖర్, దాతలా (మ॥ ప్ర)

ముగ్గుల పోటీ అందరినీ నిరుత్సాహపరిచింది. డి. ఎస్. హేమలత (కర్నూలు), ఎస్. పి. ఎస్. దేవి (కడప) పంపిన ముగ్గులు మా అమ్మకి, అమ్మమ్మకి కూడా తెలిసిన ముగ్గులే. శారదా జనార్దన్ (జగిత్యాల) గారు పంపిన ముగ్గు కొంచెం ఫరవాలేదనిపించింది. ఇంతకు ముందు మీరు ఎన్నో ముగ్గులు ప్రకటించారు. వాటి కంటే గొప్పగా ఏమీ ఎన్నిక చేయలేదు.

—జి. వి. సుచరిత, విజయవాడ

'ఇంట్లోకి రాకూడదు!' వ్యాసం ఎంతో ఉపయోగకరంగా ఉంది. తెలియని వారికి బుద్ధి చెప్పినట్లుగా ఉంది. రవివర్మ తైలవర్ణ చిత్రం 'మత్స్యగంధి' చాలా బాగుంది.

—యం. జనాబ ముషాక్

'పుట్టిన రోజు' శీర్షికలో మీరు పక్షపాత ధోరణి చూపుతున్నారనిపిస్తున్నది. నేను, నాకు తెలిసిన వాళ్ళు పంపిన ఫోటోలు అందంగా, ఆరోగ్యంగా అన్ని అర్హతలతో ఉన్న పిల్లల ఫోటోలు పంపితే అన్నీ తిరిగి వస్తున్నాయి. వనితలో పుట్టినరోజు బహుమతులకు ఎన్నికైన పిల్లల ఫోటోలను చూస్తే ఆశ్చర్యం, విచారం కలుగుతున్నది.

—ఆర్. రజనీరెడ్డి, కొరగుంటపల్లె

'ఇంట్లోకి రాకూడదు!' వ్యాసంలో పేర్కొన్నట్లు బహిష్టు రక్తం చాలా అపాయకరమైనది కాకపోయినా అపాయకరమైనదనే చెప్పాలి! బహిష్టు అయిన (మూడు లేక ఐదు) రోజుల్లో భర్త సమాగమం పూర్తిగా నిషిద్ధం. ఇది తప్పనిసరిగా పాటించి తీరాలి. అలా పాటించకపోతే శారీరకంగా అనారోగ్యానికి గురి కావలసి వస్తుంది. తలనొప్పి, కాళ్ళు చేతులూ లాగటం, కళ్ళ మంటలు, మసకలు, చూపు మందం కావడం మొదలైన వ్యాధులు సంక్రమిస్తాయి. బహిష్టు అయిన రోజుల్లో భర్తవైపు కన్నెత్తి చూడకపోయినా భర్త ఏ విధమైన ఆకర్షణలకి లోను కాకూడదనే ఉద్దేశంతో ఆమెను యింట్లో దూరంగా వుండమన్నారు పెద్దలు. అంటే పూలు పెట్టుకోవడం, బొట్టు పెట్టుకుని అందంగా అలంకరించుకోవడం మొదలయినవి నిషేధించారు. బహిష్టు అయిన దినాలలో ఆ మైల బట్టలు అవీ ఉతికిన పిమ్మట ఆ నీళ్ళు చెట్లకి మొక్కలకి పోస్తే అవి చనిపోతాయి కూడా!

—ఆళ్లచెర్వు అన్నపూర్ణ, గుంతకల్లు

# ఈ ఎన్నికలలో వనితల విజయం

— మాలతీ చందూర్



ముఖపత్రం :

చరిత్రలో అద్భుతమైన విషయాలు జరుగుతూ వుంటాయి. అలాంటి అద్భుతమైన విషయం - శ్రీమతి ఇందిరాగాంధి, తిరిగి భారత ప్రధాని కావడం! ఆమెను అందరూ తిరస్కరించారు; దేశంలో ఆమె అరాచకం సృష్టించిందన్నారు; అత్యాయిక పరిస్థితి ప్రవేశ పెట్టి, ఘోరమైన నేరాలు చేసిందన్నారు. ఆ నేరాలను మోపుతూ ఆమెను నేరస్థురాలిగా నిలబెట్టారు. అయినా ఆమె తన పరాజయాన్ని పట్టుదలతో ఒక సవాలుగా ఎదు ర్కొంది; , స్వశక్తిని నమ్ముకున్నది. తన ధ్యేయం కోసం పోరాడింది. ప్రజాభిమానాన్నీ, ప్రజాబలాన్నీ చూరగొన్నది. పెద్ద మెజారిటీతో ఆమె తిరిగి ప్రధానిగా ఎన్నికైంది! ఆ విధంగా 'నెహ్రూల యుగం అంతరించిపోయింది' అనుకున్న వారందరి చేతా, ముక్కు మీద వేలు వేయించింది! ఇందిరాగాంధి – స్త్రీ శక్తిని మరోసారి నిరూపించిన సాహస వనిత. ఆమె విజయం – అఖిల భారత వనితా విజయం!

సప్తమ లోక్‌సభ ఎన్నికలు జయప్రదంగా ముగిసాయి. మొత్తం మీద యీ ఏడవ ఎన్నికలు శాంతియుతంగానూ, ప్రజాస్వామ్యయుతంగానూ ముగిసినట్టుగా అన్ని పార్టీలు వొప్పుకుంటున్నాయి. లోక్‌సభలోని మొత్తం 542 సీట్లలో, 17 సీట్లకి ఎన్నికలు తాత్కాలికంగా నిలిపివేశారు. మిగతా 525 లో 'కాంగ్రెస్-ఐ' కి శ్రీమతి ఇందిరాగాంధీ సారధ్యంలో ఎవరూ వూహించలేని ఘనవిజయం చేకూరింది. కాంగ్రెస్-ఐ కి 351 స్థానాలు లభించాయి.

ఈ ఏడవ లోక్‌సభ ఎన్నికలో చాలా విధాలుగా కొన్ని ప్రత్యేకతలు వున్నాయి. ఈ లోక్‌సభ మొత్తం సీట్లకి సుమారు 4633 మంది అభ్యర్థులు పోటీ చేశారు. ఇంత పెద్ద సంఖ్యలో యింతవరకూ ఏ ఎన్నికలలోనూ అభ్యర్థులు పోటీ చెయ్యలేదు. 1971 లో జరిగిన అయిదవ లోక్‌సభకి 2784 మంది మాత్రమే పోటీ చేశారు. ఇప్పటిదాకా అదే పెద్ద సంఖ్య. అయితే ఈసారి పోటీ చేసిన 4633 అభ్యర్థులలో 2736 మంది స్వతంత్ర అభ్యర్థులు. ఈ స్వతంత్ర అభ్యర్థులలో చాలామంది తమ ధరావతు పోగొట్టుకున్నారు. మొత్తం 2736 అభ్యర్థులు పోటీ చేస్తే-నలుగురికి మాత్రమే విజయం లభించింది. దీనినిబట్టి చూస్తే మన దేశంలో వ్యక్తి రాజకీయాలకి, స్వతంత్ర రాజకీయాలకి అవకాశం లేదు. రాజకీయాల్లో ప్రవేశించాలంటే-ఏదో ఒక రాజకీయ పార్టీతో చేతులు కలపాలి - అన్నది తేట తెల్లమయింది.

ఎన్నికల సందడి ప్రారంభమయినప్పటి నుంచీ-ఎంతమంది స్త్రీలు పోటీ చేశారు? – అన్న ప్రశ్న ప్రతివాళ్ళని అడుగుతూ వచ్చాను. "ఈసారి చాలా మంది స్త్రీలని మీ ఇందిరాగాంధి నిలబెడుతున్నది. అన్ని రాష్ట్రాల నుంచి 'కాంగ్రెస్-ఐ' పార్టీ తరఫున స్త్రీలు నిల్చుంటున్నారు" అని కొంత వేళాకోళం గానూ, అసలు సంఖ్య తెలియక కప్పదాటుగానూ జవాబు చెప్పేవారు వారు వేళాకోళంగా బదులు చెప్పినా - మా ఇందిరాగాంధి ఈసారి ఎక్కువ సంఖ్యలో స్త్రీలకి అవకాశం యిచ్చారు. 71–77 ఎన్నికలకంటే, ఈ 1980 ఎన్నికలలో ఎక్కువ మంది స్త్రీలు ఎన్నిక అయ్యారు. ఇది శుభసూచకమైన మార్పు. ఇప్పటికి నాలుగుసార్లు నుంచీ జరిగిన లోక్‌సభ ఎన్నికలలో స్త్రీలు ఎందరు పోటీ చేసిందీ, ఎందరు నెగ్గిందీ ఎన్నికల కమీషన్‌వారు ప్రకటించిన లిస్టు నుంచి-వివరాలు యిస్తున్నాను.

# ఇప్పుడు మీరు కన్య మీకు కావలసిన రక్షణ ఒక్క కేర్‌ఫ్రీ* మాత్రమే ఇవ్వగలదు

OBM/1765 TEL

కేర్‌ఫ్రీ మిమ్మల్ని దృష్టిలో పెట్టుకొని తయారు చేయబడింది. ఆ 5 రోజుల శానిటరీ రక్షణకోసం ఇది ఆధునిక యువతికి చేదోడు.

కేర్‌ఫ్రీ ఒక ప్రత్యేకంగా చెమ్మనుపీల్చు నేప్‌కిన్, ఇది అధికమైన చెమ్మను పీల్చి మీకు ఇబ్బందిలేకుండా చేస్తుంది వాస్తవంగా, కేర్‌ఫ్రీ ఎంతపీల్చగలదంటే ఒకే ఒక నేప్‌కిన్ మీ పూర్తి సమయంలోని ప్రసరణలో సగం దాకా నిలుపు కోగలదు. కాని తాజా భావనకోసం మీరుఎంత తరుచుగా కావాలంటే అంత తరచుగా మార్చుకోండి.

ఒక్క కేర్‌ఫ్రీ మాత్రమే దిగువ భాగము ప్రక్కలా చుట్టూ ఒక ప్లాస్టిక్ షీల్డ్ కలిగియున్నది. ఇది మరకలు పట్ల త్రివిధ అడ్డంకిగా పనిచేస్తుంది.

కేర్‌ఫ్రీతో మీరు హాయియైన భావన పొందగలరు, నెలలో ఇది ఏరోజో మీరు మరిచిపోతారు—చెమ్మ తగలటం ఉతికి ఆరవేసే ఇబ్బందిలేదు.

కేర్‌ఫ్రీ వాడకానికి తయారుగా వుంటుంది. మార్చుట చాలాసులభం. పారవేయుట చాలా తేలిక. అతి ఆరోగ్య కరమైనదిగూడా.

కేర్‌ఫ్రీ ధరించండి.

ఎల్లప్పుడూ విశ్వాసంతో ఉండండి.




10 మరియు 20 నేప్‌కిన్ల ప్యాక్‌లలో లభిసుంది.

Johnson & Johnson

*కేర్‌ఫ్రీ జాన్సన్ & జాన్సన్ యు.ఎస్.ఎ. వారి ట్రేడ్‌మార్క్ ©

| సం | ఎందరు పోటీ చేసింది | గెలుపొందింది |
|---|---|---|
| 1962 | 70 | 35 |
| 1967 | 69 | 31 |
| 1971 | 86 | 21 |
| 1977 | 70 | 19 |

ఈ 1980 లో జరిగిన ఎన్నికల్లో స్త్రీలు చాలా మంది పోటీ చేశారు; 1977 కంటే ఎక్కువ స్థానాలు గెలుచుకున్నారు. అయితే, స్త్రీలు ఎంతమంది గెలిచారు అన్నది ఎవరూ సరిగ్గా చెప్పలేకుండా వున్నారు. పెళ్ళి అయ్యాక-జమాఖర్చులు తేలనట్లే, ఆఖరికి ప్రెస్ యిన్‌ఫర్‌మేషన్‌వారు కూడా ఎంత మంది స్త్రీలు నెగ్గారూ అన్నది చెప్పలేకుండా వున్నారు. పత్రికల్లో 525 స్థానాలకి పూర్తి వివరాలు రాలేదు. ఒక 380 దాకా ప్రచురించారు. అందులోను స్త్రీలు ఎవరు అన్నది పేర్ల ప్రకారం చెప్పలేకుండా వున్నారు. పేర్లముందు శ్రీమతి అని గాని, మిసెస్ అనిగాని, మిస్ అనిగాని వుదహరించ లేదు. ముఖ్యంగా ఉత్తరభారతంలోని కొన్ని పేర్లు స్త్రీ పురుష లిద్దరికీ వర్తిస్తున్నాయి. అందుచేత ఇదమిద్ధంగా సంఖ్య తేలలేదు.

ఇప్పటిదాకా ప్రకటించబడ్డ 380 మంది అభ్యర్థుల జాబితా నుంచి ఎన్నికయినట్లు ప్రకటించబడ్డ స్త్రీ అభ్యర్థుల వివరాలు విడిగా వున్నాయి. ఇంకా కొన్ని పేర్లు రాలేదు. ఈ ఇరవైమందిలో రాష్ట్రాల వారీగా చూసినప్పుడు తమిళనాడు, కర్ణాటకలో స్త్రీలు ఎవరూ లేరు.

| | | |
|---|---|---|
| ఆంధ్ర | .... | 3 |
| ఉత్తర ప్రదేశ్ | .... | 4 |
| మహారాష్ట్ర | .... | 3 |
| బీహార్ | .... | 3 |
| మధ్యప్రదేశ్ | .... | 2 |
| పంజాబ్ | .... | 2 |
| కేరళ | .... | 1 |
| గోవా | .... | 1 |
| వెస్ట్ బెంగాల్ | .... | 1 |
| మొత్తం | .... | 20 |

| సంఖ్య | అభ్యర్థి పేరు | రాష్ట్రం | పార్టీ |
|---|---|---|---|
| 1. | శ్రీమతి ఇందిరాగాంధి | ఆంధ్ర, ఉత్తరప్రదేశ్ | ఐ |
| 2. | ,, చెన్నుపాటి విద్య | ఆంధ్ర | ఐ |
| 3. | ,, రాధాబాయ్ ఆనందరావు | ఆంధ్ర | ఐ |
| 4. | ,, సుశీలా గోపాలన్ | కేరళ | సి. పి. ఐ. ఎమ్. |
| 5. | ,, ప్రమీలా మధుదండావతె | మహారాష్ట్ర | జనతా |
| 6. | ,, ఉషాచౌదరి | మహారాష్ట్ర | ఐ |
| 7. | ,, కేసరీబాయ్ సోనాజీరావ్ | మహారాష్ట్ర | ఐ |
| 8. | ,, సహోద్రాబాయ్ రాయ్ | మధ్యప్రదేశ్ | ఐ |
| 9. | ,, విద్యావతీ చెతుర్వేది | మధ్యప్రదేశ్ | ఐ |
| 10. | ,, సమ్యోగీతారానె సర్‌దేశ్ | గోవా | ఎమ్. ఎ. జి. |
| 11. | ,, కిషోరిసిన్హా | బీహార్ | జనతా |
| 12. | ,, కృష్ణాసాహి | బీహార్ | ఐ |
| 13. | ,, కమలాకుమారి | బీహార్ | ఐ |
| 14. | ,, సుఖబాన్స్‌కౌర్ | పంజాబ్ | ఐ |
| 15. | ,, గురుబ్రిందర్‌కౌర్ | పంజాబ్ | ఐ |
| 16. | ,, గాయత్రీదేవి | ఉత్తరప్రదేశ్ | లోక్‌దళ్ |
| 17. | ,, మొహిసినా కిద్వాయ్ | ఉత్తరప్రదేశ్ | ఐ |
| 18. | ,, షైలాకౌల్ | ఉత్తరప్రదేశ్ | ఐ |
| 19. | ,, కైలాష్‌పతి | ఉత్తరప్రదేశ్ | ఐ |
| 20. | ,, గీతాముఖర్జీ | వెస్ట్ బెంగాల్ | సి. పి. ఐ. |

* దక్షిణ రాష్ట్రాలయిన కర్నాటక, తమిళనాడులలో స్త్రీలు ఎవ్వరూ రాలేదు.

కాంగ్రెస్-ఐ 14, జనతా 2, సి. పి. ఐ. ఎమ్ 1, లోక్‌దళ్ 1, సి. పి. ఐ. 1, ఎమ్. ఎ. జి. 1

ఈ ఎన్నికలలో పెద్ద తలకాయలు చాలా పడి పోయాయి. సుభద్రాజోషి, కమలా బహుగుణా, అంబికాసోని, చంద్రావతి, అహల్యా రంగ్నేకర్, మృణాళినీగోరే, పార్వతీ కృష్ణన్, విజయరాజ సిందియా మున్నగువారు.

'మిసెస్ గాంధీ, నెహ్రూడైనాస్టీని 'సెంటర్'లో నిలబెట్టబోతున్నది' అని రకరకాలుగా రాళ్ళు రువ్విన వారే, ఈసారి ఎన్నికలలో తమ భార్యలని, కోడళ్లని, కొడుకులని చాలామంది నిలబెట్టారు. మాజీ ప్రధాని చరణ్‌సింగ్ దంపతులు, మాజీ జనతా మంత్రి మధు దండవతె-ఆయన భార్యా-ఈ విధంగా ముగ్గురు దంపతులు లోక్ సభని అలంకరింప నున్నారు.

శ్రీమతి ఇందిరాగాంధీ ఆమె కొడుకు సంజయ గాంధీ రాజకీయాల్లోకి రావడం కొత్తగాదు. ఇద్దరూ పోటీ చేసి అత్యధిక ఓట్లతో నెగ్గారు. అయితే ఇలా తల్లికొడుకులు రాజకీయాల్లో వుండాలని ప్రయత్నించిన కుటుంబం మరొకటి వుంది. ఎటొచ్చీ కొడుకు గెలిచాడు - తల్లి ఓడిపోయింది. శ్రీమతి గాంధికి ప్రత్యర్థిగా నిలిచిన రాజమాత విజయ రాజసింధియా జనతా పార్టీ టికట్ పై నిల్చుని ఓడిపోతే, ఈమె కుమారుడు మాధవరావు సింధియా కాంగ్రెస్ ఐ అభ్యర్థిగా గెలిచారు.

ఈ ఎన్నికల్లో చాలా చోట్ల స్త్రీలకి స్త్రీలని ప్రత్యర్థులుగా నిలబెట్టడం, ఒకే కుటుంబంలోని ఇద్దరు స్త్రీలు ప్రత్యర్థులుగా నిలబడటం యిత్యాది రాజకీయపు ఎత్తులవల్ల-స్త్రీలు పూర్వం కన్నా ఎక్కువ సంఖ్యలో పోటీ చేసినా గెలుపు వచ్చేసరికి సంఖ్య అనుకున్నంత ఎక్కువగా రాలేదు.

ఏది ఏమైనా 1977 జనతా ప్రభుత్వం అధికారం లోకి వచ్చినప్పటి కంటే ఈసారి శ్రీమతి గాంధి నాయకత్వంలో ఎక్కువమంది స్త్రీలు వచ్చారు. ఈ విషయం అందరూ గమనించతగ్గది.

[11-1-1980]



# గులాబీలు పెంచడం ఎలా?

— లలితకుమారి

పువ్వులన్నిటిలోకీ రోజా పువ్వుని 'రాణి పువ్వు–క్వీన్ ఫ్లవర్' అని అంటారు. అసలు పువ్వులు అనగానే గులాబీయే గుర్తుకు వస్తుంది. అందుకే కాబోలు 'రోజా పువ్వుల్ని పెంచడం ఎలా? వాటికి ఏ ఏ ఎరువులు వేస్తే మంచిది? రసాయనిక ఎరువులు వాడవచ్చునా?' – అని నాకు వచ్చే ప్రశ్నలలో చాలామంది అడుగుతూ వుంటారు.

రోజా పువ్వు ఎంతో అందంగా, సుకుమారంగా వుంటుంది. చూడడానికి చాలా సులభంగా పెంచ వచ్చు అనిపిస్తుంది. కాని వాటి చుట్టూ ముళ్ళు వుంటాయి చూశారా....అవి కఠినంగా వున్నట్లే రోజా పువ్వుల్ని పెంచడం కూడా కొంచెం కష్టమే. ముఖ్యంగా చీడపురుగులు, తెగుళ్ల వీటికి ఎక్కువగా పడుతూ వుంటాయి. అంచేత చాలా ఓర్పుతో, చంటిపిల్లల్ని పెంచినట్లుగా పెంచాలి వీటిని. అంతటి శ్రద్ధ తీసుకోవాలి.

శీతల ప్రదేశాల్లో ఇవి చాలా సులువుగా పెరుగుతాయి. మన ఉష్ణ ప్రదేశాల్లో కొన్ని జాతులు మాత్రమే పెరుగుతాయి. కాని నాటు జాతికి చెందిన మొక్కలకి అంటు (Budding) కట్టినట్లయితే కొంత త్వరగా పెంచవచ్చు.

ఉష్ణ ప్రదేశాలలో ఏ మాత్రం శ్రద్ధ లేకుండా పెరిగే రోజాలను 'ఎడ్వర్డ్ రోజ్' అంటారు. ఇవి బాగా పెరగడమే కాకుండా వద్దన్నా పూస్తాయి. మామూలుగా మనం తలలో పెట్టుకునేవి ఈ జాతికి చెందినవే. అసలు రోజా సువాసన అంటాం చూశారూ....అది వీటికే వుంది. శీతల ప్రదేశాల్లో పెరిగే రోజా పువ్వులు కంటికి ఇంపుగా వుంటాయే తప్ప వాటికి సువాసన లేదు. టీ వాసన వేస్తాయి కనక వాటిని 'టీ రోజెస్' అని అంటారు. అవి చాలా అందంగా వుంటాయి. అంతే.

గులాబి మొక్కల్ని పెంచడానికి బంకమట్టి నేల శ్రేయస్కరం. అయితే వీటికి నీరు నిలిచి పోకూడదు కాబట్టి ఈ బంకమట్టికి కాలవమన్ను కలపాలి. ఏటి ఒడ్డుకు కొట్టుకు వచ్చే ఒండ్రు మట్టి రోజా మొక్కలు నాటిన చోట వేస్తే మంచిది. రోజా మొక్కలు నాటేటప్పుడు ఒక్క విషయం గుర్తుంచుకోవాలి. గులకరాళ్లు, కంకర వున్న చోట నాటితే మాత్రం అవి బతకవు.

రోజా మొక్కల్ని నాటేందుకు ముందస్తుగా మనం ఎరువు సిద్ధం చేసుకోవాలి. బాగా మగ్గిన గుర్రపు పెంట వేస్తే రోజా మొక్కలు బాగా ఎదుగుతాయి. ఇది లభించక పోయినట్లయితే బాగా మగ్గిన పశుపెంట వాడవచ్చును. గుర్రపుపెంట ఎరువుగా ఉపయోగించేప్పుడు మాత్రం బాగా మగ్గనిచ్చి ఆ తరవాత వెయ్యాలి. లేకపోతే దాని నుంచి పుట్టే వేడికి మొక్క మాడిపోయే ప్రమాదముంది.

ఇక ఎరువు తయారు చేసుకోవడానికి కావలసినవి - 4 పాళ్లు గుర్రపుపెంట (లేక పశుపెంట), 3 పాళ్లు కాలవ మన్ను, 2 పాళ్లు ఎర్ర మన్ను, 1 పాలు చెత్త ఎరువు. వీటిని బాగా కలిపి ఒక మిశ్రమంగా తయారు చేసుకోవాలి.

ఆ తరువాత నేలమీద ఈ ఎరువుని పొరలు పొరలుగా వేసుకుంటూ రావాలి. వీటిమీద నాలు గంగుళాలు దళసరికి పెరటిలోని మట్టిని కప్పాలి. ఇలా చేయడంవల్ల ఎరువు నుంచి వచ్చే వాయువు పైకి రాకుండా అడ్డినట్లవుతుంది. ఇక ఈ ఎరువుని ఒకవైపు నుంచి తీసుకుని రోజా మొక్క నాటే స్థలంలో వేయడానికి ఉపయోగించవచ్చును. ఇలా సహజమైన ఎరువు కాకుండా రసాయనిక ఎరువులు వాడాలనుకున్న వారు వాటిని కూడా ఉపయోగించ వచ్చును. కాని వాటిని పశుపెంటతోగానీ, గుర్రపు

పెంటతోగానీ కలిపి మరీ ఉపయోగించాలి.

రసాయనిక ఎరువులు వాడదల్చుకున్న వారు – 2 పాళ్లు సూపర్ ఫాస్ఫేటు, 1 పాలు పొటాషియం సల్ఫేటు, 1 పాలు అమ్మోనియం సల్ఫేటు, మొక్క నాటబోయే స్థలంలో నాలుగవుస్సులు చొప్పున వెయ్యాలి. ఇందుకు ముందుగా ఆ నేలని బాగా తడి చెయ్యాలి. రసాయనిక ఎరువు వేసిన తర్వాత బాగా నీరు పొయ్యాలి. అలా నీరు పొయ్యడంవల్ల రసాయనిక ఎరువువల్ల కలిగే అధిక వేడిమిని హరింపజేస్తుందన్న మాట.

ఇక మొక్క నాటడం ఎలాగో తెలుసుకుందాం. బాగా పెరిగిన రోజా మొక్కలు బజార్లో అమ్ముతారు. అవి తీసుకుని నాటవచ్చును. వాటి వేర్ల చుట్టూ మట్టి బంతివలె అమర్చి వుంటుంది. ఈ మట్టిని మాత్రం తీసెయ్యకండి సుమా. అది వేర్లకి రక్షణగా అలా వుండడమే మంచిది. మొక్క నాటడానికి ఎరువు వేసి సిద్ధం చేసి వుంచుకున్న గోతిలో వేరు చుట్టూ వున్న మట్టితోసహా మొక్క నాటాలి. అయితే ఇలా నాటేటప్పుడు వేరు భాగం దగ్గర ముతక ఇసుక చల్లాలి. వేర్ల చుట్టూ వున్న మట్టి ఎందుకు తీసెయ్యకూడదన్నానంటే రోజా మొక్క వేర్లు మొక్కలాగే అతి సుకుమారంగా వుంటాయి. అవి ఎరువుకి అంటకూడదు. అంటితే ఆ వేడికి వేర్లు మాడిపోతాయి. అందుకే రోజా మొక్కలకి ఎరువు అధికంగా వుండకూడదనడమూ, ఎరువు ఆ నేలలో బాగా కలిసేలా వెయ్యాలనడమూను. ఆ తర్వాత మిగిలిన మట్టితో గొయ్యి బాగా దిట్టంగా పూడ్చాలి.

రోజా మొక్కలు నాటుతున్నప్పుడు నేల తడిగా వుండాలి. అలా అని బాగా బురదగా వుండకూడదు. మొగ్గ తొడిగిన రోజా మొక్క అయితే నాటేటప్పుడు మొగ్గ నేల మీదకి బాగా పైకి కనిపించేటట్లుగా నాటాలి. మొక్క నాటిన మొదటి రోజున బాగా నీరు పొయ్యాలి. ఆ తర్వాత నేలంతా పొడిగా అయ్యేదాకా నీరు పొయ్యకూడదు. మొక్కలు నాటినచోట ఎప్పటికప్పుడు శుభ్రం చేస్తూ వుండాలి. కలుపుమొక్కలు అవీ వస్తూ వుంటాయి. వాటిని ఏరి పారేస్తూ వుండాలి. చుట్టూ పరిశుభ్రంగా వుంచుకోవాలి.

రోజా మొక్కలకి నీరు ఎంత పొయ్యాలి.... ఎలా పొయ్యాలి అన్నది చాలామందికి కలిగే సందేహం. వీటికి పరిశుద్ధమైన నీరు కావాలి. వారానికి ఒకసారి గానీ, రెండుసార్లు గానీ వాతావరణాన్నిబట్టి నీరు పొయ్యాలి. మొక్కలు నాటిన గోతులలోకి నీరు చిన్న చిన్న కాలువలగుండా ప్రవహించేటట్లు చెయ్యాలి. ఇలా నీరు పోస్తున్నప్పుడు మాత్రం అన్ని మొక్కలకి నీరు సమానంగా అందుతోందా లేదా అన్నది చూడాలి. నీటిగొట్టం ద్వారా కూడా నీరు మొక్కలకి పొయ్యవచ్చును. ఎండాకాలంలో మొక్కలపైన కూడా నీరు చల్లడం వల్ల ఆకులు శుభ్రం అవడమేకాకుండా మొక్కలు తాజాగా కళకళలాడుతూ వుంటాయి. నీరు పోసే ముందు నేల బాగా పొడిగా వుందా లేదా అన్నది గమనించాలి. లేకపోతే నీరు ఎక్కువై మొక్క కుళ్లిపోయే ప్రమాదముంది. అందుకే వానాకాలంలో మాత్రం రోజా మొక్కల్ని నాటకూడదు.

పట్టణాలలో పెరడు వున్న ఇళ్ళు దొరకాలంటే కష్టమేమరి. అలా పెరడు లేనివాళ్ళు, రోజా మొక్కలని పెంచాలని ఉబలాటపడేవాళ్ళు ఈ మొక్కలని కుండీలలో పెంచవచ్చును. వీటికని ప్రత్యేకంగా పెద్ద పెద్ద కుండీలు 'రోజా కుండీలు అని అమ్ముతారు. ఇవి ఒకటిన్నర అడుగుల ఎత్తుతో ఒకటిన్నర అడుగు చుట్టు కొలతతో అడుగున అధికంగా నీరు నిలవకుండా చిన్న చిన్న రంధ్రాలతో వుంటాయి. ఈ కుండీల అడుగు భాగంలో ఎరువు, దాని మీద కాలవమన్ను వేసుకోవాలి. మొక్క ఎరువుకి తగలకుండా వుండడానికే ఈ ఏర్పాటు. ప్రారంభంలో కుండీలలో పెంచే రోజా మొక్కలని నీడలోనే వుంచాలి. వాటికి సూర్యరశ్మి తగలనివ్వకూడదు. బాగా పెరిగాక వాటిని ఎండలోకి తీసుకురావాలి. వీటికి మొదట బాగాను ఆ తర్వాత జాగ్రత్తగా కొద్ది కొద్దిగా నీరు పొయ్యాలి. నేల మీద నాటే మొక్కల్లా కాకుండా వీటికి ప్రతి రోజూ నీరు పొయ్యాలి. మరో విషయం. పశ్చిమ దిశవైపు వున్న గోడకి చేరువగా మాత్రం ఈ కుండీలలో మొక్కలు నాటినప్పుడు వుంచకూడదు. అలా చేస్తే సూర్యరశ్మి తాకిడికి మొక్కలు నాశనమయ్యే అవకాశముంది. కుండీలలో పెంచిన మొక్కలని వసతి వున్నవాళ్ళువిడిగా నేల మీద పాతవచ్చును.

ఇక ఎండిన కొమ్మలు, పనికిరాని రెమ్మలు కత్తిరించడాన్ని 'ప్రూనింగ్' అని అంటారు. దీనికి శీతాకాలం తగిన సమయం. అయితే ఇలా చెయ్యడం మాత్రం మొక్క నాటిన సంవత్సరం తర్వాత ప్రారంభించాలి. ఆ తర్వాత ప్రతి సంవత్సరం ఎండిన కొమ్మల్ని తీసేస్తూ వుండాలి. మొక్క ఆరోగ్యంగా పెరగడానికీ, బాగా పువ్వులు పుయ్యడానికీ ఎండిన కొమ్మలు, మోడువోయిన రెమ్మలు తీసివెయ్యడం మంచిది. కాని తరచు చెయ్యడం వల్ల మొక్క బలహీనమైపోతుంది. కాబట్టి సంవత్సరానికి ఒకసారి చేస్తే చాలు.

మొక్కలని కత్తిరిస్తున్నప్పుడు, 'సికెటియర్స్' (Secateurs) అని తోటలో చెట్లు కత్తిరించడానికి అమ్ముతారు. దాంతో శుభ్రంగా కత్తిరించాలి. అడ్డదిడ్డంగా నమిలివేసినట్లు కత్తిరించకూడదు. కత్తిరించిన ప్రదేశంలో 'బోరర్' వంటి పురుగులు ప్రవేశించి చెట్టు నాశనం చెయ్యకుండా వుండటానికి ఆ చోట పెయింట్ చేసి మూసెయ్యాలి. బాగా పెరిగే మొక్కలకి తరచుగానూ, నెమ్మదిమీద పువ్వులు పూసే మొక్కలకి తక్కువగానూ, ఎండిన కొమ్మలు, రెమ్మలు తీసివెయ్యాలి. ఎండిన పువ్వులు చెట్టుపై వుంచకూడదు. చూడడానికి అందవికారంగా వుంటాయి కాబట్టి. అట్లాగే 'జబ్బు' చేసిన భాగాలేమైనా వుంటే వాటిని కూడా వెంటనే తీసివెయ్యడం మొక్క ఆరోగ్యదృష్ట్యా చాలా మంచిది.

రోజా చెట్లు బాగా పువ్వులు పూశాక వాటిని చటుక్కున కోసుకోవాలనిపించడం సహజం. కాని అలా కోస్తున్నప్పుడు తొడిమ నుంచి కాకుండా కొంత రెమ్మతోసహా కోసుకోవాలి. పువ్వు మాత్రం కోస్తే ఇక ఆ రెమ్మ నుంచి పువ్వులు పుయ్యవు. అదలా మొండిరెమ్మగానే ఉండిపోతుంది. అందువల్ల రోజా పువ్వులను రెమ్మతోసహా కోస్తూ వుంటేనే మళ్లీ చిగురించి పువ్వులు పూస్తుంది.

మరో విషయం గుర్తుంచుకోవాలి. రోజా చెట్లని నాటేటప్పుడు బాగా పెద్ద చెట్లయితే నాలుగడుగులు, చిన్న చెట్లయితే మూడడుగుల దూరంలో నాటాలి. ఇలా ఎందుకు చెయ్యాలంటే మనం పువ్వులు కోసుకునేటప్పుడు రోజా చెట్టు ముళ్ళు మన శరీరానికి తగిలి గీసుకుపోకుండానూ, చీర ఆ ముళ్లల్లో చిక్కుకుని చిరిగిపోకుండా వుండడానికీను. ఇంతకీ ఈ వర్ణచిత్రంలోని గులాబీలను చూస్తూ వుంటే మీకు కూడా రోజా పువ్వుల మొక్కలు పెంచాలనిపిస్తోంది కదూ. అయితే మరిక ఆలస్యమెందుకు...నే చెప్పినట్లు చెయ్యండి. మీ పెరడులో కూడా గులాబీల గుబాళింపు మిమ్మల్ని ఆహ్లాద పరుస్తుంది. అందుకు తగిన సీజను కూడా ఇది. □




మన వాయవ్య సరిహద్దులో వున్న ఆఫ్ఘనిస్థాన్‌కూ మనదేశానికి చిరకాలంగా స్నేహ సంబంధాలు నెలకొని వున్నాయి. ఇటీవల అక్కడ జరుగుతున్న మార్పులు; అలముకున్న అశాంతి వాతావరణం - ఎన్నికల సంరంభంతో తలమునకలుగా వుంటూన్న భారత ప్రభుత్వ దృష్టిని ఆకర్షించింది. మనదేశమే కాదు. ప్రపంచంలోని శాంతి కాముక దేశాలన్నీ ఆఫ్ఘనిస్థాన్‌లో అగ్రరాజ్యాల సైనిక జోక్యంపట్ల ఆందోళన వ్యక్తం చేస్తూనే వున్నాయి.

ఇంతకూ ఆఫ్ఘనిస్థాన్‌లో జరిగిందేమిటంటే గత డిసెంబరు ఇరవైయేడు వరకు ఆఫ్ఘనిస్థాన్ అధ్యక్షుడుగా వున్న హఫీజుల్లా అమీన్‌కు, ఆయన సోదరులిద్దరికీ మరణదండన విధించి - సోవియట్ రష్యా సహాయంతో బ్రబక్ కార్మల్ అధికార సింహాసనం అధిష్ఠించి నూతన అధ్యక్షుడుగా విప్లవ సమితి నాయకుడుగా ప్రకటించుకున్నాడు.

ఆఫ్ఘనిస్థాన్‌లోని రాచరిక వ్యవస్థను సమూలంగా కూలద్రోయడానికి కృషి చేసిన విప్లవ శిల్పులలో బ్రబక్ కార్మల్ కూడా ఒకడు :

- 1973 సం॥ రాజభవనంలో తిరుగుబాటు (Palace Coup) చేసి దావూద్ అధికారం హస్తగతం చేసుకున్నాడు. అప్పుడే సోవియట్ రష్యాకు అనుకూలమైన వామపక్షప్రభుత్వం ఏర్పడింది, అయితే దావూద్ తన బంధువర్గానికి ప్రభుత్వంలో ఉన్నత పదవులను కేటాయించి, రాచరికవ్యవస్థను కూలద్రోయడానికి సహకరించిన యువజన సంఘాన్ని రూపుమాపడానికి ప్రయత్నించాడు. పాలకవర్గంలో అభిప్రాయభేదాలు - అధికార వ్యామోహం తారాస్థాయికి చేరుకున్నాయి. 1976 సం॥ చీలిపోయిన యువజన సంఘం సంఘటితమై రహస్య పథకాలు రూపొందించి-మొదట వైమానిక దళంలో తిరుగుబాటు తీసుకొచ్చి - ముప్ఫ్యైరు గంటలలోపల దావూద్ దర్బారును నేలమట్టం చేశారు. ఆ తర్వాత ఏర్పడిన సోషలిజ విప్లవ ప్రభుత్వానికి తరాకీ అధ్యక్షుడయ్యాడు.

అయితే ప్రభుత్వ విధానాలలోనూ రూపొందించే పథకాలలోనూ తరాకీ - కార్మల్ మధ్య కొన్ని అభిప్రాయభేదాలు తలెత్తడంతో కార్మల్ జెకోస్లొవేకియాలో రాయబారిగా నియమించబడ్డాడు. కార్మల్ స్థానాన్ని అమీన్ ఆక్రమించాడు. అనతి కాలంలోనే మరో విప్లవం జరిపి-తరాకీని చంపి అధికారం తన హస్తగతం చేసుకున్నాడు హఫీజుల్లా అమీన్. వీటన్నిటినీ గమనించిన బ్రబక్ కార్మల్- చీమలుపెట్టిన పుట్టలో పాము జొరబడినవిధంగా వుందని గ్రహించి రహస్యంగా కాబూల్ చేరుకుని సోవియట్ రష్యా సాయంతో విప్లవం జరిపి పాత మిత్రులను విడుదల చేశాడనీ చెబుతారు.

సోవియట్ రష్యా తనకు అనుకూలంగా లేని అధ్యక్షుని హతమార్చి తనకు అనుకూలమైనవారికి అధికారం అప్పగించిందనీ; ఈ చర్య ఆఫ్ఘనిస్థాన్‌ను రష్యా తన గుప్పిట్లో వుంచుకోడానికి చేసిన ప్రత్యక్ష దురాక్రమణమాత్రమేనని మరి కొందరు అంటారు.

ఆఫ్ఘనిస్థాన్‌లో సైనిక జోక్యానికి నిరసనగా అమెరికా రష్యాకు చేస్తున్న ఆహార ధాన్యాల, సాంకేతిక పరికరాల ఎగుమతిని ఆపు చేసింది. ఆగస్టు నెలలో మాస్కోలో జరుగనున్న ఒలింపిక్ పోటీలను బహిష్కరించదలచామని కూడా అమెరికా బెదిరించింది. అంతేకాదు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో వుంటున్న రష్యా దౌత్య సిబ్బందిని బహిష్కరిస్తూ సోవియట్‌లో వున్న దౌత్యకార్యాలయ సిబ్బందిని వెనుకకు తీసుకోవాలని కూడా అమెరికా నిర్ణయం తీసుకుంది.

ఆఫ్ఘనిస్థాన్ ప్రవేశపెట్టిన ఆర్థిక సాంఘిక సంస్కరణ పథకాలకు వ్యతిరేకంగా కొందరు ముల్లాలు, కొండజాతి సర్దారులు జరుపుతూన్న గెరిల్లా పోరాటాన్ని అణచడానికి తాము సైనిక సహాయం అందజేస్తున్నామనీ, అదీ తాము అంతకు ముందే కుదుర్చుకున్న స్నేహ సహకార ఒడంబడిక మేరకే జరుగుతోందనీ, రష్యా ప్రకటించింది.

ఆఫ్ఘనిస్థాన్‌లో వామపక్షప్రభుత్వం ఏర్పడడం చుట్టుపట్ల ముస్లిం రాజ్యాలకు అసలు గిట్టడం లేదని- అమెరికాకు సుతరామూ ఇష్టం లేదని అందువల్ల ఆ దేశాలు తిరుగుబాటుదార్లకు ఆయుధసరఫరా చేసి అండదండలుగా నిలుస్తున్నాయి అని రష్యా ఆరోపిస్తోంది. తిరుగుబాటుదార్లకు పాకిస్థాన్‌లో స్థావరాలు ఏర్పరచి సైనికశిక్షణ ఇవ్వడం - పాకిస్థాన్‌కు అమెరికా విరివిగా ఆయుధాల సరఫరా చేయడం వారికి మరింత ప్రోత్సహించినట్లవుతుందనీ ఈ చర్యల ద్వారా అమెరికా మధ్య ఆసియా దూర ప్రాచ్యంలోనూ వైమానిక దళాల స్థావరాలు ఏర్పాటుకు ప్రయత్నిస్తోంది, అది ప్రపంచ శాంతికి భంగకరం అనీ - సోవియట్ యూనియన్ వార్తా సంస్థ టాస్ పేర్కొన్నది.

ఆఫ్ఘనిస్థాన్ నుంచి రష్యా తన సైన్యాన్ని వెంటనే ఉపసంహరించుకోవాలని ఐక్యరాజ్య సమితి భద్రతామండలిలో ప్రతిపాదన తీసుకురాబడింది. ఆఫ్ఘన్ ప్రభుత్వమూ, ప్రజలు తమ సమస్యలను పరిష్కరించుకోడానికి ఆర్థిక సాంఘిక విధానాలు రూపొందించుకోడానికి వీలుగా రష్యా తన సేనలను వెంటనే ఉపసంహరించుకోవాలన్న తీర్మానం తీసుకొచ్చి వివిధ దేశాలు నిశితంగా విమర్శించాయి. అయితే ఆ ప్రతిపాదనను రష్యా వీటో చేసింది. అందువల్ల ఈ తీర్మానం ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీలో ప్రవేశపెట్టబడుతుంది. జనరల్ అసెంబ్లీలో అగ్రరాజ్యాలకు వీటో చేసే అధికారం లేదు.

మన సరిహద్దు ప్రాంతమైన కైబర్ కనుమలకు కొన్ని మైళ్ళ దూరంలో ఈ సంఘటనలు జరుగుతున్నాయి కాబట్టి ఇది భారత ఉపఖండ శాంతి భద్రతలకు ముప్పుగా వాటిల్లే అవకాశం వుందని కొందరు అభిప్రాయపడుతున్నారు. అందువల్ల మన దేశంలో కొత్తగా ఏర్పడిన సుస్థిర ప్రభుత్వానికి మరికొన్ని కొత్త బాధ్యతలు ఏర్పడ్డాయి. ముఖ్యంగా పాకిస్థాన్‌కు అమెరికా విరివిగా ఆయుధసరఫరా చేయడం వల్ల మన సరిహద్దు రక్షణకోసం మనం ఎక్కువగా ప్రాముఖ్యం ఇవ్వవలసిన అవసరం వుంది. రష్యాను ఎదురుదెబ్బతీసే ఉద్దేశంతో అమెరికా పాకిస్థాన్‌కు చేసే ఆయుధసరఫరాలవల్ల ఏర్పడనున్న అవాంఛనీయ పర్యవసానాల గురించి చర్చించి దానిని ఆపడానికి కృషి చేయాలి.

ఏది ఏమైనా ఇవాళ ఆఫ్గనిస్థాన్ రెండు అగ్ర రాజ్యాల మధ్య పిల్లుల మధ్య ఎలుకలా చిక్కుకుని వుంది. ఇది ప్రపంచంలో ముఖ్యంగా భారత ఉపఖండంలో ఉద్రిక్త వాతావరణానికి దోహదం చేస్తోంది. □




## కాలచక్రం

(నవల)

[రచన: కావిలిపాటి విజయలక్ష్మి; ప్రచురణ: ఎమెస్కో పాకెట్ బుక్స్, సికింద్రాబాదు; పేజీలు: **129**; వెల: రూ. **3-50**]

కథ సూటిగా చెప్పే మనకున్న కొద్ది రచయిత్రులలో కావిలిపాటి విజయలక్ష్మి ఒకరు. కాని, "ఎంత మంచి రచయిత్రి, రచయితా అయినా, అన్నీ మంచి పుస్తకాలు రాయలేరు" అన్నట్టు— కాలచక్రాన్ని ఈ ప్రసిద్ధ రచయిత్రి ఆ కోవలోనే నడిపించారు. అయితే, ఈ కథలో ఒక చక్కని 'పాయింట్' వుంది. తన బిడ్డను, పెంచుతారనుకున్న మరొకరి యింట, దొంగతనంగా వదిలిపెట్టి తర్వాత ఆ బిడ్డ ఎదుగుతూ వుంటే చూడాలని తహతహలాడే తండ్రి పరిస్థితి. పైగా అతను నేరస్థుల జాబితాలో వుండడం చేత, సాధువుల్లో కలిసిపోయి బిచ్చం అడుక్కుంటూ బతుకుతూ వుంటాడు. ఈ పాత్ర, అతని తండ్రి పాత్ర కథలో కీలకమైనవీ, ఉత్సాహకరమైనవీ. అయితే, ఉన్న కథను సూటిగా చెప్పకపోవడంతోనో, ఏమో— ఈ రెండు పాత్రలూ, వాటివాటి కథలూ బిగువుగా బరువుగా నడవలేదు. వాటికి తొలి నుంచీ కథలో ముఖ్యస్థానం ఇచ్చి వుండి వుంటే, కథ ఉత్సాహంగా నడిచేది; ఇప్పుడున్న ఆ కాస్త 'గంద్రగోళం' వుండకపోయేది!

## కూర్పు నీ నేర్పు

(గేయ సంపుటి)

[రచన: పాటిబండ్ల విజయలక్ష్మి; ప్రచురణ: నవజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ; పేజీలు: **100**; వెల: రూ. **8-00**]

'వెల ఎనిమిది రూపాయలా!' అని ఆశ్చర్యపోనక్కరలేదు. ఎంచేతంటే పుస్తకం సైజు, పేపరు, మధ్యలో వున్న రేఖా చిత్రాలు—ఆ వెలను సమర్థించేలా వున్నాయి.

పోతే—'కవిత'కు వెల ఏమిటి? రచనకు వెల ఏమిటి? మనం ఇస్తున్న వెల—పుస్తకరూపానికే గాని, పుస్తకంలో వున్న రచనకు కాదనేది— తిరుగులేని సత్యం. ఒకే వెలకు కొన్న రెండు పుస్తకాల్లో-ఒక పుస్తకం అద్భుతంగా ఉండొచ్చు; మరొకటి ఏ మాత్రం బాగుండకపోవచ్చు! అంచేతనే మనం వెల కట్టడం పుస్తకానికే గాని, అందులో వున్న రచనకి కాదు!

విజయలక్ష్మి-నవలా రచయిత్రి. అనేక నవలలు రాసి, పేరు తెచ్చుకున్నారు. అయితే నవలలు కథలూ రాసేవాళ్ళందరూ గేయాలు రాయలేరు. గేయ కవిత్వం చెప్పే వాళ్ళందరూ కూడా నవలలు, కథలూ రాయడం లేదు. ఇలాంటి అరుదైన విషయాన్ని సాధించినందుకు - ఈ రచయిత్రి అభినందనీయురాలు. ఈ సంపుటిలో వున్న అరవై గేయాల్లోనూ, కొన్ని గుప్పున గుబాళించినవీ వున్నాయి; కొన్ని ఎర్రగన్నేరు పువ్వుల్లాంటివీ వున్నాయి. భావం కూడా సముద్ర గర్భంలో వున్నట్టుగా మరీ లోతుగానూ, ఎలాగో చెప్పాలి కాబట్టి, దొంకతిరుగుడుగా వంకరగానూ చెప్పకపోవడం—బాగా నయం. ఏదైనా మొత్తం మీద, ఈ రచయిత్రిలో భాషకంటే భావం మీదనే కొంత పలుకుబడి వుంది; ఏదో చెప్పాలన్న తపన వుంది; ఉద్వేగం వుంది. 'గేయాలు రాయడం' అంటే అర్థం, భావం తెలియనీయకుండా గుప్తంగా వుంచడమూ కాదు; గంభీరమైన పదాలతో, అంతకంటే గంభీరమైన భావాలతో పరిగెత్తించడమూ మాత్రమే కాదు. ఈ గేయాలు చదివినప్పుడు అలాంటి ఇబ్బందులు కలగకపోవడం - సుగుణం. అయితే ఒకటుంది. ఈ రచయిత్రి గేయరచనలో మరింత పరిపక్వత సాధించాలి. అప్పుడు, ఈ సంపుటిలో వున్నట్టుగా కొన్ని మాత్రమే బాగుండి, మరికొన్ని బాగులేకపోవడం అన్న లోటు కనిపించకుండా వుంటుంది.

## లవ్ మీ

(నవల)

[రచన: శీలంశెట్టి రమాదేవి; ప్రచురణ: విమ్. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు-1; పేజీలు: **132**; వెల: రూ. **3-50**]

ఇది ప్రస్తుతం వెలువడుతున్న కొన్ని నవలల కన్న చాలా ఎన్నదగ్గది. వర్తమాన సామాజిక పరిస్థితిని గురించి, వారి మానసిక, శారీరక, ఆర్థిక సమస్యల గురించి నిష్పక్షపాతంగా, చక్కటి అవగాహనతో రాసే ప్రతి రచన మంచి రచన అనే అనిపించుకుంటుంది.

స్త్రీ పురుషులు నేటి సమాజంలో చాలా సన్నిహితంగానూ, స్నేహంగానూ మెలిగే అవకాశాలు చాలా ఉన్నాయి. కానీ, వారి మధ్య అనేక అడ్డంకులు – వావి వరస విచక్షణ కానీ, వయస్సు కానీ, కులమత భేదాలుగా కానీ, వివాహ వ్యవస్థ కానీ – కనీ కనబడకుండా దూరంగా నిలబడుతున్నాయి. ఈ సాంఘిక వ్యవస్థలో కేవలం యవ్వనం, వయస్సు మాత్రం మనస్సును, సమాజాన్ని శాసించడం ప్రారంభిస్తే, సన్నిహితత్వం విశృంఖలంగా మారే అవకాశం ఉంది. అందువల్ల కొన్ని చెప్పుకోలేని ఆప్యాయతలు, హృదయాన్ని మెలిబెట్టే అనుభూతులు, కన్నీరు తప్ప జవాబు లేని ఆరాధనలు జీవితపు పుటలలో అక్షర పంక్తుల మధ్య నిర్లిప్తమైపోతాయి. నిర్లిప్తతగా బ్రతికే జీవితాల నిట్టూర్పులు, సామాజికపు నైతిక పరిధులలో ఒదిగిపోయే రక్తసిక్త హృదయాలలో పూచే ఎర్ర గులాబీలు అనాదిగా రచయితలకు గొప్ప ఆరాటాన్ని, స్పందనను కలుగజేస్తూనే వున్నాయి.

ఈ నవలలో హీరో యవ్వన ప్రావిర్భావం నుంచి లలితను ఆరాధిస్తాడు; ఆమె అతని కన్న వయసులో పెద్దది. పైగా వివాహితురాలు. అయినా అతను లలిత నుంచి దూరం కాలేకపోతాడు. కేవలం ఆమె సన్నిధి చాలనుకుంటాడు అతను. కానీ, అతని వయస్సు అంతటితో తృప్తి పడదు. లలిత భయపడుతుంది. అతనికి పెళ్లి చేస్తే దారి మళ్లుతాడని ఆశపడుతుంది. మొగవాడి ఆరాధనను, కేవలం తన అహాన్ని సంతృప్తిపరుచుకోవడం కోసరం ఉపయోగించుకుని, అటు తరవాత మౌనంగా సంఘం వెనకాల దాక్కునే పిరికి ఆడపిల్ల కాదు లలిత. ప్రతిక్షణం అతనికి హితం చెపుతుంది. ఆమె తనకు మరింత దూరమైపోతుందేమోనన్న భయంతో పెళ్లికి ఒప్పుకుంటాడు. కానీ, దానికి పరిణామమేమిటి? బలవత్తరమైన వాంఛ, ఆరాధన అతని జీవితాన్ని శాసిస్తూ ఉండగా, మామూలు మనిషిలా అతను బ్రతకగలడా? కాలానికి లొంగిపోతాడా?

ఒక మంచి సబ్జెక్టు తీసుకున్నప్పుడు, కేవలం ఇన్ని పేజీలలోనే ఇమడాలని, ఇలా ఉంటే కానీ కమర్షియల్‌గా విజయం పొందదని అనుకోకుండా రచయిత్రులు కొంచెం ముందంజ వేస్తే, ఇటువంటి రచనలు నాలుగు కాలాలు నిలబడేటట్లు రాయవచ్చు.

ఉన్నంతలో ఇది ఒక మంచి నవల.



# వినియోగదార్ల సంఘాలు ఎలా వుండాలి?

సాధారణంగా మనం ప్రతి వూళ్లోనూ 'కన్స్యూమర్ కో-ఆపరేటివ్ స్టోర్స్' పేరిట వినియోగదార్ల సహకార సంఘాల దుకాణాలను చూస్తూనే వుంటాము. ఇలా వినియోగదార్లకంటూ ప్రత్యేకంగా దుకాణాలు ఏర్పడడం మంచిదే. కాని వీటిల్లో చాలామటుకు జయప్రదం కావడంలేదు. ఎందువల్ల? కారణం - అద్దెలకి వాటికి అధికంగా ఖర్చు కావడం, సరుకులు ముందుగానే బాగా ఎక్కువగా కొని నిలవ వుంచుకోవడంవల్ల అవి పురుగులు పట్టి, ఎలుకలుకొట్టి పాడయిపోయే అవకాశాలు వుండడం, — వీటన్నిటికీ మించి వినియోగదార్లు వీటిని కూడా కేవలం మామూలు దుకాణాల్లాగే భావించి 'అది తమది....తమ కోసం ఏర్పడినట్టిది' అనే భావన లేకుండా మసలుకోవడం.

అయితే 'ఇవన్నీ కూడా జరక్కుండా చూడవచ్చు. వినియోగదార్ల సంఘాలు ఇలా కాకుండా అందరికీ ఉపయోగపడేలా రూపొందించవచ్చును'- అని నిరూపిస్తున్నది అఖిల భారతీయ గ్రాహక్ పంచాయత్.

1974లో శ్రీ బిందుమాధవ్ జోషిచే స్థాపించబడిన ఈ సంస్థ అభివృద్ధికి ఈనాటి బొంబాయిశాఖ చక్కటి ఉదాహరణ. ప్రారంభంలో అక్కడ ఈ సంస్థ ఇరవై ఎనిమిది విభాగాలుగా వుండేది. వీటిని గ్రాహక సంఘాలు అంటారు. అప్పట్లో ఐదువందల మంది సభ్యులతో వుండే ఈ సంస్థ ప్రస్తుతం బొంబాయి నగరంలోనే నూటయాభై విభాగాలతో మూడు వేల మంది సభ్యులతో వున్నది.

నిత్యావసర వస్తువులను సరఫరా చేసే ఈ సంస్థ మొదట్లో ఇరవై ఐదు వేల రూపాయల విలువచేసే వస్తువులు పంపిణీ చేసేది. ప్రస్తుతం ఈ అంకె నాలుగు లక్షల రూపాయలకు పెరిగింది. ఆరంభంలో ఈ సంస్థ సభ్యులే వస్తువులను చేరవేసేవారు. స్థానిక పాఠశాలలు తదితర ప్రజా కార్యాలయాలు ఆదివారం నాడు వీరి కార్యకలాపాలు నిర్వహించేందుకు వసతి సౌకర్యాలను ఉచితంగా ఇచ్చేవారు. ప్రస్తుతం ఈ సంస్థలో ఎనిమిది మంది జీతం మీద పని చేస్తున్నారు. వస్తువులను భద్రపరిచేందుకు ఒక గిడ్డంగిని కూడా సమకూర్చుకున్నారు.

ఇంతకీ ఈ సంస్థ ఎలా నిర్వహించబడుతోంది?

ఈ వినియోగదార్ల సంస్థకి అనుబంధ సంస్థగా ఏర్పడాలంటే నగరంలోని ఏ ప్రాంతంలోనైనా, హౌసింగ్ బోర్డు కాలనీలోనైనా ఇరవైమంది సభ్యులు కలిసి ఒక విభాగంగా ఏర్పడాలి. వారు తమలో ఒకరిని తమ ప్రతినిధిగా ఎన్నుకోవాలి. ఇలా ఎన్నుకోబడిన వ్యక్తిని 'సంఘ ప్రముఖుడు' అని అంటారు. ఈ విభాగం ఎటువంటి అడ్డూ లేకుండా అఖిల భారతీయ గ్రాహక్ పంచాయత్‌కి అనుబంధ సంస్థ కావచ్చును.

ఈ విభాగంలోని సభ్యులు ప్రతినెలా 20వ తారీఖుకల్లా రానున్న నెలలో తమకి కావలసిన నిత్యావసర వస్తువుల పట్టికను తమ ప్రతినిధికి సమర్పించాలి. అలా సమర్పించిన ఒకటి రెండు రోజులలో ఈ ప్రతినిధి తమ విభాగానికంతటికీ కావలసిన వస్తువుల పట్టికను తయారుచేసి కేంద్ర సంఘం అయిన 'అఖిల భారత గ్రాహక్ పంచాయత్' కార్యాలయానికి సమర్పించాలి. (ఇలాంటి కేంద్ర సంఘాలు ప్రతి నగరంలోనూ స్థాపించుకోవాలి.) ఈ కేంద్ర సంఘం కార్యకర్తలు నగరంలోని నలుమూలలలో వున్న వివిధ విభాగాల నుండి తమకు అందిన వస్తువుల పట్టికలను పరిశీలించి మొత్తం అందరికీ కావలసిన వస్తువులన్నిటినీ కలిపి పట్టిక తయారు చేస్తారు.

ఇక తరువాయి ఆ వస్తువులను కొనుగోలు చెయ్యడం. ఇందుకు ఆయా వస్తువులు ఖరీదు చెయ్యడంలో బాగా అనుభవం వున్న కొందరు స్త్రీలు, పురుషులతో 'కొనుగోలు శాఖ' ఒకటి కేంద్ర సంఘంలోనే ఒక భాగంగా ఏర్పాటు చేసుకుంటారు. వీరు ప్రతినెలా 25వ తారీఖున హోల్‌సేల్ మార్కెట్‌కి వెళ్ళి విభిన్న దుకాణాలలో వెలలు కనుక్కొని ఎక్కడ నాణ్యతగల వస్తువులు చవకగా లభిస్తే అక్కడ తమకు కావలసిన వస్తువులను 'ఆర్డర్' చేస్తారు. ఇలా కొంటున్నప్పుడు వాటి ధర ముందుగా చెల్లించరు. 25వ తేదీ ఆర్డర్ చేసిన వస్తువులు పై నెల 5వ తేదీకల్లా కేంద్ర సంఘం గిడ్డంగికి వచ్చి చేరుతాయి. అలా వస్తువులు వచ్చి చేరిన తర్వాత అమ్మకందార్లకి వాటి ధర చెక్కు రూపంలో చెల్లించబడుతుంది. ధనరూపేణా ఎటువంటి లావాదేవీలూ జరగవు.

ఈ లోగా మొదట ఒక్కొక్క విభాగం నుంచి రాబట్టవలసిన మొత్తాన్ని లెక్కగడతారు. ఆ తర్వాత విభాగ ప్రతినిధులు ఒక్కొక్క వ్యక్తి వారి వారి పట్టికలనుబట్టి ఎంత మూల్యం చెల్లించవలసినదీ చూస్తారు. నెలలో మొదటి రెండు రోజుల్లోగా ఆ ధనాన్ని విభాగ ప్రతినిధులు సభ్యుల వద్ద నుండి రాబడతారు.

ఇలా చెల్లించబడిన మొత్తాన్ని బ్యాంకిలో వినియోగదార్ల సంఘం పేరిట ప్రారంభించిన 'అకౌంట్'లో జమ చేస్తారు. బొంబాయిలో 150 విభాగాలకు చెందిన కార్యకర్తలూ తాము సేకరించిన ధనాన్ని నగరంలోని బ్యాంక్ ఆఫ్ మహారాష్ట్ర శాఖలలో వేటిల్లోనయినా జమ చేయవచ్చు. అందుకు కారణం వీరి కేంద్ర సంస్థ అయిన అఖిల భారతీయ గ్రాహక్ పంచాయత్‌కి

ఆ బ్యాంకిలో అకౌంట్ వుండడం. ఈ బ్యాంకి శాఖలు ఎటువంటి ఖర్చు లేకుండా ఆ ధనాన్ని కేంద్ర సంఘానికి ఖాతా వున్న బ్యాంకికి చేరవేయడానికి బ్యాంక్ ఆఫ్ మహారాష్ట్ర అంగీకరించింది.

ఇక కేంద్ర సంఘం గిడ్డంగికి చేరిన వస్తువులను పంపిణీ చెయ్యడం. ఆ వస్తువులను నెల మొదటి వారం ముగిసే లోపుగా ఒక టెంపో సహాయంతో వివిధ విభాగాలకి చేర్చుతారు. ఆ విభాగ ప్రతినిధులు పట్టిక ప్రకారం ఎవరికి చేరవలసిన వస్తువులు వారికి చేరవేస్తారు. ఈ వస్తువులు పంపిణీ చెయ్యడంలో స్త్రీలు ప్రధాన పాత్ర వహించడం చెప్పుకోదగ్గ విషయం. నిజానికి ఈ ఉద్యమానికి వెన్నెముక అక్కడి స్త్రీలే!

ఇలా పంపిణీ చెయ్యడం పూర్తయ్యాక నెల మధ్యలో వచ్చే ఆదివారం నాడు విభాగ ప్రతినిధులందరూ సమావేశమవుతారు. తాము ఎదుర్కొంటున్న సమస్యల గురించి చర్చిస్తారు. తమ శాఖ పంపిణీ విధానంలో ఏవైనా పొరపాట్లు జరిగితే వాటిని ఇతరుల దృష్టికి తెస్తారు. సలహా సంప్రదింపులు జరుపుతారు. రాబోయే నెల పంపిణీ గురించి ఒక ప్రణాళిక వేసుకుంటారు.

మొత్తానికి ఇలా వినియోగదార్ల పంచాయితీ ద్వారా వస్తువులు ఖరీదు చెయ్యడం వలన పప్పుదినుసులు, ధాన్యము, గోధుమలు, వంటనూనెలు, సబ్బులు, గుడ్డలు యితర వస్తువులపై పది నుంచి ఇరవైఐదు శాతంవరకూ పొదుపు చెయ్యవచ్చునని రుజువయ్యింది. అందుకు కారణం వస్తువులను నేరుగా తయారీదారు నుంచి కొనుగోలు చెయ్యడం, అలా వీలుకానప్పుడు వారిచే నియమింపబడిన పంపిణీదారువద్ద నుంచి పెద్ద మొత్తం మీద ఖరీదు చేయడం. ఇలా చేయడం వల్ల మధ్యనున్న అక్రమ వ్యాపారస్తుల 'ధరలదోపిడీ'కి తావు వుండదు.

ఈ వినియోగదార్ల పంచాయతీ ఏర్పడడంలో ముఖ్యోద్దేశం వినియోగదార్లకి చవకగా వస్తువులు లభించేలా చూడడం మాత్రమేకాదు. వినియోగదార్లకు వారి బాధ్యత తెలియజెప్పి, వారికి జరుగుతున్న అన్యాయాలను ఎదుర్కొనే సంఘటితశక్తిని కలుగజేయడం కూడా. అందుకే బొంబాయిలోని ఈ శాఖ మందులవెలలు అధికమయినప్పుడు నిరసనగా ఉద్యమం లేవదీయడం, ప్రభుత్వపాల సరఫరా వుద్యోగులు సమ్మె చేసినప్పుడు పాల సరఫరా తమంతటతామే చేయడం, నోటుపుస్తకాల ధరలు పెరిగినప్పుడు-చిన్న పరిశ్రమల సహకారంతో విద్యార్థులకు సరసమైన ధరలకు నోటుపుస్తకాలు విక్రయించడం వంటి కార్యక్రమాలు చేపట్టింది. ఇవేకాకుండా అహమ్మదాబాద్‌లోని 'వినియోగదార్ల విద్య, పరిశోధక కేంద్రం' సహకారంతో కొన్ని ప్రభుత్వ సంస్థలలోని లోపాలను ఎత్తిచూపి తగిన చర్యలు తీసుకునేలా చేసింది.

అఖిలభారత గ్రాహక్ పంచాయత్ తమ సభ్యులకు ఎప్పటికప్పుడు వివిధ అంశాల గురించి తెలియబరచడానికి 'గ్రాహక్ శక్తి' పేరిట ఒక పత్రికను కూడా వెలువరుస్తున్నది. ఇది కాకుండా మీటింగులు, శిక్షణా కార్యక్రమాలు కూడా నిర్వహిస్తున్నది. ఒక సుగుణమేమంటే ఈ సంఘ కార్య నిర్వాహకవర్గ సభ్యులు ఎవరైనా రాజకీయ పదవిని పొందినట్లయితే మరుక్షణం ఈ సంస్థలో తమ పదవిని కోల్పోతారు. ఆ విధంగా ఈ వినియోగదార్ల సంఘం రాజకీయాలకి దూరంగా వుంటోంది.

ఇలా వినియోగదార్లందరూ సంఘటితమై ఊరూరా ఇటువంటి సంఘాలు స్థాపించాలి. ఇందుకు ప్రతి వూళ్లో వుండే మహిళామండలులూ, లయన్స్ క్లబ్ వంటి సేవాసంస్థలూ పూనుకోవాలి. అప్పుడే అందరికీ అందుబాటులో వుండే ధరలకి వస్తువులూ లభిస్తాయి; తద్వారా ధరలను అదుపులో పెట్టడానికి కొంత వీలవుతుంది. □



జె. సుశీల



తీరికవేళల్లో వృధాగా సమయం గడపకుండా గృహాలంకరణకి తోడ్పడే వస్తువులు మనంతట మనమే తయారు చేసుకుంటే కాలక్షేపం అయినట్లు వుంటుంది; ఇంటిని శోభాయమానంగా తీర్చిదిద్దడానికి వీలయినట్టూ వుంటుంది. అలా నూటయాభైరకాల దాకా బొమ్మలు, డిజైన్లు, అల్లికలు, ఎంబ్రాయిడరీ వంటి చేతి పనులు చేసి పలువురి ప్రశంసలు పొందిన వనిత - శ్రీమతి జంధ్యాల సుశీలా కాంతారావు.

అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగా 1975లో మచిలీపట్నంలో జరిగిన జిల్లా స్థాయి చేతిపనుల ప్రదర్శనలో ఆమెకు ప్రథమ బహుమతి లభించింది. ఇటీవల మచిలీపట్నం చిత్రకళా సంసద్ ఏర్పాటు చేసిన గృహాలంకరణ ప్రదర్శనలోనూ, జర్మన్‌దేశ ప్రతినిధులు మచిలీపట్నం విచ్చేసిన సందర్భంగా ఏర్పాటు చేయబడిన ప్రదర్శనలోనూ కూడా ఆమె పాల్గొన్నారు. పశ్చిమ జర్మనీ సహకారంతో మచిలీపట్నంలో నిర్వహింపబడుతున్న 'ఇన్‌స్టిట్యూట్ ఫర్ ది ఎడల్ట్ అండ్ కమ్యూనిటీ ఎన్‌లైటెన్‌మెంట్' సంస్థలో ఆమె గౌరవ సభ్యురాలు. ఆ సంస్థలో శిక్షణ పొందుతున్న వనితలకు ఆమె బొమ్మల తయారీలో శిక్షణ యిస్తున్నారు.

శ్రీమతి సుశీల స్పాంజి ముక్కలతోనే కాక చీపురుపుల్లలు, వరిగడ్డితోనూ అందమైన బొమ్మలు తయారు చేయడంలో సిద్ధహస్తురాలు. క్రాస్‌స్టిచ్, అప్లిక్ వర్క్, ఫాబ్రిక్ పెయింటింగ్‌లలోనూ సాఫ్ట్‌డాల్స్, గోనెపట్టాతో అనేక రకాలైన-హాండ్ బ్యాగ్‌లు, స్వెట్లర్లను తయారు చేయడంలోనూ ఆమె ప్రవీణురాలు. 'కాదేదీ కవిత కనర్హం' అన్నట్లు "చేతిపనులకు పనికిరాని వస్తువంటూ ఏదీ లేదు" అంటారు సుశీలా కాంతారావు.

—కె. రామరత్నం

# న్యాయమే గెల్చింది!

డా. సి. ఆనందారామం



అలమారంతా వెతుకుతున్నాడు వాసు, అమ్మటానికి ఏమైనా దొరుకుతాయోయేమోనని. ఇంట్లో అమ్మ దగినవన్నీ ఎప్పుడో అమ్మేసాడు. తాగటానికి డబ్బుల్లేవు. తాగకుండా బ్రతకలేడు. తిక్కగా ఉంది. ఎవరినైనా తన్నాలని ఉంది. రాధ ఉంటే, హాయిగా చితకతన్నేవాడు. తన తన్నులన్నీ తిని ఏడ్చుకుంటూ ఎలాగో ఇంత వండిపెట్టేది. అంతే! అన్నమే పెట్టేది! ఎంత తన్నినా తాగటానికి డబ్బులిచ్చేది కాదు. అందుకే, డబ్బు తెమ్మని తన్ని పుట్టింటికి తగిలేసాడు. ఇవాళోరేపో వస్తుంది, ఏడ్చుకుంటూ, డబ్బు తీసుకుని! ఆడది!.... మొగుడి దగ్గిరకి రాక ఎక్కడికి పోతుంది? అందులో రాధకి చదువు కూడా లేదు. అణిగిమణిగి పడి ఉంటుందని చదువు రానిదాన్ని చేసుకున్నాడు.

ఇల్లంతా వెతగ్గా రాధ వదిలేసి వెళ్లిపోయిన రెండు పాత చీరలు కనిపించాయి. అవి సంచీలో కుక్కుకుని బజారు బయలుదేరాడు. కిళ్ళీ దుకాణంలోని సినిమాపత్రిక అట్ట మీద బొమ్మ చిరునవ్వుతో పలకరించింది. కళ్ళు తిరిగినట్లయింది. ఎవరది? ఎవరా అమ్మాయి? కళ్ళు నులుముకుని చూసాడు. నవ్వినప్పుడు బుగ్గలలో పడే సొట్ట. కనుకొలకుల్లో




1. ఐరోపా ఖండంలో ఇంగ్లండు ప్రధాని మార్గరెట్ థాచర్ కాకుండా ఇటీవల మరో వనిత కూడా ప్రధాని అయ్యారు. ఆమె ఎవరో....ఏ దేశానికి ప్రధాన మంత్రి అయ్యారో చెప్పగలరా ?
2. మనదేశంలోకల్లా అత్యున్నత న్యాయస్థానమైన సుప్రీంకోర్టు ఎప్పుడు ప్రారంభించబడింది ?
3. గత సంవత్సరం సెప్టెంబర్ నెలలో క్యూబా రాజధాని హవానాలో అలీన దేశాల సమావేశం జరిగింది ఈ కూటమిలో సభ్యులైన దేశాలు ఎన్ని ?
4. 1979-80 సంవత్సరానికి ఐక్యరాజ్యసమితికి అధ్యక్షుడుగా ఎన్నుకోబడిన వ్యక్తి ఎవరో చెప్పగలరా ?
5. గత సంవత్సరం నెహ్రూ సాహిత్య బహుమతి ఎవరికి లభించింది ?
6. మన పార్లమెంట్‌లో రెండు సభలు వున్నాయి. అవి లోక్‌సభ, రాజ్యసభ. ఐతే వీటిల్లోని సభ్యుల సంఖ్య ఎంత?
7. ఉపరాష్ట్రపతి మహమ్మద్ హిదయతుల్లా ఇదివరలో మనకి ప్రధాన న్యాయమూర్తిగా వుండేవారు. ఆయన మనకి ఆరవ ఉపరాష్ట్రపతి. మరి ఇంతకుముందు వున్న ఐదుగురు ఉపరాష్ట్రపతులు ఎవరో చెప్పగలరా ?
8. నిలుచునే నిద్రపోగల జంతువు ఏది ?
9. అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా ఐక్యరాజ్యసమితి బాలల శ్రమపై ఒక సర్వే జరిపింది. అందులో బాలల శ్రమ అధికంగా వున్న ఆరు దేశాలలో భారతదేశం ఒకటి. తక్కిన ఐదు దేశాలు ఏవి ?
10. జనవరి నెలకి ఆ పేరెలా వచ్చిందో చెప్పగలరా ?

[సమాధానాలు ఈ సంచికలోనే వున్నాయి. వెతికి మీ సమాధానాలతో సరిపోతాయేమో పోల్చి చూసుకోండి]

చిలిపితనం, వంగిన విల్లులా ఉండే కనుబొమ్మలు. సోగకన్నులు, సందేహం లేదు. రాధ!....

"ఏవండీ, ఆ పత్రిక ఒకసారివ్వండీ! చూసి ఇస్తాను."

దుకాణాదారు వాసుని పై నుంచి కిందకి ఒకసారి చూసి చీదరింపుతో "పో! పో! కావాలంటే కొని చదువుకో! ఊరికే ఇవ్వను" అన్నాడు.

"ఏమిటో, ఈ తెలుగు దేశంలో ఒక్కరూ పత్రికలు కొని చదవరు. అందరూ ఒకసారి చూసి ఇస్తామంటారు...." అని విసుక్కున్నాడు లోలోపల.

వాసు అంతటితో వదిలిపోలేదు. అతడు మరొకరిని ఎంతగా చీదరించుకోగలడో, మరొకరి చీదరింపులు కూడా అంతగా భరించగలడు.

"ఏవండీ! ఆ ఫోటో నా భార్యది. ఒక్కసారి చూసి ఇస్తానండీ!" అన్నాడు మళ్ళీ....ఆ మాటలు విని దుకాణాదారుడు పొట్ట చేత్తో పుచ్చుకుని విరగబడి నవ్వాడు.

"ఏమిటయ్యా! ఎంత తాగితే మాత్రం ఇంత వొళ్ళెరక్కుండా మాట్లాడతారా? పో! పో!" అన్నాడు. వాసు చెయ్యగలిగిందేమీ లేకపోయింది. ఇంటికెళ్ళి పెళ్ళి ఫోటో తెచ్చుకుని భార్య ఫోటో, ఆ ముఖచిత్రంలో ఫోటో పోల్చిపోల్చి చూసుకున్నాడు. సందేహం లేదు. ఆ ఫోటో రాధదే! రాధ పాత చీరలమ్మేసి ఆ డబ్బుతో సినిమా పత్రికను కొన్నాడు. ఆ పత్రిక లోపలి పేజీలలో ఆ తారవే మరి కొన్ని ఫోటోలున్నాయి. చూసిన కొద్దీ వివరాలు చదివిన కొద్దీ ఆ తార రాధే నన్న అనుమానం దృఢపడింది వాసులో. అయితే ఆ తార పేరు సుహాసిని అని ఉంది పత్రికలో. దానికేముందీ? సినిమాలలో చేరాక, సాధారణంగా తారలకు పేర్లు మార్చి కొత్త పేర్లు పెడుతుంటారట! ఏమైనా అసలు విషయం తెలుసుకోవాలి.

ఆ రోజే టికట్ లేకుండా మద్రాస్ రైలు ఎక్కాడు వాసు.

*

అలారం మోతకు మంచంలోంచి లేచి, చేయవలసిన వ్యాయామం ముగించుకొని కిటికీ తలుపులు తెరిచింది సుహాసిని. పల్చని నైలాన్ తెరలు ఒత్తిగించింది. అప్పుడే అరుణకాంతులు పల్చబడి తెలుపులోకి తిరుగుతున్నాయి. గులాబుల మీద నుంచీ, వచ్చిన సన్నజాజుల మీద నుంచీ వస్తున్న ప్రభాత వాయువులు వింత పరిమళాలతో మనసుకు హాయి గొలుపుతున్నాయి. "అబ్బ! ఎంత హాయిగా ఉంది జీవితం?" అనుకుంది సుహాసిని.

గేటు దగ్గిర గూర్ఖా ఎవరితోనో గట్టిగా అరుస్తున్నాడు. మామూలే! ఎవరో లోపలికి రావాలని తాపత్రయపడుతున్నారు. గూర్ఖా రానియ్యడం లేదు. తారగా కొద్దిగా పేరు తెచ్చుకున్నాక ఇలాంటివి మామూలైపోయాయి. కుతూహలం కొద్దీ అటు చూసింది. సరిగ్గా అదే సమయంలో అతడూ కిటికీ వైపు చూసాడు. "రాధా!" అని ఒక్క అరుపు అరిచాడు. సుహాసిని గబుక్కున తలను వెనక్కు లాక్కుంది. అక్కడ ఒక్కక్షణం నిలవకుండా పరుగున తల్లి దగ్గిరకు వచ్చింది.

తారగా అప్పుడే పైకి వస్తున్న సుహాసినికి బేంక్ బేలన్స్ అంతగా లేదు. ఆడంబరం కోసం, రక్షణ కోసమూ, గేటు దగ్గిర గూర్ఖాను పెట్టినా, ఇంట్లో వంట మాత్రం తల్లి తనే చేస్తుంది. సుడిగాలికి రాలి ఆకులా వణికిపోతూ తన దగ్గిరకు వచ్చిన సుహాసినిని చూసి ఆందోళనగా "ఏమిటమ్మా? ఏం జరిగింది?" అని అడిగింది తల్లి–

"వాడు-వాడు వచ్చాడు" అన్నది సుహాసిని అప్పటికే వణికిపోతూ.

"వాడంటే"

"నా పాలిటి రాక్షసుడు – నా జీవితానికి పట్టిన శని దేవత. నువ్వు వేలకొద్దీ డబ్బు గుమ్మరించి మరీ నన్ను అర్పించిన ఆ పురుషోత్తముడు."

తల్లికి అర్థమయిపోయింది. ఆమెకూ ఒక్కక్షణం కాళ్ళుచేతులు ఆడలేదు. అంతలో గుండె దిటవు పరచుకుని "నువ్వు భయపడకు. వాడు మననేం చెయ్యగలడూ? నీ పని నువ్వు చూసుకో!" అన్నది.

స్టూడియో కారు వచ్చి గుమ్మంలో ఆగినట్లు

హారన్ వినిపించింది. షూటింగ్‌కి వెళ్ళాలి. టైం లేదు. తన ఇష్టం వచ్చినట్లు వెళ్ళటానికి తనింకా అంత పైకి రాలేదు. ఎన్నో జతల కళ్ళు తనను ఈర్ష్యగా చూస్తున్నాయి. అణగతొక్కాలని ప్రయత్నిస్తున్నాయి. త్వరత్వరగా తయారయి కారులో కూచుంది. కారు గేటు దాటుతుంటే, మళ్ళీ "రాధా! రాధా!" అని అరిచాడు వాసు. సుహాసిని గుండెల దడదడ ఆమెకే భయంకరంగా వినిపించింది.

*

ఫైల్స్ సర్దుకుని బయటికొస్తున్న జర్నలిస్టులని ఆపు చేశాడు వాసు. "సార్! సార్! నన్నొక్కసారి లోపలికి తీసికెళ్ళండి! ఈ సుహాసిని నా భార్యండీ, భార్య! అగ్నిసాక్షిగా వివాహం చేసుకున్న భార్య" అన్నాడు.

ఈ మాటలతో జర్నలిస్టుల ముఖాలు ఒక్కసారిగా వెలిగిపోయాయి. ఇలాంటి "హాట్, హాట్" వార్తల కోసమే ఎదురు చూస్తుంటారు వాళ్ళు. "అలాగే తీసికెళ్తాం కాని, ముందు హోటల్‌కి రండి!" అన్నారు. హోటల్‌కి తీసికెళ్ళి సుష్టుగా మేపారు. "మీరు చెప్పుతున్న దానికేమైనా ఆధారాలున్నాయా?" అని అడిగారు. అతడు తనతో తెచ్చుకున్న పాత సూట్‌కేస్ తెరిచి పెళ్ళి ఫొటోలూ, శుభలేఖలూ చూపించాడు. జర్నలిస్టుల కళ్ళు మెరిసాయి. వెంటనే ఆ ఫోటోల కాపీలు తీసుకున్నారు. పత్రికలలో వార్తలు — "ప్రేక్షకులలో సంచలనం; సుహాసిని గుండెలలో అగ్ని — 'రాధగా వాసుని వివాహం చేసుకున్న సుహాసిని....'"

"సినిమా మోజులో అగ్నిసాక్షిగా వివాహం చేసుకున్న భర్తను వదిలిన తార—"

"పవిత్ర భారతనారీ ధర్మాన్ని మరిచి నీతినియమాలకు తిలోదకాలిచ్చి మానమర్యాదలు మరిచిన మన తారామణి."

ఇలా రకరకాల వ్యాఖ్యానాలతో వాసుతోసహా సుహాసిని ఫోటోలు పత్రికలలో రాసాగాయి. ఈ పుకార్లతో పత్రికలు బాగా సొమ్ము చేసుకోసాగాయి. వాసుకి కూడా తిండికీ, త్రాగటానికీ లోటు లేకుండా పోవటంతో హుషారుగా వున్నాడు.

రగిలిపోతున్నది సుహాసిని ఒక్కర్తే! ఆమెకు రాబోయిన మరో సినిమా ఛాన్స్ ఈ పుకార్లతో వెనక్కు పోయింది. అగ్నిసాక్షిగా జరిగిన వివాహం! ఆ అగ్ని-తన గుండెలలో రగులుతున్న అగ్ని-ఏనాటికి చల్లారదా?



కె. విజయలక్ష్మి

క్రీడారంగంలో రాష్ట్ర స్థాయిలోనే కాక అంతర్ రాష్ట్ర స్థాయి పోటీలలో కూడా పాల్గొని పలు బహుమతులు పొందిన వనిత కుమారి కె. విజయలక్ష్మి. అనంతపురం ప్రభుత్వ మహిళా కళాశాలలో ఇంటర్ చదువుతున్న విజయలక్ష్మి వివిధ క్రీడలలో ఇంతవరకు 3 బంగారు, 10 వెండి, 2 కాంస్య పతకాలు సాధించింది. 'షాట్‌పుట్'లో అనేకమార్లు ప్రథమ స్థానాన్ని పొందింది. దాదాపు తొంభై యోగ్యతా పత్రాలు పొందింది. గత రెండు సంవత్సరాలలో ఆమె కుయిలన్, మద్రాసు, బెంగళూరు, నాగ్‌పూర్‌లలో జరిగిన క్రీడల పోటీలలో పాల్గొని పలు బహుమతులు, పలువురి ప్రశంసలు అందుకున్నది. నాట్యంలో కూడా ఆమెకు చక్కని అభినివేశం వున్నది. జాతీయ జట్టులో పాల్గొని అంతర్జాతీయ ఖ్యాతి గడించాలని ఆశిస్తున్నది కుమారి విజయలక్ష్మి.

*

"రాధ అందచందాలు చూసి కట్నం లేకుండా పెళ్లి చేసుకుంటున్నాడు. మన రాధ అదృష్టవంతురాలు." అని పెళ్లిలో అందరూ అంటున్నప్పుడు తను అదృష్టవంతురాలిననే అనుకుంది రాధ. వాసుతో కాపురం ప్రారంభించాకకాని ఆ అదృష్టం ఎలాంటిదో తెలిసిరాలేదు. పెళ్ళయిన కొద్ది రోజుల్లోనే అతడు త్రాగుబోతని అర్థమయిపోయింది. తప్పత్రాగి ఇంటికి రావటమే కాక, ఇంట్లో కూడా త్రాగేవాడు. ఈ వ్యసనం కారణంగానే అతడి టెంపరరీ ఉద్యోగం ఊడిపోయింది. ఇలా ఇదివరకే రెండు మూడు ఉద్యోగాలు ఊడాయని అప్పుడే తెలిసింది. ఇక అప్పటి నుంచీ రాధకు భూలోక నరకం చూపించసాగాడు వాసు. ఎప్పటికప్పుడు "వెళ్లు! మీ అమ్మనడిగి డబ్బు పట్టుకురా!" అనేవాడు. వెళ్ళకపోతే, వెళ్ళేవరకు బాదేవాడు. తల్లి దగ్గిరకి వెళ్లి కష్టాలన్నీ చెప్పుకుని ఏడిస్తే "ఏం చేస్తాం! ఖర్మ! ఏదోలే! కొన్నాళ్ళయితే, మరో ఉద్యోగం దొరుకుతుంది. అతడే బాగుపడతాడు" అని ఓదార్చి డబ్బిచ్చి పంపేసేది. రాధకు ఎంత కష్టంగా ఉన్నా, అంతకంటే ఏం చెయ్యాలో అర్థం కాక తల్లి డబ్బు తీసుకుపోయి మొగుడికర్పించేది. ఆ డబ్బు ఖర్చయ్యేవరకూ ప్రేమ ఒలకపోసి, అది కాస్తా ఆఖరవగానే, మళ్ళీ వెళ్ళి డబ్బు తెమ్మనేవాడు. ఇదంతా భరించలేక "మా అమ్మ ఎక్కడి నుంచి తెస్తుంది, ఇంతింత డబ్బు? తనకిమాత్రం ఎవరున్నారు?" అని ఎదురు తిరిగింది.

"అదే! తనకి ఎవరూ లేరనే నిన్ను చేసుకున్నాను. ఆ మూడెకరాలూ ఎప్పటికైనా నీకియ్యవలసిందేగా, ఇప్పుడే ఇచ్చెయ్యమను. తనూ మనతోనే పడుంటుంది." అన్నాడు వికటంగా నవ్వుతూ. ఆ మాటలతో కట్నం తీసుకోకుండా తనని చేసుకోవటంలోని ఆంతర్యం బయటపడిపోయింది. కన్నతల్లిని దిక్కుదివాణం లేనిదాన్ని-బికారినీ చెయ్యలేక, అతడెంత కొట్టినా తల్లి దగ్గరకు వెళ్ళనని మొండికేసింది. చిన్నప్పటినుండే డాన్స్ నేర్చుకోవటం వల్ల అక్కడి డాన్స్ స్కూల్లో చిన్న ఉద్యోగం సంపాదించి ఎలాగో ఇల్లు గడపసాగింది. రాధ సంపాదన తింటూ తన త్రాగుడుకు డబ్బులు తెమ్మని చావబాదేవాడు వాసు. ఆ దెబ్బలన్నీ భరించి మొండిగా "నేను అమ్మ దగ్గిర్నుంచి డబ్బు తేను" అని సమాధానం చెప్పింది. తాగుడు మైకంలో ఆ ఎదురు సమాధానం విని భరించలేక "తేవూ? లేకపోతే నిన్నే అమ్మేస్తాను జాగ్రత్త!" అన్నాడు గుడ్లురుముతూ.

ఆ మాటలు విని పై ప్రాణాలు పైనే పోయాయి రాధకి. ఈ త్రాగుబోతు అన్నంత పనీ చెయ్యడని నమ్మకమేమిటి? ఆడదాని రాత ఎన్ని తరాలకైనా మారదా? ఈ నాటికీ మొగవాడు భార్యను అమ్ముకోలేడా? ఇతడు అంత పనీ చేస్తే తనకు దిక్కెవరు? భర్త బారినుండి భార్యను ఏ చట్టం రక్షించగలదు?

తన సామాను సర్దుకొని "అమ్మ దగ్గిరకెళ్ళి డబ్బు తెస్తాను" అంది.

వాసు గర్వంగా మీసం మెలేసుకుని "దెబ్బకు దెయ్యం జడవాలి! ఈసారి ఏకంగా రెండు వేలో, మూడు వేలో తీసుకురా! చీటికీ మాటికీ రావటం పోవటం రైలు ఖర్చులు దండుగ" — అని హితోపదేశం చేసాడు. "అలాగే!" అని బుద్ధిగా తలూపి

రై లెక్కింది. తల్లితో జరిగినదంతా చెప్పుకుని "ఎన్ని కష్టాలైనా భరించాను. నన్ను అమ్ముతానని బెదిరిస్తున్నాడు. దుర్మార్గుడు అంత పనీ చేస్తాడని భయంగా ఉంది" అని ఏడ్చింది. ఈ దారుణానికి తల్లి కూడా బెదిరిపోయింది. ఇద్దరూ ఉన్న కొద్దిపాటి భూమీ, ఇల్లూ, అమ్ముకుని మద్రాస్ చేరుకున్నారు. అక్కడ ఏ డాన్స్ స్కూల్‌లోనయినా ఉద్యోగం చెయ్యాలని ప్రయత్నం. ఉద్యోగం దొరకలేదు కాని, అదృష్టవశాత్తూ సినిమా ఛాన్స్ దొరికింది. సహజంగా ఉన్న ప్రతిభవల్ల కొద్దికాలంలోనే పైకి రాగలిగింది. తన జీవితాన్ని ఆవరించిన మబ్బులు విడిపోయాయని మురిసిపోయేంతలోనే సైంధవుడిలా వచ్చిపడ్డాడు ఈ ప్రాణనాధుడు !!

*

హాండ్‌బేగ్ తెరిచి ఉత్తరం తీసి తన లాయర్‌కి చూపించింది సుహాసిని.

ఆ ఉత్తరం అందుకుని చదవసాగింది లాయర్ సరోజ.

"డియర్ రాధా!

మన మధ్య ఈ విడాకుల దావా నాకెంతో మనస్తాపం కలిగిస్తోంది. నేను నిన్నెంత ప్రేమించానో నీకు తెలియదు. అప్పుడు త్రాగుడుకు లొంగి నిన్ను చాలా బాధపెట్టాను. అందుకు ఇప్పుడెంత పశ్చాత్తాప పడుతున్నానో నీ కర్థం కాదు. ఇప్పుడు త్రాగుడు పూర్తిగా మానేశాను. ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నాను. రాత్రింబగళ్లు నీ ధ్యాస తప్ప మరొకటి లేదు. నువ్వు పక్కన ఉంటే కాని నాకు స్థిమితం లేదు. నువ్వు నయాపైస లేకుండా వచ్చినా, నిన్ను నిండు హృదయంతో స్వీకరిస్తాను - నీకోసం కలవరించే....

నీ

వాసు

ఉత్తరం మడిచి, "ఇంతకూ ఏం నిర్ణయించుకున్నారు?" అని అడిగింది లాయర్ సరోజ.

సుహాసిని నీరసంగా "ఈ సినిమా రంగాన్ని నమ్ముకోవటానికి లేదు. ఇవాళ దేదీప్యమానంగా వెలిగిన వాళ్ళు రేపటికి ఆరిపోతున్నారు. కాంపిటీషన్ చాలా ఎక్కువగా ఉంది. ఎవరు నిలవగలరో చెప్పలేకపోతున్నాం. ఈ పరిస్థితులలో ఈ గాలివాటం బ్రతుకు కంటె ఆయనతో నా కాపురం నేను చేసుకోవటం మేలేమో! ఈ మధ్య ఆయన మాటల్లోనూ, ఆయన ఉత్తరాల్లోనూ చాలా మార్పు కనిపిస్తోంది" అంది.

పకాలున నవ్వింది సరోజ.

"మన ఆడవాళ్ల ఆలోచనలిలా ఉండబట్టే మన సమస్య లేనాటికీ పరిష్కారం కావటం లేదు. ఉండు-ఇతని ఘాటు ప్రేమలో సారమెంతో ఇప్పుడే తేలుస్తాను."

సుహాసినిని పంపేసి వాసుని పిలిపించింది సరోజ. రాజీ ప్రయత్నాలకని సంబరంగా వచ్చాడు వాసు.

"మిస్టర్ వాసూ! నీ ముందు రెండు మార్గాలు చూపిస్తున్నాను-ఏది కావాలో నువ్వే నిర్ణయించుకో! సుహాసినికి రెండు మూడు సినిమాలలో ఛాన్స్ వచ్చినా, బేంక్ బేలన్స్ ఏమీలేదు. వచ్చినది వచ్చినట్లు పోషణకీ, అలంకారాలకీ ఖర్చయిపోయింది. సుహాసిని కూడా సినిమా జీవితాన్ని పూర్తిగా వదిలేసి నీతో వచ్చెయ్యాలనే అనుకుంటూంది."

సరోజ ఆశించినట్లే గాభరా పడ్డాడు వాసు.

"అలా ఎందుకూ? తను సినిమాలలో నటిస్తూ నాతో ఉండకూడదా?" అన్నాడు. సరోజ నవ్వుకుంది.

"అలా సుహాసినికిష్టం లేదు. నీతో పూర్తిగా తెగతెంపులయితేనే సినిమాలలో నటిస్తుందట! అందుకు పరిహారంగా ఎలాగో తంటాలుపడి నీకు పదివేలు ఇస్తానంది. పదివేలు తీసుకుని సుహాసినిని వదిలేస్తావో, లేక సుహాసినే కావాలనుకుని, సినిమా నటి కాని సుహాసినిని తీసుకుపోతావో నీ యిష్టం!"

వాసు ఆలోచనలో పడ్డాడు. సినిమా నటి కాని సుహాసినివల్ల తనకేం ప్రయోజనం? ఇప్పుడు భార్యను పోషించే స్థితిలో లేడు తను. ఆ పదివేలే రానీ! ప్రస్తుతానికి పని గడుస్తుంది! ఆ తరువాత చూసుకోవచ్చు. ఇంతటితో దీన్ని - తన భార్యను వదుల్తాడా?

"నాకు పదివేలిప్పించండి. సుహాసిని జోలికి రాను" అన్నాడు.

సరోజ ముఖం వికసించింది.

"అయితే, అలా అని వ్రాసి సంతకం చేసి ఇయ్యి. రేపే నీకు డబ్బు తెప్పిస్తాను" అంది.

వాసు రూమర్లు కాష్ చేసుకొనే పత్రికలకు తన ప్రణయగాథ చిలవలు పలవలుగా వర్ణించి కాస్త సొమ్ము చేసుకొంటున్నాడే తప్ప లాయర్ని పెట్టుకోలేదు. భర్తననే అధికారంతో భార్యను సతాయించగలడే తప్ప లీగల్‌గా ఆలోచించలేడు.

పదివేల రూపాయలు కళ్ళముందు కదులుతున్న సంతోషంతో, సరోజ చెప్పినట్లు వ్రాసి సంతకం పెట్టి సరోజకిచ్చాడు. "డబ్బు కోసం ఎప్పుడు రమ్మంటారు?" అని అడిగాడు ఆత్రంగా—

"రేపు కాదు - ఎల్లుండి రండి." అంది సరోజ. కానీ ఆ 'ఎల్లుండి' వాసు జీవితంలో రానే లేదు. వాసు ఉత్తరం ఆధారంగా, సరోజ వాసు డబ్బు కోసం సుహాసినిని పీడించేవాడనీ, వ్యసనపరుడనీ, రుజువుచేసి సుహాసినికి విడాకు లిప్పించగలిగింది. తీర్పు విన్నె వాసు "ఇది అన్యాయం!" అని లబలబ లాడాడు.

"ఇందులో అన్యాయం కాని, వంచన కాని, ఏమాత్రం లేదు మిస్టర్ వాసూ! న్యాయమే గెలిచింది" అంది చిరునవ్వుతో సరోజ. □

## పసిపాపలు

చిన్నారి పొన్నారి పువ్వులు
మా యింట తిరుగాడె నవ్వులు
చిట్టి పొట్టి చిన్ని చిన్ని చిలుకలు
ముద్దు ముద్దు బంగారపు పలుకులు
అల్లిబిల్లి నన్ను కన్న తల్లులు
వెల్లివిరిసి గుబాళించు మల్లెలు
ఆకతాయి అల్లరితో పిల్లలు
లోకమంత చిలిపితనం జల్లులు!
చిన్నతనంలోనే తప్పటడుగులు
ముందు ముందు వేయరింక తప్పటడుగులు
గుడులెందుకు ప్రతియింట పాపలుండగ
పసి నవ్వులు వికసించిన ప్రతిరోజూ పండుగ

—అబ్బూరి రాజ్యలక్ష్మిదేవి



తల్లో పేలు పోవాలంటే వెల్లుల్లి పాయలు నూరి నిమ్మరసంలో కలిపి తలకు రాసి పది నిముషాలు వుండి తలంటుకుంటేచాలు. —వి. నళిని



# పిల్లలు లేకపోవడానికి కొన్ని కారణాలు

మాతృత్వంతోనే స్త్రీకి పరిపూర్ణత చేకూరుతుంది. నవమాసాలు మోసి, కని, పాలు పట్టి, పాపను లాలించి పెంచడంలో తల్లి పొందే ఆనందం అంతా ఇంతా కాదు. అయితే తల్లి అయ్యే భాగ్యం అందరికీ లభ్యం కావటంలేదు. దీనికి కొన్ని మూలాధార కారణాలు వున్నాయి. ఆ లోపాలను తెలుసుకుని సరిదిద్దుకోడం కూడా ఈ వైజ్ఞానిక యుగంలో సాధ్యం అన్న విషయం చాలామందికి తెలియదు.

కూతురికి పెళ్ళి చెయ్యాలంటే మన పెద్దలు చూసేది మొదట పెళ్ళికొడుకు చదువు, ఉద్యోగం, ఆస్తి అంతస్తు. కొడుక్కి పెళ్ళి చెయ్యాలంటే కాబోయే కోడలి అందచందాలు; తీసుకొచ్చే కట్నం కానుకలు అన్న విషయాలలో విపరీతమైన శ్రద్ధా సక్తులు కనబరుస్తారు. ఆ తర్వాత జాతకాల తతంగం. ఇద్దరి జాతకాలనూ తెప్పించి - తిథి, నక్షత్ర, గ్రహస్థితిగతుల్ని లెక్కగట్టి పొందికగా వుంటేనే పెళ్ళిళ్ళు చేస్తారు. ఇలా శాస్త్ర ప్రకారం పెళ్ళిళ్ళు జరిపినా కొందరికి సంతానం లేని స్థితి. అలా అని వీటన్నిటినీ లెక్క చెయ్యకుండా ప్రేమించి పెళ్ళి చేసేసుకున్నవాళ్ళందరికీ సంతాన ప్రాప్తి వుంటోందా? అంటే అదీ సందేహమే! మరయితే దీనికి కారణం ఏమిటి? మనలో వైజ్ఞానిక పద్ధతి ప్రకారం పెళ్ళిళ్ళు జరగకపోవడమే దీనికి కారణం అంటారు వైద్యవేత్తలు'

మనిషి రక్తం నాలుగు రకాలుగా వుంటుంది. దానిని ఎ, బి, ఎబి, ఓ, అని నాలుగు విధాలుగా విభజించారు. ప్రపంచంలో దాదాపు నలభై శాతం మందికి 'ఓ' గ్రూపు రక్తం; ఎ గ్రూపు ఇరవై అయిదు శాతం; ఎ బి గ్రూపు పదినుంచి పదిహేను మందికీ వుంటుందని ఒక అంచనా.

ఇందులో 'ఓ' గ్రూపు రక్తంగల పురుషుడు అదే గ్రూపు స్త్రీని పెళ్ళాడినట్లయితే – వారిలో దాదాపు 20 శాతం మందికి పిల్లలు పుట్టడంలేదు. 20 శాతం మందికి పుట్టినా పిల్లల బుద్ధికుశలత (ఐ. క్యూ) తక్కువగా వుంటోంది. నాడీమండలానికి సంబంధించిన 'సెరిబ్రల్ పాల్సీ' అన్న వ్యాధితో బాధపడే పిల్లలు అధిక సంఖ్యకులు - 'ఓ' గ్రూపు రక్తంగల తల్లిదండ్రులకు చెందిన వారే అని వైద్య పరిశోధనలవల్ల తెలుస్తోంది.

అందువల్ల 'ఓ' గ్రూపు రక్తంగలవారికి ఇతర గ్రూపు రక్తంగలవారితో పెళ్ళి కావడం ఎంతైనా అవసరం, శ్రేయస్కరం. అప్పుడే ఆరోగ్యవంతమైన శిశువుల్ని కనడం సులభం అవుతుంది. ఎ, బి, ఎ బి, గ్రూపు రక్తంగల స్త్రీ పురుషులు ఎవరిని పెళ్ళాడినా అనారోగ్య పర్యవసానాలు అంతగా ఏర్పడడం లేదని వైద్యులు అంటారు.

'ఓ' గ్రూపు రక్తంగల స్త్రీ పురుషులలో సంతానం కలగకపోవడానికి కారణం వారిలో సంతానోత్పత్తి అవయవాలు సక్రమంగా పని చేయకపోవడం.

ప్రతి పురుషునిలోనూ పద్నాలుగు - పదహారు సంవత్సరాల మధ్యప్రాయంలో అండాలు వీర్యాన్ని స్రవించడం ప్రారంభిస్తాయి. పద్నాలుగేళ్ళనుంచి పద్దెనిమిది సంవత్సరాలవరకు స్రవించే వీర్య పరిమాణం ఇంచుమించు 0.5 సి. సి.ల నుంచి 1.5 సి. సి. వరకు వుంటుంది. అటుపైన క్రమక్రమంగా అధికమవుతూ ఇరవైనాలుగు సంవత్సరాలు నిండేసరికి 3.5 సి. సి.ల కన్నా ఎక్కువవుతుంది. పరిపూర్ణ అభివృద్ధి చెందిన పురుషుడు ఒక్కొక్కసారి 4 సిసి విడుదల చేస్తాడు. సాధారణంగా ఆరోగ్యవంతమైన 1 సి. సి. వీర్యంలో డెబ్బైనుంచి నూరు మిలియన్ల వీర్యకణాలు వుంటాయి.

'ఓ' గ్రూపు రక్తం గల పురుషులలో 0.5 సి. సి. నుంచి 2 సి. సి.ల వీర్యం మాత్రమే స్రవిస్తుంది. ఇది సరిపోదని వైద్యవేత్తల అభిప్రాయం. అంతేకాదు 'ఓ' గ్రూపు రక్తం గల పురుషుల వీర్యంలో పది నుంచి ముప్పై మిలియన్ల వీర్యకణాలు మాత్రమే వుంటాయి. వీటిలో చాలా వరకు చలన రహితంగానూ, లోపసహితంగానూ వుంటాయి. అందువల్ల ఈ వీర్యకణాలవల్ల ఎలాంటి ప్రయోజనమూ వుండదు.

ఈ లోపాలకు ముఖ్యకారణం మెదడుకు క్రింది భాగంలో వున్న పిట్యూటరీగ్రంధి స్రవించే హార్మోనులు చాలినంత లేకపోవడమే. కొన్ని మందులు వాడడం వల్ల ఈ లోపాన్ని సరిచేసుకోడం సాధ్యమవుతుంది.

ఇక స్త్రీల విషయానికి వస్తే-సంతానోత్పత్తి అంగంలో రెండు అండాశయాలు వుంటాయి. అవి

ఇరవై ఎనిమిది రోజులకోసారి అండాలను విడుదల చేస్తాయి. అండకణాలు అండాశయవాహికల ద్వారా త్రిభుజకారంగా వున్న గర్భాశయం చేరుకుంటాయి అయితే కొందరు స్త్రీల అండవాహిక నాళాలమధ్య కండపెరిగి నాళికాద్వారం మూసుకుపోయి వుంటుంది. రెండు అండవాహిక నాళాలలో ఒకటి బాగున్నా ఎలాంటి ఇబ్బందీ వుండదు. రెండు అండవాహికనాళాలు పూర్తిగా మూసుకుపోయి వుంటే కొంత చిక్కే. కాని కొద్దిగా మూసుకుని వున్నట్టయితే శస్త్రచికిత్స ద్వారా నయం చెయ్యొచ్చు.

ఇటువంటి ఇబ్బంది లేని స్త్రీలకు కూడా కొందరికి సంతానం కల్గడం లేదు. దీనికీ కొన్ని కారణాలు వున్నాయి.

గర్భధారణ – అంటే అండం వీర్యకణాలతో చేరడం గర్భాశయంలో జరుగుతుంది. గర్భాశయం గోడలు ఎండోమెట్రియం అన్న కండరాలతో కప్పబడి వుంటాయి. ఈ కండరాలలో నెలకోసారి మార్పులు జరుగుతూ వుంటాయి.

మామూలు స్థితిలో - అంటే ఋతుస్రావం జరిగి ఏడు రోజుల వరకూ ఈ కండరం పలుచగానూ చదరంగా (సమతలంగా)నూ వుంటుంది. ఆ తర్వాత రెండింతలుగా దూదిపింజలా పెద్దదవుతుంది. అప్పుడు దాని ఉపరితలం సమతలంగా వుండదు. ఎగుడుదిగుడుగానూ, మిట్టపల్లాలుగా శాఖోపశాఖలై రబ్బర్‌ఫోమ్ బెడ్‌లాగా తయారవుతుంది. ఈ మార్పువల్ల అండాశయంనుంచి వెలువడే అండాలు ఓ చోట ఇమడడం, వీర్యకణాలతో కలవడం – దానివల్ల గర్భధారణ సులభం అవుతుంది. అయితే ఇలాంటి మార్పు 'ఓ' గ్రూపు రక్తం గల స్త్రీలలో ఇరవై శాతం మందికి, మిగతా వారిలో ఐదు శాతం మందికీ జరగడం లేదని తెలుస్తోంది. అందువల్ల అండాలు ఎండోమెట్రియం కండరంలో ఇమడడం లేదు.

ఇలాంటి లోపం వుందా లేదా అన్న విషయం సులభంగా తెలుసుకోవచ్చు. 26 నుంచి 28 రోజులకోసారి సక్రమంగా ఋతుస్రావం జరుగుతూ, ఆ సమయంలో సరైనంత రక్తస్రావం వుంటే ఎండోమెట్రియం ఆరోగ్యంగా వుంటుందన్న మాట. ఆ కండరం సరిగ్గా అభివృద్ధి చెందలేదనుకుంటే - ఋతుస్రావం జరగడం ముందు, వెనుకలుగా అవుతుంది. సక్రమంగా జరగదు. ఋతుస్రావ సమయంలో రక్తస్రావం మరీ తక్కువగా వుంటుంది.

పిట్యూటరీ గ్రంధి సరిగ్గా పనిచేయక పోవడమే ఇలాంటి లోపానికి కూడా కారణం అవుతుంది. సరైన చికిత్స ద్వారా దీనిని నయం చేయడం కూడా సాధ్యమే.

కొందరికి ఋతుస్రావానికి ముందూ, ఆ తర్వాతా కొన్నాళ్ళు గర్భాశయం నుంచి ఓ విధమైన ద్రవం స్రవిస్తుంది. దీనికి కొన్ని సూక్ష్మక్రిములే కారణం. ఇలాంటి క్రిములు ఎక్కువయితే గర్భధారణకు ఆటంకం ఏర్పడుతుంది. అలాంటి వారు డాక్టర్ల సలహాలతో మందులు వాడి దీనిని పోగొట్టవచ్చు.

ఇలాంటి క్రిములు చేరడానికి మన స్త్రీలలో వుండే అజాగ్రత్త, కొన్ని అనారోగ్యకరమైన అలవాట్లే కారణం. ఋతుస్రావం సమయంలో ఉపయోగించే గుడ్డలు శుభ్రంగానూ, పొడిగానూ వుండాలి. వెచ్చని నీళ్ళతోనో లేదా కొద్దిగా డెట్టాల్ వేసిన నీళ్ళతోనో శుభ్రం చేసుకోడం మంచిది. ఉపయోగించిన గుడ్డల్ని బాగా ఉతికాక డెట్టాల్ నీళ్ళలో కొంతసేపు నానబెట్టి-ఎండలో ఆరవేయాలి.

ఇలాంటి చిన్న చిన్న జాగ్రత్తలు తీసుకోడం వల్ల పిల్లలు కలగకపోవడం అన్నది సులభంగా తప్పించవచ్చు.

—డాక్టర్

# భాషలు నేర్చుకోండి

| తెలుగు | | | తమిళం | | | కన్నడం | | | మలయాళం | | | మరాఠి | | | గుజరాతి | | | ఒరియా | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శ | ష | స | — | ஷ | ஸ | ಶ | ಷ | ಸ | ശ | ഷ | സ | श | ष | स | શ | ષ | સ | ଶ | ଷ | ସ |
| శా | షా | సా | — | ஷா | ஸா | ಶಾ | ಷಾ | ಸಾ | ശാ | ഷാ | സാ | शा | षा | सा | શા | ષા | સા | ଶା | ଷା | ସା |
| శి | షి | సి | — | ஷி | ஸி | ಶಿ | ಷಿ | ಸಿ | ശി | ഷി | സി | शि | षि | सि | શિ | ષિ | સિ | ଶି | ଷି | ସି |
| శీ | షీ | సీ | — | ஷீ | ஸீ | ಶೀ | ಷೀ | ಸೀ | ശീ | ഷീ | സീ | शी | षी | सी | શી | ષી | સી | ଶୀ | ଷୀ | ସୀ |
| శు | షు | సు | — | ஷு | ஸு | ಶು | ಷು | ಸು | ശു | ഷു | സു | शु | षु | सु | શુ | ષુ | સુ | ଶୁ | ଷୁ | ସୁ |
| శూ | షూ | సూ | — | ஷூ | ஸூ | ಶೂ | ಷೂ | ಸೂ | ശൂ | ഷൂ | സൂ | शू | षू | सू | શૂ | ષૂ | સૂ | ଶୂ | ଷୂ | ସୂ |
| శృ | షృ | సృ | — | — | — | ಶೃ | ಷೃ | ಸೃ | ശൃ | — | സൃ | शृ | षृ | सृ | — | — | — | ଶୃ | ଷୃ | ସୃ |
| శౄ | షౄ | సౄ | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — |
| శె | షె | సె | — | ஷெ | ஸெ | ಶೆ | ಷೆ | ಸೆ | ശെ | ഷെ | സെ | — | — | — | — | — | — | — | — | — |
| శే | షే | సే | — | ஷே | ஸே | ಶೇ | ಷೇ | ಸೇ | ശേ | ഷേ | സേ | शे | षे | से | શે | ષે | સે | ଶେ | ଷେ | ସେ |
| శై | షై | సై | — | ஷை | ஸை | ಶೈ | ಷೈ | ಸೈ | ശൈ | ഷൈ | സൈ | शै | षै | सै | શૈ | ષૈ | સૈ | ଶୈ | ଷୈ | ସୈ |
| శొ | షొ | సొ | — | ஷொ | ஸொ | ಶೊ | ಷೊ | ಸೊ | ശൊ | ഷൊ | സൊ | — | — | — | — | — | — | — | — | — |
| శో | షో | సో | — | ஷோ | ஸோ | ಶೋ | ಷೋ | ಸೋ | ശോ | ഷോ | സോ | शो | षो | सो | શો | ષો | સો | ଶୋ | ଷୋ | ସୋ |
| శౌ | షౌ | సౌ | - | ஷௌ | ஸௌ | ಶೌ | ಷೌ | ಸೌ | ശൗ | ഷൗ | സൗ | शौ | षौ | सौ | શૌ | ષૌ | સૌ | ଶୌ | ଷୌ | ସୌ |
| శం | షం | సం | — | — | — | ಶಂ | ಷಂ | ಸಂ | ശം | ഷം | സം | शं | षं | सं | શં | ષં | સં | ଶଂ | ଷଂ | ସଂ |
| శః | షః | సః | — | — | — | ಶಃ | ಷಃ | ಸಃ | ശഃ | ഷഃ | സഃ | श: | ष: | स: | શ: | ષ: | સ: | ଶଃ | ଷଃ | ସଃ |



[వచ్చే సంచికలో మరికొన్ని]

చర్చ:

# విద్యార్థినుల సమస్యలు—పెద్దలు

విద్యార్థినులకూ ఎన్నో సమస్యలుంటాయి. కాని, పెద్దలతో చెప్పుకోలేరు. చెప్పుకున్నా అవి పరిష్కరింపబడవని - వూరుకుంటారు. అయితే ఆ సమస్యలు ఎలాంటివి? ఎందుకని వాళ్ళు చెప్పుకోలేరు? చెప్పుకుంటే, వాటికి గల పరిష్కారమార్గం ఎలా వుంటుంది? అన్న విషయాల మీద కొందరు విద్యార్థినుల చేత చర్చ జరిపించవలసిందిగా, మచిలీపట్నం స్త్రీల కళాశాలలో ఉపన్యాసకురాలిగా వుంటున్న రచయిత్రి కుమారి విన్నకోట సుశీలాదేవిని కోరాము. ఆమె కొందరు - విద్యార్థినులను ఎన్నిక చేసి, జరిపించిన చర్చ సారాంశాన్ని అందజేస్తున్నాము—వ. సం.

ప్రతి మనిషికీ ఏవేవో సమస్యలుంటాయి. అవి అతని చుట్టు వుండే పరిస్థితులవలన, వ్యక్తుల వలన కలుగుతుంటాయి. వాటిని ఆ వ్యక్తి తన తెలివి తేటల్నిబట్టి పరిష్కరించుకుంటూ వుంటాడు.

కాని విద్యార్థినుల సమస్యలకి చాలావరకూ అటు పెద్దలో, ఇటు ఉపాధ్యాయులో కారణం అవుతూ వుంటారు. వీరి సమస్యల పరిష్కారం కూడా పెద్దలూ, వుపాధ్యాయులే చెయ్యాలి.

అయితే చాలామంది 'పెద్దవాళ్ళకే సమస్యలుంటాయి కానీ పిల్లలకి ఏముంటాయి' అని అనుకుంటూ వుంటారు.

అందుకే పిల్లలకుండే సమస్యలేమిటి? అవి ఎలా వుంటాయి? పెద్దలకి తెలియచెప్పాలనే అభిప్రాయంతో మా కాలేజీ పిల్లల్లో కొందర్ని ఒకచోట సమావేశపరచి—

"మీకు సమస్యలనేవి ఏమన్నా వున్నాయా?" అని అడిగాను.

దానికి వారందరూ—

"అదేమిటి మేడమ్! మాకు సమస్యలు ఎందుకుండవ్! అసలు ఒక విధంగా చూస్తే మాకే ఎక్కువగా వుంటాయి. టీనేజ్‌లో వున్నవాళ్ళం ఇప్పుడిప్పుడే ప్రపంచాన్ని అర్థం చేసుకుంటూ వున్నవాళ్ళం — మాకు ఎన్నో సమస్యలు! ఎన్నో సందేహాలు!" అన్నారు వారు.

"అయితే మీ సమస్యలేమిటో నాకు చెప్తారా!" అని అడిగాను.

దానికి మాధవి —

"అసలు ఆడపిల్లగా పుట్టడమే ఒక సమస్య.



ఇ. సరస్వతీదేవి (బి. ఎస్‌సి)



డి. నిర్మల (ఇంటర్)



పి. మాధవి (ఇంటర్)

ఆ తర్వాత అమ్మాయి వయస్సు పెరుగుతోన్నకొద్దీ ఎన్నో సమస్యలు. ఇక చదువుకునే అమ్మాయికి మొదట ఎదురయ్యేది చదువు సమస్య'' అంది.

అంటే నాకు అర్థం కాలేదు. మిగతావాళ్ళు కూడా ప్రశ్నార్థకంగా ముఖాలు పెట్టారు.

వెంటనే నిర్మల అందుకుని - ''వివరంగా చెప్పు మాధవీ!'' అని అడిగింది.

''ఏవుంది? మన ఇళ్ళల్లో మగపిల్లల చదువు కిచ్చినంత ప్రాధాన్యత ఆడపిల్లల చదువుకివ్వరు. 'ఎప్పుడు పెళ్ళి కుదిరితే అప్పుడు చేసేద్దాం. అంత వరకూ ఏదో కాలక్షేపంగా చదువుకుంటుంది' అని కాలేజీలో చేర్పిస్తారు'' అంది.

దానికి స్వరాజ్యలక్ష్మి —

''నువ్వు చెప్పింది నిజమే మాధవీ! చాలామంది తల్లితండ్రులకు తమ ఆడపిల్లలు ఇంజనీర్లు, పోస్టుగ్రాడ్యుయేట్లు, డాక్టర్లు కావటం ఇష్టం వుండదు. అందుకనే ఆడపిల్లలకి ఇష్టం లేకపోయినా ఏ ఆర్ట్సు గ్రూపులోనో చేర్పిస్తారు. ఇంకా కొంతమంది అమ్మాయిలకు కాలేజీలో చేరాలని వున్నా చేర్పించక పదో క్లాసులోనే ఆపేస్తారు'' అంది.

''ఇదేకాక ఆడపిల్లల్ని పొరుగూరు పంపి హాస్టల్లోగానీ, విడిగాగానీ వుంచి చదివించడానికి అసలు ఇష్టపడరు. ఇక ఆడపిల్లలకి డొనేషన్లు కట్టి చదివించడమనే ప్రసక్తే లేదు'' అంది గీత.

ఈ కాలంలో కూడా ఆడపిల్ల చదువుకి ఇన్ని ఆటంకాలున్నాయా! అయితే దీనికి కారణం ఏమై వుంటుంది? అని నేను ఆలోచిస్తుండగానే శుభ ఇలా అంది:

''దీని క్కారణం ఆడపిల్లల చదువుకి గుర్తింపు లేకపోవడమే. ఎంత చదివించినా ఆడపిల్లలకి కట్నాలిచ్చి పెళ్ళి చెయ్యాలి. ఇప్పుడు చదువుకి డబ్బు ఖర్చు. ఆ తర్వాత పెళ్ళికి ఖర్చు. మధ్య తరగతి కుటుంబాలవారు ఇన్ని ఖర్చులు భరించలేక ఆడపిల్లల చదువుకి ఫుల్‌స్టాప్ పెట్టి మగపిల్లల్ని చదివిస్తున్నారు. ఒకవేళ ఆడపిల్లలు చదువు కున్నా ఎంతమందికి వుద్యోగాలు దొరుకుతున్నా యంటారూ?'' అంటూ నన్నే ఎదురు ప్రశ్నించింది.

''నిజమే శుభా! ఆడపిల్లలకి వుద్యోగావకాశాలు తక్కువ. కష్టపడి ఎలాగోలా వుద్యోగాలు సంపా దించుకున్న స్త్రీలు కూడా అటు ఇంటి పని, ఇటు వుద్యోగం చేసుకోలేక 'తాము సలు చదువుకోకుండా వుంటే బాగుండేది. అప్పుడు వుద్యోగం చెయ్యా లని అనిపించేది కాదుకదా' అని అనుకుంటున్నారు'' అంది మాధవి.

అయితే దీనికి పరిష్కారం ఏమిటి?

''మాధవీ! ఈ సమస్యని కాలమే పరిష్క రించాలి. అంతవరకూ ఎవర్నీ తప్పుపట్టలేం'' అంటూ జడ్జీలా తీర్పు ఇచ్చింది నిర్మల.

''ఇవేనా! ఇంకేమన్నా సమస్యలు వున్నాయా!'' అన్నాను.





జి. మేరీ (బి. ఎ)



యమ్. స్వరాజ్యలక్ష్మి (ఇంటర్)



డి. శుభ (ఇంటర్)



వి. గీత (బి. ఎస్‌సి)

దానికి సరస్వతి —

" మేడమ్ ! ఇది చదువు సమస్య. ఈ సమస్యను దాటి చదువుకుంటున్న అమ్మాయికైతే ఇంకెన్ని సమస్యలో ! " అంది.

"ఏవీ చెప్పండి!" అన్నాను నేను. దానికి మేరీ వుత్సాహంగా ముందుకు వచ్చి —

" ఆడపిల్లలకి కూడా ఎన్నో కోరికలుంటాయి. సరదాలుంటాయి. వాటికి ఇంట్లోవాళ్ళు పట్టించుకోరు. ప్రతి పనికీ అడ్డు చెప్తుంటారు" అంది.

మేరీ ఈ విషయం ఎత్తగానే అందరి ముఖాల్లోనూ ఒక విధమైన వుత్సాహం తొంగి చూసింది. బహుశ వాళ్ళకున్న కష్టాల్ని గూర్చి చెప్పుకునే అవకాశం వచ్చిందనే సంతోషమేమో!

మేరీ మాట పూర్తయిందో లేదో వెంటనే గీత అందుకుంది.

" ఉదాహరణకి, ఆడపిల్లలకి అంటే విద్యార్థినులకి తోటి విద్యార్థినులతో సినిమాలకి వెళ్ళాలని వుంటుంది. బజారుకి, షికార్లకి, లేక ఫ్రెండ్సింటికి వెళ్ళాలని వుంటుంది. కాని ఇంట్లో తల్లితండ్రులు అలా వెళ్ళటానికి ఇష్టపడరు " అంది నిష్ఠూరంగా.

" పంపకపోవడమే మంచిది గీతా ! ఈ కాలంలో ఆడపిల్లలకి రక్షణ ఏవుంది ! " అంది మాధవి.

దీనికి నిర్మలకి కోపం వచ్చినట్టుంది.

" రక్షణ లేదని ఇంట్లో కూర్చోబెడితే ఇక ఆడపిల్లలకి ధైర్యం ఎలా వస్తుంది ? వాళ్ళనీ బయట తిరగనివ్వాలి. ఎవరైనా ఏమైనా అంటే ఎలా ధైర్యంగా నిలబడాలో వారికి నేర్పాలి " అంది తీవ్రంగా.

" వీటితోపాటు ఎవరితో ఏవిధంగా మాట్లాడాలో, ఏ వ్యక్తితో ఎలా మసలాలో నేర్పినట్లయితే అది వారి భావి జీవితానికి కూడా వుపయోగపడుతుంది " అంది సరస్వతి.

వాళ్ల మాటల్ని స్వరాజ్యలక్ష్మి బలపర్చింది.

" తల్లితండ్రులు విద్యార్థినులను ఎక్కడికి పంపకపోతే కాలేజీకి వెడుతున్నామని అబద్ధమాడి మ్యాట్నీలకు వెళ్లొచ్చు. దీనివలన మోసాలు చెయ్యడం, అబద్ధాలాడటం పిల్లలకి పెద్దలే నేర్పినట్టవుతుంది."

" అహఁ — ఏమైనా ప్రస్తుతం వున్న సమాజ పరిస్థితులలో ఆడపిల్లలకి కొంత కట్టడి అవసరం అని నా అభిప్రాయం " అంది మేరీ.

" లేకపోతే ప్రతి ఆడపిల్లకీ 'కరాటే' నేర్పిస్తే, సరి " అంది శుభ.

ఆ మాటకి అందరూ నవ్వారు.

" అది కాదు మేరీ ! ఆడపిల్లలు సహజంగా భయస్తులు. అయితే ప్రతి చిన్న విషయానికీ భయపడకుండా పరిస్థితులను ప్రతిఘటించే ధైర్యం వాళ్లల్లో కలగాలి. ఈ ధైర్యాన్ని, ఆత్మస్థైర్యాన్ని వాళ్లల్లో కలిగించే బాధ్యత తల్లితండ్రులదే." అంటూ ఈ సమస్యా పరిష్కారాన్ని పెద్దల మీదికి నెట్టింది నిర్మల.

" మాకు వున్న ఇంకో పెద్ద సమస్య డ్రెస్ మేడమ్ !" అంది శుభ.

" డ్రెస్సా "

" అవునండీ ! తల్లితండ్రులు తమ పిల్లలు ఆధునిక వస్త్రధారణ చేసుకోడానికి ఒప్పుకోడం లేదండీ " అంది మళ్లీ శుభ.

"మరి నువ్వు అప్పుడప్పుడు వేసుకుంటావుగా" అనడిగింది మేరీ.

" అవును నేను వేసుకుంటాను. మా ఇంట్లో ఒప్పుకుంటారు. కాని చాలామంది ఇళ్లల్లో వీటిని వేసుకోవడానికి ఒప్పుకోరు తెలుసా !" అంది శుభ.

" అవును ఒప్పుకోరు. కాని వాళ్లు ఎందుకు వద్దంటున్నారో తెలిస్తే, నువ్విలా వాళ్ళని నిందించవ్ !" అంది గీత.

" ఓహ్ ! వాళ్ళు నీకొచ్చి చెప్పారా !" అంది శుభ.

" చెప్పక్కర్లా ! నాకు తెలుసు. విద్యార్థినులు ఇటువంటి దుస్తులు వేసుకుని రోడ్డుమీది కెడితే ఎవరైనా ఏదైనా అంటారు. తల్లితండ్రులు తమ పిల్లలు నలుగురిలా వుండాలని కోరుకుంటారుగానీ, నలుగురిలో వేలెత్తి చూపేలా వుండి, అందరి చూపులూ ఆ పిల్ల మీదే వుండాలని కోరుకోరు కదా !" అంది మాధవి.

కాని ఆ మాటలు శుభకి రుచించినట్లు లేదు.

" పిల్లలం కాబట్టి వుత్సాహంగా, ఆధునిక వస్త్రాలు వేసుకోవాలని కోరుకుంటాం. పెద్దవాళ్లమైన తర్వాత ఎలాగూ వేసుకోలేం. మన డ్రెస్ విషయంలో ఇంత పట్టుదల పట్టున్నారు పెద్దలు. కాని మగపిల్లలు వారికిష్టమైన డ్రెస్ వేసుకోవటం లేదా! మరి వారికి అభ్యంతరం చెప్పరేం ?" రోషంగా అంది శుభ.

ఇది ఆలోచించతగ్గ విషయంగానే కన్పడింది.

" తల్లితండ్రులు తమ పిల్లల్ని ఎక్కువగా స్పోర్ట్సు, గేమ్సులలో పాల్గొననీయకపోవటానికి కొంతవరకూ ఈ డ్రెస్ కారణం కూడా. అయితే ఎలా దీన్ని పరిష్కరించడం ! తల్లితండ్రులు చిన్న విషయాల్లో కూడా పిల్లల స్వాతంత్ర్యానికి అడ్డు తగిలితే ఎలా ! వాళ్లకీ కొంత స్వేచ్ఛ ఇవ్వాలి.

ఒక విధంగా చెప్పాలంటే సిటీల్లో బస్సుల్లో ప్రయాణం చేసే పిల్లలు ఇటువంటి డ్రెస్సులు వేసుకుంటే ప్రమాదాలు జరగవు.

ఆ మధ్య ఎక్కడో చదివాను. ఒకమ్మాయి బస్సు దిగబోతుండగనే బస్సు కదిలిందట. ఆ అమ్మాయికి చీర కుచ్చెళ్లు అడ్డువచ్చి ముందుకు పడింది. ఆ పడడంలో తలకు పెద్ద దెబ్బ తగిలి వుండొచ్చు. వెంటనే ఆమెకు ప్రాణాలు పోయాయిట.

అవసరాన్నిబట్టీ, సమయాన్నిబట్టీ ఆధునిక వస్త్రాలు వేసుకోవడం మంచిదనే నా అభిప్రాయం. అయితే అవి అసభ్యంగా వుండకూడదు" అన్నాను.

అందరూ పాఠం విన్నంత బుద్ధిగా విన్నారు. ఆ తర్వాత నేను చెప్పింది బాగానే వుందన్నట్లు తృప్తిగా చూశారు.

నాకు మాధవి అన్న మాటలు జ్ఞాపకం వచ్చాయి. మాధవి " ఆధునిక వస్త్రాలు వేసుకుంటే రోడ్డు మీద ఎవరైనా ఏదైనా అంటారు " అంది.

దీనిమీద వారికి ఒక ప్రశ్న వేయాలన్పించింది.

" నేనొకటి అడగనా !" అన్నాను.

" అడగండి " అన్నారు.

" మీరు కాలేజీకి వస్తుంటారు కదా ! రోడ్డుమీద ఎవరైనా కుర్రాళ్ళు మిమ్మల్ని ఏదైనా అంటారనుకోండి. అది మీ పెద్దలకి చెప్తారా !" అన్నాను.

దానికి అందరూ " చెప్పము " అన్నట్లుగా తలలాడించారు.

మాధవి " చెప్పలేం మేడమ్!" అంది.

" ఎందుకని ?" కుతూహలంగా ప్రశ్నించాను.

" ఎందుకేమిటి మేడమ్ ! అటువంటివి చెప్తే పెద్దలు మమ్మల్నే తిడతారు. 'మీరేదో వెకిలిగా ప్రవర్తించి వుంటారు. అందుకే వారు మిమ్మల్ని అని వుంటారు' అంటారు " అంది.

" ఇంకా కొంతమంది తల్లితండ్రులు ఆడపిల్లలు ఇటువంటివి చెప్తే వెంటనే కాలేజీ మాన్పించి ఇంట్లో కూర్చోబెడతారు !" అంది సరస్వతి.

"తల్లిదండ్రులు ఇటువంటి విషయాల్లో యథార్థం తెలుసుకోరు సరస్వతీ! మగపిల్లలతో గొడవలు వస్తాయని వాళ్ల జోలికి పోరు. మనల్నే అంటారు. అందుకే చాలామంది ఆడపిల్లలు తల్లి తండ్రులకు భయపడి తమ బాధని తమ మనసులోనే దాచుకుంటారు. ఇంకా కొంతమంది పిరికివాళ్ళయితే ఆత్మహత్యలు కూడా చేసుకుంటారు'' అంది నిర్మల.

నాకివన్నీ వింటోంటే ఆడపిల్లల విషయంలోనే తల్లితండ్రులకి బాధ్యత ఎక్కువ వుందనిపించింది.

"ఇంకో విషయం వుంది మేడమ్! ఆడపిల్లల్ని చిన్నచూపుతో చూసేది-అది వారి చిల్లర ఖర్చు (పాకెట్ మనీ) విషయం'' అంది మేరీ.

"అవును మేరీ! మగపిల్లలకి పాకెట్ మనీ ఇస్తారు. ఆడపిల్లలకు ఇవ్వరు. ఒకవేళ అమ్మాయిలు నోరు తెరిచి అడిగినా నీకు డబ్బు ఎందుకు' అని తీసి పారేస్తారు!'' అంది స్వరాజ్యలక్ష్మి.

"బహుశ ఆడపిల్లలకి ఖర్చులేముంటాయని వారి వుద్దేశమేమో!'' అంది గీత.

"ఎందుకుండవ్! విద్యార్థినులు బయటికి వెళ్ళి నప్పుడు వారికి ఏవేవో అవసరాలుంటాయి. ప్రతి పైసా తల్లిదండ్రుల్ని అడగాలంటే వారికీ చిన్న తనంగా వుంటుంది'' అంది స్వరాజ్యలక్ష్మి.

"ఆడపిల్లలకి పాకెట్ మనీ ఇచ్చి దానిని ఎలా సద్వినియోగం చేయాలో పెద్దలు పిల్లలకి నేర్పాలి. అలా ఖర్చు పెట్టిన డబ్బుకి అకౌంట్ వ్రాయడం నేర్పితే పెద్దయిన తర్వాత కూడా వారికి వుపయోగపడుతుంది'' అంది నిర్మల.

"అయితే అన్నీ ఇంటికి సంబంధించిన సమస్యలే చెప్తున్నారు. కాలేజీలో సమస్యలేవీ లేవా!'' అనడిగాను.

"ఎందుకు లేవూ వున్నాయండీ!'' అంది సరస్వతి.

"మరయితే చెప్పరేం!'' అన్నాను.

వాళ్ళు ఒకళ్ళ ముఖాలొకళ్ళు చూసుకున్నారు.

అది చూసిన నాకు వాళ్ళ పరిస్థితి అర్థం అయింది.

నేను మనసులో నవ్వుకుని—

"చూడండమ్మా! ఇక్కడ నేను మీకు మేడమ్‌నికాదు. మీ స్నేహితురాల్ని మాత్రమే. మీరు నిర్భయంగా మీ సమస్యలు చెప్పండి.'' అన్నాను.



టి. యస్. ఉషశ్రీ

'కృషితో నాస్తి దుర్భిక్షం' అన్నారు పెద్దలు. కృషి చేస్తే ఏ విద్యలోనైనా రాణించ వచ్చునని మన వనితలు నిరూపించారు. కాని ఈ కృషి చాలామటుకు లలిత కళల మీదనే కేంద్రీకరించబడింది. ఈ కళలలోనూ నాట్యం పైననే చాలామంది అధికంగా మోజు చూపు తున్నారు. అలాకాక వృత్తి విద్యలలో కూడా వనితలు రాణించగలరు అని కొందరు ఇప్పు డిప్పుడే నిరూపిస్తున్నారు. అటువంటి వారిలో చెప్పుకోదగ్గ వనిత — కుమారి ఉషశ్రీ!

ప్రస్తుతం బెంగళూరు ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మేనేజిమెంట్‌లో ఎమ్. బి. ఏ. కోర్స్ చదువుతున్న ఉషశ్రీ అనంతపురంలో పుట్టి పెరిగారు. అక్కడ స్కూల్ ఫైనల్ పరీక్షలో ప్రథమురాలిగా ఉత్తీర్ణురాలైనందుకు రోటరీ క్లబ్ వారి సత్కారాన్ని పొందారు. నేషనల్ మెరిట్ స్కాలర్‌షిప్‌ను కూడా పొందారు. అయితే ప్రథము రాలిగా రావడమన్నది అంతటితో ఆగిపోలేదు. ఇంటర్మీడియట్ పరీక్షలలోనూ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణురాలయ్యారు. ఆ తరువాత బి. టెక్ ఎలక్ట్రి కల్ ఇంజనీరింగ్ కోర్స్‌లో చేరి ప్రథమశ్రేణిలో అత్యున్నత స్థానాన్ని సంపాయించారు. ఆ విధంగా అనంతపురం ఇంజనీరింగ్ కళాశాలలో బి. టెక్ కోర్సును అభ్యసించి ఉత్తీర్ణురాలైన ప్రథమ వనిత కుమారి ఉషశ్రీ కావడం విశేషం! జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యా లయం ఆమెకు స్వర్ణపతకాన్ని బహూకరించింది. ఐ. ఐ. ఎమ్‌లో 'పవర్ అండ్ ఎనర్జీ మేనేజ్ మెంట్' చదువుతున్న మొదటి ఆంధ్ర ఇంజ నీర్ ఆమే కావడం మరో విశేషం!

చదువులోనే కాకుండా చిత్రలేఖనం, సంగీతం, కవిత్వం, వ్యాస రచనల్లో కూడా నేర్పరి కుమారి ఉషశ్రీ. తెలుగులోనూ, ఆంగ్లంలోనూ ఆమె కొన్ని కవితలు రాశారు.

ఆ మాటతో వాళ్ళకి ధైర్యం వచ్చినట్టుంది. ముందుగా మాధవి అంది.

"చాలామంది ఉపాధ్యాయులు పిల్లల ఎడ పక్షపాతం చూపిస్తూ వుంటారు!'' అంది.

"విద్యార్థినుల తెలివితేటల్నిబట్టి అభిమానం చూపిస్తే కొంతవరకూ సరిపెట్టుకోవచ్చు. కాని డబ్బుగల పిల్లల్ని, ఖరీదైన రకరకాల బట్టలు వేసుకునే పిల్లల్ని అందంగా వుండే పిల్లల్ని అభిమానంతో చూస్తారు. వాళ్ల ఏ తప్పు చేసినా ఏమీ అనరు. కాని మిగతా విద్యార్థినులను చీటికీ మాటికీ తిడుతుంటారు. ఇది పిల్లల సున్నితమైన మనస్సుపై ఎంత దెబ్బ తీస్తుందో ఆలోచించరు'' అంది నిర్మల.

నిర్మల మాటలకు నేను ఆత్మవిమర్శ చేసుకో వడం మొదలు పెట్టాను! అంతలో స్వరాజ్యలక్ష్మి అందుకుని.

"ఇంకో విషయం నిర్మలా! చాలామంది వుపాధ్యాయులు విద్యార్థినుల సందేహాలను తీర్చ డానికి ప్రయత్నించరు. వాళ్లు ఎన్ని చెప్పినప్పటికీ తమ అభిప్రాయం సరైనదనే వాదిస్తారు. ఒకవేళ విద్యార్థినులు సరిచేయబోయినా వాళ్ళని చెప్పనివ్వక అణచివేస్తారు. అసలు తాము చెప్పే పాఠాలు వారికి అర్థం అవుతున్నాయో లేవో కూడా గమనించకుండా చెప్పుకుపోతారు'' అంది.

"ఇంకా కొంతమంది వుపాధ్యాయులు కాలేజీలో కంటె ట్యూషన్లలో పాఠాలు బాగా చెప్తారు. ట్యూషన్లలో చేరలేని బీద విద్యార్థులు దీనివలన చాలా నష్టపోతారు'' అంది శుభ.

ఇటువంటి విషయాలు కొన్ని నా దృష్టికి కూడా వచ్చాయి. కాని వీటిని ఎలా పరిష్కరించగలం? ఉపాధ్యాయులు ఎవరికి వారు ఆత్మవిమర్శ చేసుకుని తమ లోపాల్ని సరిచేసుకోవాలి!

మాధవి వాచీ చూసుకుంటోంది. అది చూసి నేను—

"మాధవీ! నీ సంగీత కచేరీకి టైమయిందా!'' అన్నాను.

"నాది కాదు మేడమ్! నా ఫ్రెండుది. ఆ అమ్మాయికి ఎన్నాళ్ళనుంచో వున్న కోరిక ఇప్పటికి తీరబోతోంది పాపం'' అంది.

"అంటే?'' అంది గీత.

లోకజ్ఞానం - సమాధానాలు

1. మేడమ్ మారియా డి లార్డెస్ పింటాస్సిలిగో- పోర్చుగల్ దేశానికి ప్రధాన మంత్రిగా ఎన్నికయ్యారు.

2. జనవరి 26, 1950

3. 96

4. టాంజానియా దేశానికి చెందిన సలీం అహ్మద్ సలీం.

5. భారత వయోజన విద్యాసమాఖ్య ప్రతి సంవత్సరం ఇచ్చే నెహ్రూ సాహిత్య బహుమతి గత సంవత్సరం శ్రీమతి కృష్ణ అగర్వాల్‌కు లభించింది. ఈమె నాగపూర్‌లోని భారతీయ గ్రామీణ మహిళా సంఘానికి (మధ్యప్రదేశ్ శాఖ) అధ్యక్షురాలుగా వుంటున్నారు.

6. లోక్‌సభ సభ్యుల సంఖ్య - 544 ; రాజ్యసభ - 244

7. డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్, డాక్టర్ జకీర్ హుస్సేన్, వి. వి. గిరి, జి. ఎస్. పథక్, బి. డి. జత్తి.

8. గుర్రం.

9. ఇటలీ, పోర్చుగల్, థాయ్‌లాండ్, హాంగ్ కాంగ్, కొలంబియా.

10. లాటిన్ పదం జాన్యువరియస్ (Januarius) నుంచి వచ్చింది. ఈ పదానికి మూలం జానస్ అన్న పేరుగల ద్విముఖ రోమన్ దేవత. ఈ దేవత ద్వారబంధం వద్ద కావలా కాస్తుందని రోమనుల విశ్వాసం. ముఖద్వారంవద్ద అధ్యక్షస్థానం వహిస్తూ పీఠమలంకరిస్తుంది కాబట్టి సంవత్సరం ప్రారంభంలో వచ్చే నెలకి రోమనులు ఈ దేవత పేరు కలిగేలా నామకరణం చేశారు. జానస్ జాన్యువరియస్ అయి ఆంగ్లంలోకి వచ్చేసరికి జాన్యువరిగానూ జనవరిగానూ రూపాంతరం చెందింది.

"ఏముంది? ఆ అమ్మాయికి సంగీతమంటే చాలా ఇష్టం. కాని వాళ్ళ ఇంట్లో వాళ్ళకి ఇష్టం లేదు. ఆ అమ్మాయి నేర్చుకుంటూవుంటే అభ్యంతరం చెప్పారు. చివరికి వాళ్ళతో పోట్లాడి సంగీతం నేర్చుకుని ఇప్పుడు మొదటిసారిగా కచేరీ చెయ్యబోతోంది" అంది మాధవి.

"ఇది చాలా ఆశ్చర్యంగా వుందే! చాలా మంది తల్లిదండ్రులు పిల్లలకి ఇష్టం లేకపోయినా లలితకళలు బలవంతంగా నేర్పుతారుగదా!" అంది గీత.

"బహుశ చదువు పాడవుతుందన్న అభిప్రాయమేమో!" అంది స్వరాజ్యలక్ష్మి.

"ఉహూ!' అది కాదు. నా ఫ్రెండు ఫస్టుక్లాసు స్టూడెంటు. చదువు పాడు చేసుకోనని హామీ కూడా ఇచ్చింది. అసలు కారణం ఏమిటంటే వారిది మధ్యతరగతి కుటుంబం. అటు చదువుకి, ఇటు సంగీతానికి డబ్బు ఖర్చు పెట్టాలంటే కష్టం కదా!" అంది మాధవి.

"ఇక్కడ డబ్బు సమస్య ఒక్కటే కాదు మాధవీ! ఇప్పుడింత కష్టపడి నేర్పించినా వివాహమైన తర్వాత ఈ లలితకళలను భార్య అభివృద్ధి చేసుకోడానికి భర్త అనుమతించకపోతే ఇదంతా వ్యర్థమే కదా!" అంది సరస్వతి.

"ఆడపిల్లల్లో చాలా మందికి ఈ లలితకళల్లో ఆసక్తి వుంటుంది! మీరు చెప్పిన కారణాలే కాకుండా ఇంకోటి కూడా వుంది. తల్లితండ్రులు తమ పిల్లలు స్టేజి ఎక్కడానికి ఒప్పుకోరు. అందుకే అమ్మాయిలకు ఎన్ని ఆశలూ, ఆశయాలూ వున్నా చంపుకోవాల్సి వస్తోంది" అంది నిర్మల.

అలా అమాయకంగా తమకున్న కష్టాల్ని చెప్పుకుంటున్న వారిని చూస్తూ-

"ఆడపిల్లల జీవితాల గూర్చి ఆలోచిస్తోంటే జాలీ, బాధా రెండు కలుగుతున్నాయమ్మా! వాళ్ళ కోరికలు ఒక్కటీ తీరడం లేదు. కోరిన చదువు చదవలేకుండా వున్నారు. కోరిన కళలు తీర్చుకోలేకుండా వున్నారు. పోనీ ఏ విషయంలోనైనా స్వేచ్ఛా, స్వాతంత్ర్యం ఏమన్నా వున్నాయా అంటే అవీ లేవు" అన్నాను.

"అంతేకాదు మేడమ్! ఇంతకంటె అతి ముఖ్యమైన జీవిత భాగస్వామి విషయంలో కూడా!" అంది మేరీ.

"అంటే?"

"పెళ్లి విషయంలో ఆడపిల్లల అభిప్రాయాలు కొద్దిగా కూడా తీసుకోకుండా తల్లితండ్రులు తమ కిష్టమైన సంబంధాలు చూసి అమ్మాయి ఇంకా చదువుతూ వుండగానే చదువు మధ్యలో ఆపి పెళ్లి చేస్తారు. అమ్మాయికి పెళ్లి చెయ్యటమే ప్రధానంగా చూస్తారు గానీ యితర విషయాలు ఆలోచించరు" అంది మేరీ.

"ఏదైనా మగపిల్లల విషయంలో తీసుకున్నంత శ్రద్ధ ఆడపిల్లల విషయంలో తీసుకోడం లేదు. ఆడపిల్లల కంటె మగపిల్లలు అధికులన్న తల్లితండ్రుల మనఃప్రవృత్తి ఈ వైజ్ఞానిక యుగంలో కూడా మారడంలేదు" అంది సరస్వతి.

"ఇదే కాదు సరస్వతీ! కుటుంబ విషయాల్లో కూడా! తమ కంటె చిన్నపిల్లలయినా మగపిల్లల అభిప్రాయాలకే విలువ ఇస్తారుగానీ ఆడపిల్లల అభిప్రాయాలకు ఇవ్వరు" అంది నిర్మల.

"అసలు ఇన్ని సమస్యలకూ కారణం పెద్దల పిల్లల మధ్య సరైన అవగాహన లేకపోవటమే! తరాల అంతరం ఎప్పుడూ వుంటుంది. కాని పెద్దలు పిల్లల్ని స్నేహితుల్లా చూసి వారి అభిప్రాయాల్ని ఆదరించాలి. పిల్లలు తప్పు చేస్తే తీవ్రంగా శాసించకుండా వారిని సున్నితంగా మందలించాలి. అప్పుడు పిల్లలు కూడా పెద్దలని గౌరవించి వారి మాట వింటారు." అంది మాధవి.

"ఇటువంటి సదవగాహన వారి మధ్య పెంపొందాలంటే ఇళ్ళల్లో చిన్న చిన్న సమావేశాలు ఏర్పాటు చేసి ఎప్పటి కప్పుడు పిల్లల సమస్యలను గూర్చి చర్చించాలి" అంది గీత.

"అలాగే ఉపాధ్యాయులు, విద్యార్థినులు, తరుచూ విహారయాత్రలకు వెడుతుండాలి. అప్పుడు వారి మధ్య వుండే దూరం తరుగుతుంది. వారు పరస్పరం తమకుండే సమస్యల్ని గూర్చి చర్చించుకునే అవకాశం కలుగుతుంది" అంది సరస్వతి.

కాలం వైజ్ఞానికంగా ఎంతో అభివృద్ధివి సాధిస్తోంది కాని వ్యక్తుల మనస్తత్వాల్లో మాత్రం మార్పు రాలేదు. వేషధారణలో ఆధునికత వుంది కానీ ఆలోచనల్లో నవ్యత లేదు. అందువలనే ఇన్ని సమస్యలూ, ఇన్ని ఇబ్బందులూనూ.

"మా తరం వాళ్ళమయినా ఈ సమస్యల్ని తొలగించి ఆడపిల్లలకు ఏ సమస్యా లేకుండా హాయిగా జీవించే పరిస్థితులను కల్పించడానికి కృషి చేస్తాం" అన్నారు వారందరూ ఏకకంఠంతో.

—విసు



# ఉగ్గుగిన్నె

— సత్యవాడ సోదరీమణులు

“బొట్టెడుట్టిండు కదా ఉగ్గు గిన్నె ఒట్రా, మావా” సింహాచలం పనిలోకి వెళ్ళబోతుంటే గుడిసె బైటికొచ్చి మరీ చెప్పింది సీతాలు.

“అట్టాగాలే యాదుందిలే. సందేళ కొట్టుకొస్తా. గానీ ఈ సలిగాలిలో తిరగమోకు బుడ్డాడికి పడిసం బట్టది. లోపలికెళ్ళె.” అంటూ వెళ్ళిపోయాడు.

సీతాలు గుడిసెలో కెళ్ళి తలుపేసుకుంది. పిల్లోడి ప్రక్కన మంచం మీద కూర్చుంది. ఆ పసి గుడ్డుని చూసుకొని మురిసిపోతోంది. ఆమెలో మాతృప్రేమ పొంగి వస్తుంటే పిల్లాడ్ని తీసి పొత్తిళ్ళలో పొదుక్కుంది. సింహాచలం తనను చేపట్టినప్పటి నుంచి తనకొక బిడ్డ కావాలని వాంఛ. ఎన్నో కలలు కంది—తను తల్లి కావాలని; బిడ్డను పొత్తిళ్ళలో పొదుక్కోని, పాలిచ్చి లాలించి ఉగ్గెట్టి ఉయ్యాలలూపాలని. తను కన్న కలలన్నీ ఇప్పటికి ఫలించాయి. తన బిడ్డ దొర బిడ్డలా ఉన్నాడు. తన మొక్కులన్నీ ఫలించాయి. భగవంతుడు చల్లగా చూసేడు. తనకు నిజంగానే పండంటి బిడ్డనే ఇచ్చేడు. తనకున్న మరో కోరికే ఇక తీరాలి. తన మావ ఎలాగైనా ఇవేళ ఉగ్గు గిన్నె తెస్తే ఆ కోరిక కూడా తీరిపోతుంది.

“కూడిదిగోనే, సీతాలూ” గుడిసె తలుపు తోసుకొని వచ్చింది రత్తాలు. సీతాలు అన్నం తింటుంటే రత్తాలు పిల్లాడ్ని ఎత్తుకొని ముద్దాడుతోంది.

“నీ భాగ్యం గొప్పదే. బంగారు కొండంటి బిడ్డడుంట్టిండు. అంతా ఆ యేంకన్న దయే. ఆ సామి సల్లంగ చూసిండు.”

“అదికాదే రత్తీ. నాకో కోరికుండి పోనాదె. తళతళమెరిసే బంగారు ఉగ్గుగిన్నెలో మాబొట్టెడికుగ్గట్టాలే” రత్తాలు తెల్లబోయింది.

“పిచ్చిమాలోకమా. అట్టాటాసలు ఎట్టా తీరుతాయే మన బోటోళ్ళకి.”

“అదికాదే రత్తీ. వీడుట్టకముందే మావతో సెప్పినా. అట్టాగానే ఓ బొట్టెడుట్టనీ సూద్దాం అన్నాడే. ఇప్పుడు బొట్టెడుట్టిండుకదా. వొట్టుకురా మావా అంటే అట్టాగేనే సందేళకు వొట్టుకొస్తానన్నాడు.”

ఆ ముచ్చట చెప్పినప్పుడు సీతాలు ముఖంలో సంతోషం చోటుచేసుకొంది. చీకటిపడేసరికి గుడిసె చేరుకున్నాడు.

సింహాచలాన్ని చూస్తూనే సీతాలు “ఒట్టుకొచ్చినావా, మావా ఉగ్గుగిన్నె” అంది.

ఉగ్గుగిన్నె చూసేసరికి సీతాలు ఆనందమంతా మాయమైపోయింది. “నీకేటి సెప్పిన్ను. మావా నీకేటి సెప్పిన్ను....”

“ఏటి సెప్పిన్నావె. ఉగ్గుగిన్నొట్టుకు రమ్మన్నావు. అట్టాగే సేసిన్ను. ఈ గిన్నెతో బొట్టెడు కుగ్గటవె.”

“సీ. ఏటిమావా. ఈడుట్టకముందె సెప్పిన్ను కదా. బంగారు ఉగ్గుగిన్నెతో ఉగ్గట్టాలని ఉందని.”

సీతాలు మాటకు సింహాచలం పగలబడి నవ్వాడు

"బాగుందే. బంగారు ఉగ్గుగిన్నెలెట్టా వస్తాయే. నీ బొంద. బొట్టెడ్కి ఉగ్గట్టి పాలెట్టి బువ్వెట్టి పెద్దోడ్ని సేసితే సాలదటే మన బోటోళ్ళకదే పదేలు" సింహాచలం మాటలు వినేస్థితిలో లేదు సీతాలు. ఆమె మనస్సు చెదిరిపోయింది. తన కోరిక తీరనందుకు దుఃఖం పొంగి వస్తోంది. ప్రతిరూపంగా ఆ కళ్ళు వర్షించడం మొదలు పెట్టాయి. "ఏటే పిచ్చిమాలోకమా-ఏడుత్తావు? ఇప్పుడేటయిందే. ఇట్టాటి తీరని ఆశలు ఎట్టుకో కూడదే." సీతాలు కళ్ళు తుడిచి ఎంతగానో నచ్చ చెప్పేడు సింహాచలం.

తన కడుపు పంట బోసి నవ్వులతో మురిపిస్తున్నా, చిలిపికళ్ళతో పలకరిస్తున్నా, పున్నమి చంద్రుడిలా పెరుగుతున్నా సీతాలు తన కోరికమటుకు మరచి పోలేకపోతోంది. బొట్టోడ్ని ప్రక్క గుడిసెలో ఉంటున్న రత్తాల కప్పచెప్పి నాలుగు రోజులుగా పనిలోకి పోతోంది. ఆమె మనస్సును కలవర పరుస్తున్న కోరిక మరుగున పడిపోతుందేమో అన్నట్టు ఓ దృశ్యం సీతాలు కంటపడింది. రెప్పార్పకుండా సుకుమారిని, ఆమె ఒళ్లో పిల్లాడిని చూస్తూ ఉండిపోయింది. సుకుమారి చేతుల్లో బంగారపు ఉగ్గుగిన్నె మెరుస్తోంది. దానితోనే పిల్లాడికి ఉగ్గుపడుతోంది. సీతాలు మనస్సులో ఏదో కలుక్కుమంది. "ఎంత అదృష్టవంతురాలో. బంగారుగిన్నెతో ఉగ్గు పడుతోంది బాబుకు." తనూ అనుకుంది బాబు పుట్టకముందే నుంచి ఇలాగే తన బాబు బంగారుగిన్నెతో ఉగ్గు తాగాలని. కాని తన కోరిక తీరనిది. ఇలాంటి ఆలోచనలతో బరువెక్కింది సీతాలు హృదయం. పని పూర్తి చేసుకొని గుడిసె చేరుకున్న తనకు సుకుమారి, ఆమె చేతిలోని బంగారు ఉగ్గుగిన్నె పసిబిడ్డ, తన కళ్ళలో మెదులుతున్నాయి. తన ఆశ ఇక ఈ జన్మకు తీరదు. తన కోరిక తీరకుండానే బాబు పెద్దవాడై పోతాడు. కాని ఎలాగైనా ఒక్కసారైనా తన బిడ్డకు బంగారు గిన్నెతో ఉగ్గు తాగించాలి. అందుకు తనేమైనా చెయ్యాలి. ఇలా ఆలోచిస్తున్న సీతాలు మనసులో ఓ ఊహ మెరిసింది. మరునాడు ఎప్పటిలా పనిలోకి వెళ్ళింది. తనను ఎవ్వరూ గమనించని సమయం చూసి ఉగ్గుగిన్నె తీసి మొలలో పెట్టుకుంది. త్వరగా పని ముగించుకొని గుడిసె చేరుకుంది. పిల్లాడు బోసినవ్వు లొలకబోస్తున్నాడు. ఆడుతున్నాడు. కేరింతలు కొడుతున్నాడు. తన కోరిక తీరబోతోందని ఏమో ఈ రోజు సీతాలుకు మరీ ముద్దుగా కనిపిస్తున్నాడు తన బిడ్డ. ఎలాగయితేనేం తను బంగారు ఉగ్గుగిన్నె సంపాదించగలిగింది. తను తెచ్చిన ఉగ్గుగిన్నెను తనివితీరా చూసుకుంది. కోరిక తీరుతున్న ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అవుతోంది సీతాలు హృదయం. పిల్లోడ్ని ఒళ్ళో వేసుకుంది. గిన్నెలో ఉగ్గుపోసి పట్టబోయింది. ఆమె చేతులు వణికాయి. తన బిడ్డ పరమాత్ముడిలా కనుపిస్తున్నాడు. దొంగిలించి తెచ్చిన ఉగ్గుగిన్నెతో ఉగ్గుపట్టి నన్ను పెంచుతావా అని అడుగుతున్నట్టు అనిపిస్తోంది. చేతుల్లో ఉన్న బంగారు గిన్నె జారి పడిపోయింది. దానిని చేతుల్లోకి తీసుకోవాలని మళ్ళా ఆ గిన్నె ఉగ్గుతో నింపి బాబుకు పట్టాలని అనిపించలేదు సీతాలుకు. సత్యానికి, ధర్మానికి ఉన్న పవిత్రస్థానం ఆమె మనస్సులో కొద్దిసేపు పేరుకున్న మలినాన్ని క్షాళనం చేసింది. వీల్లేదు-తను దొంగిలించి తెచ్చిన బంగారు గిన్నెతో ఉగ్గు పట్టి తన బాబును పెంచడానికి వీల్లేదు. తన మావ కష్టపడి తెచ్చిన సంపాదన డబ్బుతో కొన్న గిన్నె చాలదా-తన బాబు ఉగ్గు తాగేందుకు! మావ తెచ్చిన గిన్నె, బంగారు గిన్నె మార్చి మార్చి చూస్తోంది. మావ తెచ్చిన సిలవరి ఉగ్గుగిన్నె

## అనీమియా

స్త్రీలకు, పిల్లలకు వచ్చే వ్యాధులలో ముఖ్యమైనది అనీమియా. రక్తంలోని ఎర్రకణాల ఆరోగ్యం చెడడం లేదా తగ్గడంవల్ల ఈ వ్యాధి సంక్రమిస్తుంది.

ఆకలి మందగించడం, నీరసం, కాళ్ళు చేతులు పోట్లు, మత్తుగా వుండడం చిన్న పనులు చేయడంతోనే అలసిపోవడం; ఉచ్ఛ్వాస నిస్వాసాలు ఎక్కువ కావడంలాంటివి వుంటే వారికి అనీమియా అని తెలుసుకోవచ్చు. పసిపిల్లలకయితే తరచూ జ్వరం, విరేచనాలు కావడం, ఆకలి శరీరాభివృద్ధి లేకుండా పోవడం ఈ వ్యాధి లక్షణాలు.

అసలు ఈ వ్యాధి ఎందుకు వస్తుంది? అంటే మనం తీసుకునే ఆహార లోపమే ముఖ్య కారణం. ఋతుస్రావ సమయంలో రక్తస్రావం ఎక్కువగా కావడంవల్ల కొందరికి వస్తే-మరి కొందరు తరచు గర్భస్రావం జరగడంవల్ల ఈ వ్యాధికి లోనవుతారు. టైఫాయిడ్, టి. బి., క్యాన్సర్‌లాంటి వ్యాధులవల్ల శరీరంలోని వ్యాధి నిరోధకశక్తి బాగా తగ్గిపోతుంది. రక్తహీనత కల్గుతుంది. అలాంటి వారికి అనీమియా వచ్చే అవకాశం వుంది.

కడుపులో కొందరికి హూక్‌వర్మ్స అనబడే కొక్కి పురుగులు చేరుకుని రక్తాన్ని పీల్చి వేస్తాయి. పసిపిల్లలలో కొందరికి మన్ను తినే అలవాటువల్ల కూడా అనీమియా వస్తుంది.

ఏ వ్యాధి అయినా వచ్చిన తర్వాత బాధపడడం కన్నా ముందుగానే తగిన జాగ్రత్తలు తీసుకోడం మంచిది కదా! అందువల్ల శరీరానికి కావలసిన పోషక పదార్థాలు లభించే విధంగా మంచి పోషకాహారం తీసుకోవాలి. పోషకాహారాలు అంటేనే-'ఆ( అవన్నీ ఖరీదైనవి. అందరికి అందుబాటులో వుంటాయా? వాటిని గురించి తెలుసుకున్నంత మాత్రాన జరిగేదేముంది?' అనుకుంటారు కొందరు. అయితే అది సమంజసం కాదు. ఎందుకంటే రోజూ మనం తీసుకునే ఆహారంలోనే - అదే ఖర్చుతో—చౌకగా లభించే ఆకుకూరలు, కాయగూరలు, మజ్జిగలాంటివి చేర్చుకోవడంవల్ల మన శరీరానికి కావలసిన పోషకాహారాలు సమకూర్చుకోవచ్చు. గర్భిణీ స్త్రీల విషయంలో ఇది మరీ ముఖ్యం. అవసరమైతే విటమిను మాత్రలు తీసుకోడం కూడా మంచిదే.

గోళ్ళు పెంచుకోకుండా శుభ్రంగా వుంచుకోడం, చెప్పులు తొడుక్కునే బాత్‌రూమ్‌కు వెళ్ళడం మొదలైన చిన్న చిన్న జాగ్రత్తలు తీసుకున్నట్లయితే కడుపులో కొక్కి పురుగులు చేరకుండా చెయ్యవచ్చు.

పసిపిల్లలకు ఆరు నెలలు నిండిన తర్వాత తల్లి పాలతోపాటు వైటమిన్ డ్రాప్స్ ఇవ్వడం; పది నెలల తర్వాత ఐరన్ శక్తి వుండే పళ్ళు, మాత్రలు ఇవ్వడం మంచిది.

ప్రసవమో, గర్భస్రావమో అయిన తర్వాత ఐరన్ శక్తి వుండే మాత్రలు, బి. కాంప్లెక్స్; బి-12, ఫోలిక్‌యాసిడ్, ప్రొటీన్లుగల టానిక్‌లు, మాత్రలు తీసుకోడం ఎంతైనా శ్రేయస్కరం. పాపకు పాలు పట్టేటప్పుడు తల్లి కొంత రక్తం కోల్పోతుంది. అంచేత అప్పుడు మరింత పోషకాహారం తీసుకోడం చాలా అవసరం.

—డాక్టర్

బంగారు ఉగ్గుగిన్నెకన్న ఎన్నో రెట్లు విలువైందిగా తోచింది సీతాలుకి. మధ్యాహ్నం పనిలోకి పోయే టప్పుడు బంగారు గిన్నె తన మొలలో పెట్టుకుంది. సుకుమారి ఓ కథ వ్రాసుకుంటూనే సీతాలుని గమనిస్తోంది. అంతా తను ఊహించినట్టుగానే జరిగింది. తోమిన గిన్నెలు కడిగి లోపల పెడుతూ వాటి మధ్యన ఉగ్గుగిన్నె కూడా పడేసింది. సుకుమారి లోని రచయిత్రి ఆమెను తొందరపెట్టింది. 'ఆ అమాయకురాలి కోరిక తీర్చు అప్పుడు ఆమె కళ్ళలో పెల్లుబికే ఆనందాన్ని నీ కళా హృదయంతో చూడు' అంటూ ఆ బంగారు గిన్నె తీసుకొని ఇల్లు ఊడుస్తున్న సీతాలు దగ్గరకు వచ్చింది.

"ఇదిగోనే సీతాలూ - ఇది నేను మీ అబ్బాయి కిస్తున్న కానుక" ఉగ్గుగిన్నె సీతాలు చేతుల్లో పెట్టబోయింది. షాక్ తగిలినదానిలా చెయ్యి వెనక్కి తీసుకుంది సీతాలు.

"ఎందుకే అలా బెదిరిపోతావు? నీ మనసు నాకు తెలుసును. మీ బాబు పెద్దవాడైపోతున్నాడు. అసలు ఈ ఉగ్గుగిన్నె నీకిచ్చివేదామనే అనుకుంటున్నాను. నువ్వు తల్లివి కాకముందే నీలో మొలకెత్తిన కోరిక నాకు తెలుసు. ప్రొద్దున్న గిన్నె నువ్వు తీసుకొని వెళ్ళడం నాకు తెలుసు. కాని నేను అప్పుడే అనుకున్నాను నువ్విలా చేస్తావని. మంచి మనసుకు మలినం అంటదే సీతాలూ. ఇప్పుడు నేనే నీకు బహుమతిగా ఇస్తున్నా తీసుకో" ఉగ్గుగిన్నె సీతాలుకు అందివ్వబోయింది.

"వొద్దమ్మగారూ నా పిచ్చాశలు మరచిపోతాలెండి. బంగారు గిన్నెతో ఉగ్గట్టే అంతదాన్ని కాను. నాకు తీరని ఆశ పెంచుకున్నందుకే సిగ్గవుతోంది. శమించండమ్మగోరూ ఎప్పుడిట్టాటి పొరపాటు సెయ్యను" సీతాలు కళ్ళు చెమర్చాయి. ఆ రెండు మాతృ హృదయాలూ మరింత దగ్గరయ్యాయి. తన బాబుకు బంగారు ఉగ్గుగిన్నెతో ఉగ్గు పట్టాలని కోరిక తనకూ ఉండేది కాని అది కలలో తీరిపోయింది. మరి సీతాలుకూ అదే కోరిక. కాని అది తీరనిదిగా మిగిలిపోయింది అలా ఎందుకు మిగలాలి? అందుకే నిండు మనసుతో బంగారు గిన్నెను తన పనిమనిషి సీతాలుకు బహూకరించింది సుకుమారి. ఇప్పుడు సీతాలు చేతుల్లో బంగారు ఉగ్గుగిన్నె మెరుస్తోంది. అది ఎప్పటికీ దానిదే. తృప్తిగా నవ్వుకుంది సుకుమారి. ఆమె కళ్ళు వింతకాంతితో మెరుస్తున్నాయి. సీతాలుకు తెలియకుండానే తనలో బలపడిపోయిన అనర్హమైన కోరిక సుకుమారి ఔదార్యంతో తీరిపోయింది. □

## చంద్రకాంతల ముగ్గు

మొదట మధ్య వరసతో ప్రారంభించి 21 చుక్కలు పెట్టాలి. అటు, ఇటు రెండు వైపులా ఒక్కొక్క చుక్క తగ్గించుకుంటూ వచ్చి మొదటి ముగ్గులో చూపినట్లుగా పెట్టుకుంటూ చివర 4 చుక్కలు వచ్చేటట్లుగా చూసుకోవాలి. ఆ తరువాత ముగ్గులో చూపినట్లుగా కలుపుకుంటూ వస్తే చూడచక్కనైన చంద్రకాంతల ముగ్గు పూర్తవుతుంది.

—ఎస్. విజయలక్ష్మి, మడమనూరు



# సంస్కృత పాఠమాల 14

సంస్కృతమున శబ్దములు విభక్తులందు పొందు మార్పులను సంపూర్ణముగా తెలిసినగాని సంస్కృతభాష అవగాహనకాదు.

విభక్తులందు అకారాంత పుంలింగమైన బాలకః 'బాలకః' (రామః) శబ్దము పొందు మార్పులను ముందు పాఠములలో గమనించినాము. ఇప్పుడు మరికొన్ని శబ్దముల పరిణామములు.

ఇకారాంత పుంలింగము నిశబ్దము. **'इ' कारान्तः पुंलिगो मुनि शब्दः** ఇకారాన్తః పుంలింగోమునిశబ్దః

| ఏకవచనము | ద్వివచనము | బహువచనము | |
|---|---|---|---|
| మునిః | మునీ | మునయః | ప్రథమా **प्रथमा** |
| మునిమ్ | మునీ | మునీన్ | ద్వితీయా **द्वितीय** |
| మునినా | మునిభ్యామ్ | మునిభిః | తృతీయా **तृतीया** |
| మునయే | మునిభ్యామ్ | మునిభ్యః | చతుర్థీ **चतुर्थी** |
| మునేః | మునిభ్యామ్ | మునిభ్యః | పంచమీ **पञ्चमी** |
| మునేః | మునోవః | మునీనామ్ | షష్ఠీ **षष्ठी** |
| మునౌ | మున్యోః | మునిషు | సప్తమీ **सप्तमी** |
| హేమునే | హేమునీ | హేమునయః | సంబోధనము **संबोधनम** |

**एवं कविः रविः दाशरथिः अतिथिः इत्यादयः** ఏవం కవిః రవిః దాశరధిః అతిథిః ఇత్యాదయః (ఇదే విధముగా ఇకారాంతపుంలింగ శబ్దములైన కవి, రవి, దాశరధి, అతిథి మొదలగు శబ్దముల పరిణామము.)

ఉకారాన్తః పుంలింగ శ్శంభు శబ్దః

| | | | |
|---|---|---|---|
| శంభుః | శంభూ | శంభవః | ప్రథమా |
| శంభుమ్ | శంభూ | శంభూన్ | ద్వితీయా |
| శంభునా | శంభుభ్యామ్ | శంభుభిః | తృతీయా |
| శంభవే | శంభుభ్యామ్ | శంభుభ్యః | చతుర్థీ |
| శంభోః | శంభుభ్యామ్ | శంభుభ్యః | పంచమీ |
| శంభోః | శంభ్వోః | శంభూనామ్ | షష్ఠీ |
| శంభౌ | శంభ్వోః | శంభుషు | సప్తమీ |
| హేశంభో | హేశంభూ | హేశంభవః | సంబోధనము |

ఇదే విధముగా ఉకారాంత పుంలింగములైన విష్ణుః, భానుః, విధుః, గురుః, సుబాహుః మొదలగు శబ్దముల పరిణామము

శబ్దముల స్వరూపము తెలిసినగాని ఏ భాషయు తెలియదు. అందుచేత శబ్ద స్వరూపములను తెలిసికొనక తప్పదు.

పుంలింగ శబ్దములు, స్త్రీలింగ శబ్దములు, నపుంసక శబ్దములు – కొన్ని కొన్ని పొందు పరిణామములను గమనించి ముందునకు సాగుదుము.

[సంస్కృత పాఠాల మీద సందేహాలున్నవారు–'వనిత'కు రాసి తెలుసుకోవచ్చును]

# ఆధునిక దుస్తులు



విదేశాలలో ఫ్యాషన్లు గంటకొకసారి మారుతూ వుంటాయని అంటారు. ఈ ఫ్యాషన్లు ఇప్పుడు మనదేశంలోని ప్రధాన నగరాలకి కూడా వ్యాపించాయి. పల్లె ప్రాంతం వారికీ, ఓ మోస్తరు పట్టణాల వారికీ ఈ ఆధునిక దుస్తులు వింతగా అనిపించినా నగరాలలో నివసించేవారికి ఇవేమీ కొత్త కాదు. ఇవాళ కొత్త రకం దుస్తులు ధరించాలని అక్కడి వనితలలో చాలా మంది అభిలషిస్తున్నారు. అకర్షణీయమైన ఈ ఆధునిక దుస్తులు వారి సౌందర్యాన్ని మరింతగా ఇనుమడింపజేస్తున్నాయి.







భోగవినాయకుడు

# శిల్పి మణినారాయణ్



మన దేశంలో శిల్పకళలో ఆరితేరిన వనితలు బహుకొద్దిమంది. వారిలో పేర్కొనదగిన వనిత శ్రీమతి మణినారాయణ్. పాలరాతి మీద శిల్పాలు చెక్కడంలో ఆమె విశేషంగా కృషి చేశారు.

విశాఖపట్నంకు చెందిన మణి ఆంధ్ర విశ్వ విద్యాలయం ద్వారా బి. ఏ. పట్టం పుచ్చుకున్నారు. 1964లో ఆమెకి బొంబాయిలోని ప్రముఖ శిల్పి శ్రీ నారాయణ్‌తో వివాహమయ్యింది. అప్పటి నుంచి ఆమె బొంబాయిలోనే స్థిరపడ్డారు. నిజానికి ఆమె శిల్పకళలో శిక్షణ అంటూ ఎవరి దగ్గరా పొందనేలేదు. నారాయణ్‌తో వివాహమయ్యాకనే మణికి కూడా శిల్పకళపట్ల ఉత్సాహం కలిగింది. ఆమె భర్తకు వారి ఇంటనే తగిన పరికరాలతో శిల్పకళ కొనసాగించడానికి తగిన స్టూడియో వుంది. ఆయన పాలరాతిమీద, చెక్కల మీద నూతన పద్ధతులలో శిల్పాలు చెక్కుతూవుండగా చూసి ఆమె కూడా ఆ విద్య నేర్చుకోవాలను కున్నారు.

"నేను కళాశాలలో చదువుతున్నప్పుడే జంతు శాస్త్రంలోని పాఠ్యాంశాలలో బొమ్మలు గీయవలసి వచ్చినప్పుడు ఎంతో శ్రద్ధతో శుభ్రంగా వేసే దాన్ని. బొమ్మలు గీయడంలో బాగా ప్రవేశం వుండడంవల్ల శిల్పాలు చెక్కడం నాకు కొంత సులభతరమైనదనే చెప్పాలి. అందుకు తోడు నా భర్త అడుగడుగునా ఉత్సాహాన్ని కలుగజేస్తూ తగిన ప్రోత్సాహాన్ని యిచ్చారు. ఆయనే నాకు శిల్పాలు మలచడంలోనూ, అచ్చులు పోయడం లోనూ, చెక్కడంలోనూ, ఉలి, సుత్తి ఉపయో గించడంలోనూ, చిత్రిక పట్టే విధానంలోనూ ప్రాథమిక సూత్రాలు నేర్పారు" అన్నారు మణి.

మొదట ఆమె చెక్కమీద ప్రతిమలు చెక్క డంతో ఈ పని ప్రారంభించారు. ఒకసారి బొంబాయి జె. జె. కళాశాలలో చెక్కతో చేయ బడిన వివిధ అంశాల ప్రదర్శన చూసిన తర్వాత ఆమెకి ఆ ఉత్సాహం కలిగింది.

"మా వారి స్టూడియోలో చిన్న చిన్న పాల రాతి ముక్కలు వృధాగా పడివుండేవి. పాల రాతితో పెద్ద పెద్ద శిల్పాలు చెక్కడం ప్రారం భించక ముందు ఈ చిన్న చిన్న ముక్కల మీద వివిధ ఆకారాలు చెక్కుతూ వుండేదాన్ని. నిజానికి పాలరాయి శిల్పాలు-చెక్కడానికి చక్కటిసాధనం. అయితే పాలరాతి మీద శిల్పాలు మలచేటప్పుడు లోహం, చెక్కల మీద చెక్కడాలకన్నా ఎంతో మెళకువతో శ్రద్ధ వహించాలి" అంటారు మణి.

ఆమె బొంబాయి తాజ్ ఆర్ట్ గ్యాలరీలో రెండు చెప్పుకోదగ్గ ప్రదర్శనలను నిర్వహించారు. మొదటి ప్రదర్శన 1978లో జరిగింది. ఈ ప్రద ర్శనలో ఆమె తన భర్తతో కలిసి తను రూపొం దించిన చెక్క శిల్పాలను ప్రదర్శించారు. గత సంవత్సరం నవంబర్ నెలలో ఆమె విడిగా తను చెక్కిన ఇరవైఒక్క పాలరాతి శిల్పాలతో ఒక ప్రదర్శన ఏర్పాటు చేశారు. భారతీయ సంస్కృతిని ప్రతిబింబించే శిల్పాలు ఇవి. వీటిల్లో చెప్పుకో దగ్గవి–వినాయకుడి విగ్రహాలు, తల్లి – బిడ్డ మొద లైనవి. ఈ ప్రదర్శనలో ఆమె విభిన్న ఆకృతు లలో ఏడురకాలైన వినాయక విగ్రహాలను మలచి, ప్రదర్శించడం చెప్పుకోదగ్గ విషయం.

'పాలరాతిలో దాగి వున్న రూపాలను తన పనితనంతో వెలికి తీసుకు వచ్చిన మేధావిని'గా ఆమెను పత్రికలు ప్రశంసించాయి. కళా విమర్శకులు, ప్రముఖులు ఆమె శిల్పకళా చాతుర్యాన్ని కొనియాడారు.

టీక్‌వుడ్ మీద ఆమె చెక్కిన 'గీషా' ప్రతిమకి 1975 లో బొంబాయి ఆర్టిస్ట్ సెంటర్‌వారి ప్రథమ బహుమతి లభించింది. అంతర్జాతీయ మహిళా సంవత్సరం ఆరంభ సందర్భంగా అప్పట్లో ఆమె ప్రత్యేకంగా ఈ ప్రతిమ రూపొందించారు. పాలరాతి మీద చెక్కిన 'అమ్మ' శిల్పానికి 1977 లోనూ ఆ తరువాత మరో శిల్పానికి 1978 లోనూ బొంబాయి ఆర్ట్‌సొసైటీ వారి బహుమతులు ఆమెకు లభించాయి. ఆ విధంగా ఆమె శిల్పకళ నేర్చుకోవడం ప్రారంభించిన ఎనిమిదేళ్ళ లోపునే పలువురి ప్రశంసలూ, పలు బహుమతులూ అందుకున్నారు.

'ఒక శిల్పం పాలరాతి మీద చెక్కడానికి ఎంత సమయం పడుతుంది?' అన్న ప్రశ్నకి సమాధానంగా—

"మొదట నేను నాకు కావలసిన విధంలో వున్న పాలరాయిని చూసి తీసుకుంటాను. అయితే దాని మీద వెంటనే చెక్కడం ప్రారంభించను. ముందుగా బంకమట్టితో నేను చెయ్యాలనుకున్న విగ్రహాన్ని రూపొందిస్తాను. అలా నాకు సంతృప్తి కలిగేదాకా, నేననుకున్న రీతిలో ఆ ఆకృతి వచ్చేదాకా బంకమట్టి మీద ప్రయోగం చేస్తాను. ఆ తరువాత పాలరాతిమీద పని ప్రారంభిస్తాను. పాలరాతి మీద శిల్పం చెక్కడానికి ఇరవైఐదు రోజులదాకా పడుతుంది. పెద్ద విగ్రహం అయితే ఇంకా ఎక్కువ సమయం తీసుకుంటుంది. సాధారణంగా మా పిల్లలిద్దరూ స్కూల్‌కి వెళ్ళాక నా పని ప్రారంభిస్తాను. ఇందుకు రోజుకి మూడు నాలుగు గంటలు కేటాయిస్తాను. ఇది చాలా శ్రమతో కూడిన పని. ఇందుకు ఓపికేకాక శరీర దారుఢ్యం కూడా అవసరం. ఉలి, సుత్తి ఉపయోగించాలి. కాబట్టి స్త్రీలు చెయ్యలేని కఠినమైన పని ఇది అని అంటూ వుంటారు. కాని ఒక సృజనాత్మక కార్యంలో నిమగ్నులమై వుంటాం కాబట్టి ఈ పని చేస్తున్నప్పుడు ఆ ఉత్సాహంలో అలుపన్నదే తెలియదు" అని చెప్పారు శ్రీమతి మణి నారాయణ్.

—కమలాకుమార్

## ప్రాచీన అలంకరణ

ఇక్కడ కనిపిస్తున్న ఆభరణాలు - ఐదవ శతాబ్దానికి చెందినవిగా భావింపబడుతున్నాయి. చిత్రంలో (అజంతాగుహ) కనిపిస్తున్న యువతి - రాణి జానపద కల్యాణి. (నందుడి భార్య) చేతులకు వేసుకున్న గాజుల జతా మెడలోని పూసల హారం - ఇవాళ్టి 'ఫాషన్'గా కూడా చూస్తున్నాము. (చిత్రంలో వున్న ఆభరణాలే, విడిగా పెద్ద బొమ్మలుగా కనిపిస్తున్నాయి.)

చిత్రం: శ్రీమతి ఉదయగిరి



సశేషనవల:

# బొమ్మా-బొరుసూ

## శీలంశెట్టి రమాదేవి

తను బిక్కమొగం వేసుకొని నిలబడి పోయింది చాలాసేపు. మరి కాసేపటికి చుట్టు పక్కల వాళ్ళెవరో కలుగజేసుకొని అతనిని చివాట్లువేసి ఆమెను దూరంగా లాగారు. అప్పటికే ఆమె ఆ దెబ్బలకు తాళలేక పడిపోయింది. అంతే. ఆ తరువాత తను వాళ్ళింటి కెళ్ళలేదు. భయం! అరుణ కూడా సరిగ్గా స్కూలుకి రావడం మానేసింది. వాళ్ళమ్మకు ఆ దెబ్బలవల్ల జ్వరం వచ్చిందట. మరి కొద్దిరోజుల తర్వాత ఆమె చనిపోయింది. ఆమె చనిపోయిన రోజు తనకి బాగా గుర్తుంది. అదో పీడకలలాంటిది తనకు. అరుణ వాళ్ళ అమ్మమ్మ, తాతయ్య రావడం, అరుణ బిగ్గరగా ఏడవడం, అరుణ వాళ్లమ్మను శ్మశానానికి తీసుకెళ్ళడం అన్నీ చూసింది తను. అరుణతో పాటు తనూ ఏడ్చేసింది. ఆ రోజునుంచీ ఎవరు చనిపోయినా తనకు ఠక్కున ఆనాటి దృశ్యమే కళ్ళముందు కనబడుతుంది. అరుణను వాళ్ళ అమ్మమ్మ వాళ్లు తీసుకెళ్లిపోయారు.

అరుణ తండ్రి చాలా కాలం ఒంటరిగానే తనకు కనిపించేవాడు. అతన్ని చూస్తూంటే భయంతోపాటు ద్వేషం కూడా కలిగేది. ఆ తరువాత సంఘటన తన శాంత పిన్నికి సంబంధించినది. తను టెన్త్ చదువుతోండగా ఆమె వివాహమయింది. వివాహమయిన వారం రోజులకే ఆమెను భర్తా, అత్తా కలసి నానాహింసలూ పెట్టటం మొదలుపెట్టారు. తమ బంధువు లెవరూ వాళ్ళింటికి రాకూడదని శాసించాడతను. ఆమె సంసారంలో జోక్యం కలుగజేసుకోడానికి భయపడి అందరూ వెనక్కు తగ్గారు. అంతే! చాలా రోజులు శాంతపిన్ని ఆ ఇంట్లో ఖైదీ అయిపోయింది. లోపల ఏమి జరుగుతోందో, ఆమెను ఎంతగా హింసిస్తున్నారో అని అందరూ తల్లడిల్లిపోతూండేవాళ్ళు. మరికొద్ది రోజుల తర్వాత శాంతపిన్నే భర్తతోపాటు తమ ఇంటికొచ్చింది.

"సరిగ్గా పది నిమిషాలు టైమిస్తున్నాను. మాట్లాడి బయటకు రా! నేను రిక్షా దగ్గరే నుంచుంటాను" అనేసి బయటికెళ్లి నిలబడ్డాడతను. శాంత పిన్ని వణుకుతూ తలూపి ఇంట్లోకొచ్చింది. అందరూ ఆమె చుట్టూ మూగారు. అందరి ప్రశ్నలకూ ఒకటే సమాధానం చెప్పిందామె.

"నా రాత ఎలా వుంటే అలా జరుగుతుంది. మీరేమీ దిగులు పెట్టుకోకండి! నాకు మీరు చేయగలిగిన సహాయం ఒక్కటే ఉంది. అదేమిటంటే నెలకోసారయినా మీరు ఎవరయినా వచ్చి నాకు కనబడుతూండండి. అంతేచాలు! ఒకవేళ మిమ్మల్ని మావారుగానీ, మరెవరుగానీ తూలనాడినా సహించండి. నాకోసం మీరీ అవమానం పొందండి! అంతే! ..." కన్నీళ్ళు తుడుచుకొంటూ అంది - శాంతపిన్ని. అందరూ ఆమె పరిస్థితికి కన్నీరు



పెట్టుకొన్నారు. మాటల్లో పది నిమిషాలు గడచి పోవడం ఎవరూ గమనించలేదు. బయటి నుంచి "శాంతా" అంటూ ఆమె భర్త గర్జించేసరికి అందరూ ఉలిక్కిపడిపోయారు. శాంతపిన్ని ఒక్క ఉదుటున లేచి బయటకు పరుగెత్తింది. అప్పటికే ఉగ్రుడయిపోయాడతను.

"నీకు బుద్ధి ఉందా ? పది నిమిషాల్లో రమ్మని చెప్తే నా మాట అంత లెక్కలేకుండా ఉందా నీకు? ఇడియట్....పద !" అంటూ అరిచాడు. ఆమె వెళ్ళిపోయింది. రాన్రాను ఆమె స్థితిగతులు అందరికీ తెలిసిపోయినయ్. భర్త పెట్టే బాధలు భరించలేక ఆమెకు మతి స్థిమితం తప్పింది. కొద్ది రోజులు ఆమెని పిచ్చి ఆసుపత్రిలో కూడా ఉంచాల్సివచ్చింది. ఆ తరువాత ఆమెకు పిచ్చి తగ్గిందిగాని మతి పోగొట్టుకొంది. జరిగినదేమీ గుర్తుండదు. ఎవరితోనూ మాట్లాడదు. పూర్తిగా మౌనం పాటిస్తుంది.

ఆమె జీవితం అలా నాశనమయిపోయింది.



మూడోది తమ పేటలోనే ఉన్న శ్రీదేవి విషయం. ఆమె ఓ యువకుడిని ప్రేమించింది. వాళ్ళింట్లో వాళ్ళు ఎంతో ఆధునిక భావాలు కలవారు అవడం చేత ఆమెనెవరూ అభ్యంతరపెట్టలేదు. అతనూ శ్రీదేవి కలిసి పార్కులకూ, సినిమాలకూ తిరగడం అందరికీ తెలుసు. అయితే అతనిది కపట ప్రేమ అన్న విషయం శ్రీదేవి గ్రహించలేదు. ఇద్దరూ వివాహం చేసుకోవాలని అతను వెలిబుచ్చిన అభిప్రాయాన్ని ఆమె నమ్మింది. అతనికి తన శీలాన్ని అర్పించింది. ఆమె గర్భవతి కాగానే అతను మొఖం చాటుచేశాడు. అసలా ఊరేవదలి వెళ్ళిపోయాడు. తను గర్భవతి అయిన విషయం తల్లిదండ్రులకు తెలియజేయడానికి భయపడి ఆత్మహత్య చేసుకోబోయిందామె. కిరసనాయిలు పోసుకొని నిప్పంటించుకొన్న ఆమెని హాస్పిటల్‌కి తీసుకెళ్ళేరు. పది రోజుల తర్వాతగానీ ఆమెను హాస్పిటల్ నుంచీ డిశ్చార్జ్ చేయలేదు. ఆమెకు అబార్షన్ అయిపోయింది. ఆ రోజు నుంచీ ఆమె బయటకు రావడం మానేసింది. ఆమెకు వివాహం చేయడానికి ఎన్నో ప్రయత్నాలు చేశారు ఆమె తల్లిదండ్రులు. కాని ఎవ్వరూ ఆమెను చేసుకోడానికి ముందుకురాలేదు. కనీసం రెండో పెళ్ళి వాళ్ల కూడా ఆమెను చేసుకోడానికి అంగీకరించలేదు. ఆమె మధ్య వయస్కురాలయిపోయింది. మిగతా జీవితం కూడా బ్రహ్మచారిణిగానే గడచిపోతుందనడంలో ఎలాంటి సందేహమూ లేదు. కానీ, ఆ యువకుడికి మాత్రం తమ ఊళ్ళోనే మరో అమ్మాయితో వివాహం అయిపోయింది. శ్రీదేవి అంటే కూడా ఎవరో తనకు తెలీనట్లు హాయిగా కాపురం చేసుకొంటున్నాడు. తను కోపంతో మండిపడేదీ విషయంలోనే. మోసపోయిన అమ్మాయిని మన సంఘం ఎంతో తీవ్రంగా శిక్షించింది. కానీ మోసగించినవాడిని అసలు పట్టించుకోదు! ఇదెక్కడి విడ్డూరం ?

ఇదే ప్రేమకు సంబంధించినది కాక, మరో నేరానికి సంబంధించిన మోసమైతే మోసం చేసిన వాడినే కోర్టులు శిక్షిస్తాయి. మోసగింపబడిన వారి మీద జాలిపడతాయి.

తన మనసు మీద బాగా ముద్రపడిన సంఘటన యిదే.

ఇవికాక ఎప్పటికప్పుడు ఆలోచింపజేసే జీవితాలెన్నో తటస్థపడినాయి తనకి.

ఉదయం నిద్ర లేచిన దగ్గర్నుంచీ అర్ధరాత్రి వరకూ భర్తకూ, అత్తమామలకూ, మరుదులకూ

పని మనిషి లాగా చాకిరి చేసే తమ పక్కింటి శాంతాదేవి; భర్త వ్యభిచారి అని తెలిసినా, రోజూ రాత్రుళ్లు ఇంటికి రాకపోయినా ఏమీ చేయలేని నిస్సహాయురాలు అనుపమ; ఎప్పటికయినా తన మీద దయతలచి కాపురానికి తీసుకెళ్తాడని భర్త కోసం గత ఆరేళ్లుగా ఎదురు చూస్తున్న భవానీ —

ఇంతమంది స్త్రీల జీవితాలిలా మోడువారి పోడానికి మగవాడి అహంకారమే కారణమన్న నిజం తనకు మనశ్శాంతిని కరువు చేసింది. చదువు కొన్న స్త్రీలందరూ పూనుకోకపోతే తమకు తాము అన్యాయం చేసుకోవడమే కాదు, భావితరం స్త్రీకి కూడా ద్రోహం చేసినట్లవుతుంది.

ఈ విషయంలో తన తండ్రి కూడా విశాల హృదయంతో ఆలోచించగలగటం తన అదృష్టం! తనను విప్లవనారీసమితిలో చేరమని ప్రోత్సహించింది కూడా ఆయనే. స్త్రీకి సమానహక్కులుండాలని కేవలం వాదించడమే కాదు. తమ ఇంట్లోనే ఆచరణలో పెట్టారు. తన తల్లికి ఏ పని చేయడానికీ తండ్రి అనుమతి తీసుకోవాల్సిన అవసరం లేదు. ఆమె కూడా క్లబ్‌లో మెంబరు. ఆమెకు క్లబ్ మీటింగ్‌లున్న రోజు తండ్రే వంట చేసేవారు. ఆయన అభిరుచులూ, ఆశయాలే తన లోనూ జీర్ణించుకున్నాయి.

"ఏమిటి హేమా? ఆలోచిస్తున్నావ?" సుధీర్ గొంతు విని ఆలోచనల్లో నుంచి బయటపడింది హేమ. తన పరధ్యానానికి తనకే నవ్వు వచ్చిందామెకి. అతనడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పకుండా గతాన్ని ఎందుకు గుర్తు తెచ్చుకొంటున్నట్లు?

"అవును బావా! నువ్వు అన్నమాటల్లో ఎంతో నిజం ఉంది. మనిద్దరివీ పరస్పర విరుద్ధ భావాలు. మనం పెళ్ళాడడం మన భవిష్యత్తు మీద జూదం ఆడటం లాంటిది..." తల వంచుకుని అంది హేమ. అలా అంటూంటే ఆమె గొంతు కొంచెం వణికింది, అంతవరకూ అతనితో ఉన్న సన్నిహితత్వం ఆ క్షణంనుంచీ తెగిపోతున్నట్లనిపించి మనసు విలవిలలాడింది. అయినా ఇందులో తన ప్రమేయం ఏముందని? బావ కెలాగూ తనను చేసుకోవడం ఇష్టంలేదు. అలాంటప్పుడు తనింక ఆ విషయం గురించి ఆలోచించడమే అనవసరం. బావ అలాంటి అభిప్రాయానికి రావడం కూడా సమంజసమే మరి!

సుధీర్ ఆశ్చర్యంగా ఆమె వంక చూశాడు.

ఆమె ఆ విషయం ఇంత త్వరగా, ఇంత తేలిగ్గా తేల్చేస్తుందనుకోలేదు.

"నీకు నా మీద కోపంగా ఉందా హేమా?" అనుమానంగా అడిగాడు.

"ఊహు! కోపమెందుకు బావా! ఇందులో నువ్వు అనుచితంగా మాట్లాడిందేముందని? నువ్వు చెప్పిన విషయాలన్నీ నిజమేగా!"

"థాంక్యూ హేమా! నన్ను ఇంత సులభంగా అర్థం చేసుకొంటావనుకోలేదు. కానీ మన పెద్దాళ్లు కూడా ఇంత కూల్‌గా ఆలోచిస్తారంటావా? నాకదే భయంగా ఉంది. మన కుటుంబాల మధ్య లేనిపోని కలతలు ప్రారంభమవుతాయేమోనని!" సందేహంగా అన్నాడతను.

"మరేం ఫరవాలేదు! ముందు కొంచెం తొందర పడినా తరువాత వాళ్ళూ మన నిర్ణయమే మంచిదని ఒప్పుకొంటారు...." నవ్వుతూ అంది హేమ.

బస్ డిపోలోనుంచి వేగంగా వచ్చి వారి ముందాగింది.

సుధీర్, హేమా లేచి బస్ దగ్గరకు నడిచారు. ఆమె లోపల కూర్చున్నాక ఎటాచీ ఆమె కందిం

విశాఖపట్నం లయన్ లేడీస్ క్లబ్బు ఆవిష్కరించబడిన తొలి రోజులలోనే ఆ క్లబ్బుకు అధ్యక్షురాలుగా ఉండి, అనేక సేవా కార్యక్రమాలను చేపట్టి, వెనుకబడిన వర్గాలకు ఉచితవైద్య సౌకర్యాలను కలిగించడంతో పాటు అనేక సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించి, క్లబ్బును ఇతోధికంగా అభివృద్ధి చేసిన మంగళ రాజా యిప్పటికీ నగరంలో మంచి ఉత్సాహవంతురాలైన కార్యకర్తగా లయనిజంలో పాల్గొంటున్నారు. నగరంలోని అనేక మహిళా సంస్థలలో సభ్యురాలుగా, కార్యకర్తగా వుంటూ, సామూహిక సాంస్కృతిక ప్రదర్శనలలో కూడా పాల్గొంటున్నారు. స్థానిక మహిళా సూపర్‌బజార్ డైరక్టరులలో ఆమె ఒకరు!



మంగళగౌరి

బాల్యం నుండి భరతనాట్యం నేర్చుకుని, అనేక ప్రదర్శనాలిచ్చినా-ఆమెకు సంగీతం మీద మక్కువ ఎక్కువ. 1953 లో ఆమె వివాహానంతరం శాస్త్రీయ సంగీతంలో ఎక్కువగా కృషి చేసి అందులో డిప్లొమో పొందడంతోపాటు అనేక సాంస్కృతిక కార్యక్రమాల్లోనూ రేడియో నాటికల లోనూ పాల్గొన్నారు. ఖండాంతరాలలోని ప్రాశ్చాత్య దేశాలన్ని విస్తృతంగా ప్రయాణం చేసి, ఆయా దేశాలలోని సాంస్కృతిక విశేషాలను, మహిళల తీరుతెన్నులను అవగాహన చేసుకున్నారు. 1979 జూన్‌లో మాంట్రియల్ (కెనడా)లో జరిగిన "లయన్స్ ఇంటర్నేషనల్" అంతర్జాతీయ సమావేశానికి హాజరయ్యారు. ఆ సందర్భంగా జరిగిన ప్రపంచ లయనెస్ కన్వెన్షను భారతదేశం నుండి హాజరయిన ఏకైక మహిళ ఆమె!

శ్రీమతి మంగళగారి తండ్రి శ్రీ నాళం రామలింగేశ్వరరావు రాజమండ్రి వాస్తవ్యులైనప్పటికీ మద్రాసులో ప్రముఖ వ్యాపారవేత్తగా స్థిరపడడంతో శ్రీమతి మంగళగారి జననం, బాల్యం మద్రాసులోనే గడిచాయి. అక్కడే క్వీన్ మేరీస్ కళాశాలనుండి సైన్సులో పట్టభద్రురాలయ్యారు. ఆమె భర్త లయన్ లేడీస్ అండ్ లయనెస్ క్లబ్బుల 324–C డిస్ట్రిక్టు ఛెయిర్మన్, లయన్ ఎ. ఎస్. రాజా. వారికి విద్యాధికులయిన ముగ్గురు కుమారులు సంతానం!

—విశేకరి

చాడు సుధీర్.

"సరే - ఇంక ఉంటాను మరి! మళ్ళీ ఆఫీసుకి టైమవుతుంది!" అన్నాడతను.

"ఓకే బావా! వెళ్ళిరా!" చిరునవ్వుతో అంది హేమ.

"థాంక్స్ ఎలాట్...." చేయి వూపుతూ అన్నాడతను.

"అన్నట్లు మీ ఫ్రెండ్‌ని అడిగానని చెప్పు!"

"ఓకే...."

అక్కడినుంచి నడిచాడు సుధీర్. అతని మనసు తేలికయిపోయిందిప్పుడు. తను ఇన్ని రోజులుగా హృదయంలో దాచుకున్న అగ్నిపర్వతం ప్రేలి చల్లారినట్లనిపిస్తోంది. హేమ ద్వారా సాయింత్రానికల్లా ఈ వార్త మామయ్యకూ అత్తయ్యకూ తెలుస్తుంది. తనూ ఇంటి కెళ్ళగానే తల్లికీ విషయం చెప్పేస్తాడు. ఆఫీసుకెళ్ళి వచ్చేసరికి ఆమె కూడా చల్లబడిపోతుంది. అంతే! అక్కడితో ఈ వ్యవహారానికి ఫుల్‌స్టాప్ పడుతుంది.

భోజనం చేస్తూండగా ఆ విషయం తనే కదిపాడు సుధీర్.

"హేమా, నేనూ అన్నీ మాట్లాడుకొన్నామమ్మా! హేమకేమో నన్ను చేసుకోవడం ఇష్టం లేదు. నాకేమో హేమను చేసుకోవడం ఇష్టంలేదు. అంచేత ఇంక నువ్వు మా వివాహం గొడవ పట్టించుకోనక్కరలేదు" దేవకి తృళ్ళి పడిందతని మాటలకు.

"నిజమేనుట్రా నీ మాటలు?" అంది ఆశ్చర్యంగా.

"అవునమ్మా! అబద్ధం ఎందుకు చెప్తాను? మా ఇద్దరివీ విభిన్న మనస్తత్వాలు! మేము వివాహం చేసుకోవడం ఇద్దరికీ మంచిది కాదు. అందుకే ఆ నిర్ణయానికొచ్చాం!"

ఆమె ఇంకేమీ మాట్లాడలేకపోయింది. ఆ వార్త ఆమెకి పూర్తిగా నిరుత్సాహాన్నీ బాధనూ కలిగించింది. హేమ తప్పక తన కోడలవుతుందనే అభిప్రాయంతోనే ఉందిన్నాళ్ళూనూ! ఇటీవల సుధీర్ హేమపట్ల అనాసక్తి కనబరుస్తున్నా అది ఇలా పరిణమిస్తుందని ఎప్పుడూ అనుకోలేదు. ఈ తరం వారికీ ఆ తరం వారికీ ఎంత తేడా వుందో స్పష్టంగా తెలుస్తోందిప్పుడు. ఈ తరం వాళ్ళు తమ ఇష్టాఇష్టాలను ఏర్పరుచుకోవడం, వాటి కనుగుణంగానే జీవితాన్ని కూడా మలచుకోవడం కూడా చేస్తున్నారు.

సుధీర్ ఆఫీస్ కెళ్ళిపోవడం కూడా ఆమెకు తెలీదు. వంటింట్లో డైనింగ్ టేబుల్ దగ్గరే గోడ కానుకొని చాలాసేపు ఆ విషయమే ఆలోచిస్తూండిపోయింది.

*

హేమ తమ ఊళ్ళో బస్ దిగేసరికి సాయింత్రమయిపోయింది. ఇంటి దగ్గర తన తల్లీ తండ్రీ తన కోసమే ఎదుర్చూస్తున్నారు.

"అదిగో హేమ్ వచ్చేశాడు!" అన్నాడు తండ్రి ఆనందంగా.

"ఎలా అయిరంది ఇంటర్‌వ్యూ?" అడిగింది తల్లి.

"బాగానే జరిగింది మరి! ఏం చేస్తారో తెలీదు...." సూట్‌కేస్ లోపల పెట్టి కుర్చీలో కూర్చుంటూ అందామె.

"అత్తయ్యా, బావా అందరూ బావున్నారా?" అడిగాడు రామరాజు కూతురివంక చూస్తూ.

"అంతా క్షేమంగా ఉన్నారు డాడీ! దేవకి అత్తయ్య నన్నసలు ఇంత త్వరగా పంపడానికి ఒప్పుకోలేదు. ఉద్యోగం వస్తే ఎలాగూ ఇక ఇక్కడే ఉంటాగదా అని కోసేసి వచ్చేశాను...." నవ్వుతూ అంది హేమ.

"అది సరేగాని ఓసారి మీ నారీసమితి ప్రెసిడెంట్ ఇంటికి వెళ్ళిరా! ఆమె నీకోసం నిన్నటి నుంచీ తిరుగుతూంది!" అంది సౌభాగ్యమ్మ.

"ఎందుకు?" ఆశ్చర్యంగా అడిగింది హేమ.

"ఏమో! ఏదో ఊరేగింపు, మీటింగూ ఉన్నాయట వచ్చేవారంలో...."

"ఓహో...." ఆలోచిస్తూ తలూపిందామె.

సరిగ్గా అప్పుడే "ఏమండీ" అంటూ బయట నుంచి ఎవరో పిలవడం వినిపించింది.

"ఎవరూ?" రామరాజు బయటకు నడుస్తూ అన్నాడు.

"నేనండీ! చంద్రకాంత్‌ని! వసుంధర మా సిస్టర్!" గేటుదగ్గరే నిలబడి చెప్పాడతను.

"ఓహో వసుంధర తమ్ముడివా! రా, లోపలకు రా!" ఆదరంగా పిలిచాడు రామరాజు.

చంద్రకాంత్ లోపలికొచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

"ఏం చదువుతున్నావ్ నువ్వు?" అడిగాడు రామరాజు.

"ఇంటర్మీడియట్ ఫస్టియరండీ!" బిడియంగా అన్నాడతను.

"అలాగా! మరి తనకింత పెద్ద తమ్ముడున్నట్లు వసుంధర నాతో ఎప్పుడూ చెప్పలేదే?" నవ్వుతూ అన్నాడు రామరాజు.

చంద్రకాంత్ చిరునవ్వు నవ్వాడు.

ఈలోగా హేమ బయటికొచ్చి తొంగి చూసిందతని వేపు.

"ఏమిటి చంద్రా! నాతో కబురేమయినా చెప్పమందా వసుంధర?" అడిగిందామె.

"ఊహుం! లేదండీ! నాకే మీతో చిన్న పని పడింది...." బిడియంగా అన్నాడతను. అతనలా సిగ్గుపడుతూ మాట్లాడటం చూచి హేమకు నవ్వొచ్చింది.

"ఏమిటది?" అంది బలవంతంగా నవ్వాపుకొంటూ.

"మా వరకట్న నిషేధ సంఘం తరపున ఒక సావనీర్ వేస్తున్నామండీ! దానికి మీరేదేనా ఆర్టికల్ ఇవ్వాలి!"

"ఓస్! ఇంతేనా? ఇంకేమిటో అనుకొన్నాను, సరే ఇస్తాను!"

"థాంక్యూ ఎప్పటికి ఇవ్వగలరు?"

"రేపు సాయంత్రానికిస్తే చాలా?" అడిగింది హేమ.

"ఓ! సరిపోతుంది!" ఆనందంగా అన్నాడతను.

"ఇంతకూ ఆ సంఘంలో నువ్వేమిటి? ఏమయినా పదవి ఉందా?"

చంద్రకాంత్ మళ్లీ సిగ్గుపడ్డాడు.

"ఊహూ అదేమీలేదండీ! నేను అందులో ఓ మెంబర్ని అంతే! మీ దగ్గరనుంచి ఆర్టికల్ తెచ్చే బాధ్యత మాత్రం నాకు అప్పజెప్పారు. ఎందుకంటే మీరు మా సిస్టర్ ఫ్రెండ్ కదా!"

హేమ నవ్వేసింది.

"సరే! నేనిప్పుడే మొఖం కడుక్కొని వస్తానుండు!" అనేసి లోపలకు నడువబోయిందామె.

"నేనిక వెళ్తానండి మరి!" లేచి నిలబడుతూ అన్నాడతను.

"అయిదు నిముషాలాగు చంద్రకాంత్! నేనూ ఉషాదేవి వాళ్ళింటికి వెళ్లాలి. ఇద్దరం కలిసి వెళ్దాం." అనేసి వెళ్ళిపోయిందామె. మళ్ళీ అక్కడే కుర్చీలో కూర్చుండిపోయాడు చంద్రకాంత్.

"మీ 'వరకట్న నిషేధ సంఘం' ఏం చేస్తుందోయ్? అసలు ఆ సంఘం ఎందుకు పెట్టినట్లు మీ వాళ్లు?" అడిగాడు రామరాజు.

"వరకట్నం తీసుకోవడం నీచమయిన పని అని తెలియజెప్పడమే మా ఆశయం సార్! అంతేగాకుండా వరకట్నం తీసుకోము అనే యువకులందరినీ ఓ చోటకు చేర్చి అలాంటి కట్నాలు లేని వివాహాలు జరిపించాలని ప్రయత్నం!" బట్టీ పట్టినట్లు అప్పజెప్పాడు చంద్రకాంత్.

"ఓహో! అయితే మీ సంఘంలో సభ్యులెవరూ కట్నాలు తీసుకోరన్న మాట! అంతేనా?"

"అవునండీ!"

"మరి రేపు మీ అక్కయ్య వసుంధరకి కట్నం ఇవ్వకుండానే పెళ్లి చేస్తారా?"

చంద్రకాంత్ తడబడ్డాడు.

"అది మాకు సంబంధం లేదండీ! మా సిస్టర్ మా సంఘంలో మెంబరు కాదు...."

హేమ రడీ అయి బయటికొచ్చింది.

"పద చంద్రకాంత్! వెళ్దాం...." అంటూ గేటు దగ్గరకు నడిచింది.

రామరాజుతో "వస్తానండీ" అని చెప్పేసి తనూ ఆమె వెంబడి బయల్దేరాడు చంద్రకాంత్.

హేమతోపాటు నడుస్తోంటే మనసంతా ఆనందంతో పొంగిపొరలుతోంది చంద్రకాంత్‌కి. ఆమె అంటే ఎంతో అభిమానం అతనికి! ఆ అభిమానం ఎందుకేర్పడిందో తనకే తెలీదు. ఆమెతో మాట్లాడాలనీ, ఆమెతో కబుర్లు చెప్తూ షికార్లు చేయాలనీ, ఆమె నవ్వుతూంటే తనివితీరా చూడాలనీ - విచిత్రమయిన కోరికలు! నిజానికి 'సావనీర్' కోసం ఆమెని ఆర్టికల్ అడగమని ఎవరూ చెప్పనేలేదు తనకి! తనే ఆమెతో మాట్లాడాలి, ఆమెను చూడాలి అన్న కోరికతో 'సావనీర్'ని అడ్డుగా పెట్టుకొని వచ్చేడక్కడికి.

"రేపు ఉదయం వసుంధర నోసారి రమ్మని చెప్పరాదూ?" అంది హేమ అతనివంక చూసి.

"చెప్తానండీ!"

"లేదా, నువ్వెలాగూ రేపు సాయంత్రం ఆర్టికల్ కోసం వస్తానంటున్నావుగా! అప్పుడు తీసుకురా!"

తనతోపాటు అక్కయ్యని తీసుకురావడం అనేది చంద్రకాంత్‌కి నచ్చలేదు. ఆమెతోపాటు వస్తే తనను మరీ చిన్నపిల్లాడిలా చేసి మాట్లాడుకొంటారు వాళ్ళిద్దరూ. అది తనకిష్టం లేదు. తన అక్కయ్య వసుంధరా, హేమా ఇద్దరూ ఇంచుమించుగా ఒకటే వయసువాళ్ళు. అంటే తనకంటే అయిదేళ్లు పెద్దవాళ్లు. ఆ విషయం పదేపదే హేమకు గుర్తు రావడం తనకు సహించదు. అసలు హేమకంటే తను అయిదేళ్ళు చిన్నవాడిలా కనిపించకుండా ఉండటానికి ఎన్నో తంటాలు పడుతున్నాడు తను. ఎత్తుమడమలున్న బూట్లు కొన్నాడు. రేజర్‌తో నాలుగుసార్లు గడ్డం మొలవకపోయినా గీసుకొంటే గడ్డం దానంతటదే పెరుగుతుందని తన స్నేహితులు చెప్పారు. ఆ రోజు నుంచీ రోజుకి నాలుగుసార్లు గడ్డం చేసుకొంటున్నాడు. మరింత లావుగా కనబడడానికి ఎక్సర్‌సైజ్ చేస్తున్నాడు. ఇవన్నీ హేమ తనను చిన్న పిల్లవాడిగా జమకట్టకుండా ఉంటానికే. ఆమె తనని కూడా ఓ యువకుడిగా భావిస్తే చాలు! తన జన్మ తరించిపోతుంది.

"ఎందుకులెండి! ఉదయమే రమ్మని చెప్తాను!" అన్నాడు చంద్రకాంత్ త్వరత్వరగా.

"సరే!" తలూపింది హేమ.

ఇద్దరూ మార్కెట్‌వరకూ వచ్చేశారు.

"మరి నేనిటు వెళ్తాను!" సందులోకి తిరుగుతూ అంది హేమ.

"నేనూ ఉషాదేవిగారింటివరకూ వస్తాలెండి!" నవ్వుతూ అని ఆమెతోపాటే నడువసాగాడతను.

"హేమగారూ! మీరంటే నాకెంతో ఇష్టం!" అని ఆమెతో ఓసారి చెప్పాలని ఉంది. కానీ ధైర్యం చాలడం లేదు. ఆమె ఏమంటుందోనన్న భయం!

తన అక్కయ్య స్నేహితురాండ్రు ఎంతోమంది

ఉన్నా హేమ మీదే తనకు అంతటి ఇష్టం ఎందుకేర్పడిందో, ఆమె అభిమానం సంపాదించాలని ఎందుకనిపిస్తుందో ఆలోచిస్తే తనకు ఆశ్చర్యంగానే ఉంటుంది.

"ఇదే ఉషావాళ్ళ ఇల్లు!" అంది హేమ రోడ్డుపక్కనే ఉన్న ఓ మేడముందాగుతూ.

"మరి నేవస్తానండీ! ఆర్టికల్ మాత్రం మరచిపోకండి" అనేసి అక్కడి నుంచి వడివడిగా వెళ్ళిపోయాడు చంద్రకాంత్.

హేమకు నవ్వొచ్చింది అతనిని చూస్తూంటే. తనంటే అతనికెంతో అభిమానమన్న విషయం తనకు తెలుసు. అతను వసుంధరకున్న మిగతా స్నేహితురాండ్రెవరితోనూ మాట్లాడడు. వాళ్ళింటికెళ్ళడు. కానీ వారానికోసారయినా ఏదో ఒక పని కల్పించుకొని తన దగ్గరకు రాకమానడు. వచ్చాడంటే కనీసం ఓ గంటసేపయినా ఏదో ఒకటి మాట్లాడుతూ గడుపుతాడు.

"హలో...." పలుకరించింది ఉషాదేవి బయటికొస్తూ. "రక్షించావు! నువ్వింకో రెండు రోజులు అక్కడే ఉండిపోతావేమోనని భయపడ్డాను...."

"ఏమిటి విశేషం?" నవ్వుతూ లోపలకు నడిచి సోఫాలో కూర్చుంది హేమ.

"వచ్చే సోమవారం ప్రొసెషన్ ఒకటి ఆర్గనైజ్ చేద్దామని ప్రయత్నం. ఆ రోజు మన ఊరికి రాబోతున్న మంత్రిగారికి ఓ మెమొరాండం సమర్పించడం కూడా ఉంది. ముఖ్యంగా ఇది పెరిగిపోతున్న వరకట్నదురాచారాన్ని నిరసించడానికే ఉద్దేశించబడింది. ఇందులో చాలా ఆర్గనైజేషన్లు పాల్గొంటున్నయ్. మనను కూడా అడిగారు. సరేనన్నాము. కాలేజ్ గరల్స్ తలపెట్టిన కార్యక్రమం ఇదంతా!" గడగడ మాట్లాడుతూ చెప్పింది ఉషాదేవి.

"ఓకే! అలాగే చేద్దాం!" ఒప్పుకొంటూ అంది హేమ.

"మనం మన సభ్యులందరికీ వెంటనే ఇంటిమేషన్స్ పంపించాలి. ఆఫీసు కెళ్దామా మరి?" అడిగిందామె వాచి చూసుకొంటూ.

"పద!" అన్నది హేమ.

ఇద్దరూ బయల్దేరి అక్కడికి దగ్గర్లోనే వున్న సుశీలమ్మగారి మేడకు చేరుకున్నారు. సుశీలమ్మ ఆ ఊళ్లోని ప్రముఖురాలు. ఆ ఊళ్ళో ఏ సభ జరిగినా, సన్మానం జరిగినా, కల్చరల్ ప్రోగ్రామ్స్ జరిగినా ఆమె వుండాల్సిందే. ఎన్నో అనధికార సంఘాల్లో ఆవిడ సభ్యురాలు. ఆ ఊళ్ళోని లేడీస్ క్లబ్‌కి ఆమె సెక్రటరీ! ఆమె భర్త వీర్రాజుగారు ఓ చిన్న సైజు జమీందారు. ఆయనకు వేటంటే అమితమైన పిచ్చి. ఆ పిచ్చివల్లే సుశీలమ్మ భర్తృ విహీన అయిపోయింది. ఓసారి వేటకెళ్ళి పొదలో దాక్కున్న చిరుతపులిని కాల్చారాయన. తర్వాత దాన్ని ఆ పొదలో నుంచి బయటకు లాగుతోంటే అది రివ్వున లేచి ఆయన్ని చంపి తినేసింది. అప్పటి వరకూ తను కాల్చిన గుండు దానికి తగలలేదన్న విషయం ఆయనకు తెలీదు.

ఇదీ సుశీలమ్మ గతం.

ప్రస్తుతం ఆమె మేడలోనే ఓ గదిలో 'విప్లవ నారీ సమితి' కార్యాలయం ఉంది. అలాంటి కార్యాలయాలు ఆ మేడలో చాలా ఏర్పాటు చేసిందామె.

ఉచితంగా ఆఫీసు లభించడం వల్ల ఆమె మీద గౌరవం ఏర్పడిపోయింది అందరికీ.

హేమ ఆఫీసు పని చూసుకుని ఇంటికి తిరిగి వచ్చేసరికి రాత్రి ఎనిమిదయిపోయింది. భోజనం ముగించి తెల్ల కాగితాలు ముందేసుకుని టేబుల్ లైట్ దగ్గర కూర్చుందామె. సావనీర్‌లో తను రాయబోయే ఆర్టికల్ ఎలా వుండాలో ఆమెకు తట్టడంలేదు.

స్త్రీ, తను స్త్రీ అవడం వల్ల ఈ సంఘంలో ఎదుర్కొంటున్న సమస్యలు రాయాలని కొద్దిసేపటి తర్వాత నిర్ణయాని కొచ్చింది. వెంటనే రాయడం ప్రారంభించింది. మొదటి వాక్యం రాయడానికే గంట టైము, అరడజను తెల్ల కాగితాలూ పాడయినాయి.

అలాంటివి రాయడం తనకు రాదనికాదు. కాలేజీలోనూ, హైస్కూల్లో చదివేప్పుడూ మాగజైన్‌కి కథలు రాసింది తను. వాటిని చదివిన వారందరూ ఎంతో బాగా రాసిందని మెచ్చుకున్నారు. అవి ముఖప్రీతి మాటలు కాదు. వారు నిజంగా ఫీలయిందే చెప్పారు తనకి. ఎటొచ్చీ చాలా రోజుల తరువాత ఇప్పుడు సావనీర్‌కి రాయాలంటే కొంచెం ఇబ్బందిగా ఉంది. అంతే!

రాత్రి పదకొండయినా ఎటూ తేలటం లేదు. హేమకు నిద్ర ముంచుకొస్తోంది. కానీ చంద్రకాంత్ మర్నాడు సాయంత్రం వస్తే 'రాయలేదని' చెప్పడం తనకు చేతకాని పని. అతను 'హర్ట్' అవుతాడు. అది తనకు ఇష్టం లేదు. తనంటే ఎంతో అభిమానంతో అడిగినప్పుడు తన అభిమానం నిలబెట్టుకోవాలి.

ఎలాగోలా కష్టపడి రాయడం పూర్తి చేసిందామె. అదోసారి చదువుకుంటే ఆమెకి ఎంతో సంతృప్తికలిగింది. తన మనసులో ఉన్న భావాలన్నీ కాగితం మీద పెట్టగలిగిందిప్పుడు. త్వరత్వరగా ఆ చిత్తు ప్రతిని మళ్ళీ చక్కని దస్తూరితో రాసి టైము చూసుకుందామె. తెల్లారుజామున మూడయింది. అప్పటికే కళ్ళు మంటలు పుడుతున్నాయి. మూసుకుపోతున్న కళ్ళతో మంచం మీద వాలిపోయింది ఆమె. తిరిగి మెలకువ వచ్చేసరికి ఉదయం తొమ్మిది దాటింది.

పక్కింటావిడ పెరట్లో నూతి దగ్గర బట్టలు ఉతుకుతూంది. బండెడు బట్టలు! భర్తవీ, పిల్లలవీనూ! నాలుగయిదు గంటలపాటు వాటితో సతమతమయిపోతుందామె. ఆమెను చూస్తూంటే మనసంతా జాలితో నిండిపోతుంది తనకి. తెల్లారుజామున అయిదింటి నుంచీ రాత్రి పదింటివరకూ మరమనిషి లాగా చాకిరీ చేస్తూంటుందామె. ఆమె భర్త మాత్రం ఉదయం ఎనిమిదింటికి లేచి తొమ్మిది వరకూ పేపరు చదివి పదింటికి ఆఫీసుకెళ్ళిపోతాడు. సాయంత్రం ఆఫీసు నుంచి ఏ స్నేహితుడింటికో వెళ్ళి కాసేపు పేకాట ఆడి, రాత్రి తొమ్మిదిగంటలకు ఇల్లు చేరుకొంటాడు. ఇంట్లో విషయాలేమీ పట్టించుకోడు. అతనిని చూస్తూంటే వళ్లు మండిపోతుంది తనకి. కేవలం ఇంటిపని చేయడానికే 'భార్య' ఉంది అన్న ధోరణి గల అతని లాంటి మగాళ్ళు తనింటిచుట్టూ ఎంతోమంది ఉన్నారు. తమాషా ఏమిటంటే వారి భార్యలు ఆ విషయం గురించి ఆలోచించరు. పట్టించుకోరు. గానుగ ఎద్దు జీవితానికి అలవాటుపడిపోయారు.

తను వారితో మాట్లాడినప్పుడల్లా వారిలో మార్పు తీసుకురావడానికి ప్రయత్నిస్తూనే ఉంటుంది. వారి ఆలోచనా ధోరణిని విరసిస్తూంటుంది. విదేశాల్లో 'స్త్రీ' పరిస్థితిని వివరించి మన దేశపు స్త్రీలు ఎంత వెనుకబడి ఉన్నారో తేడా చూపుతుంది.

తన దగ్గర ఉన్నంతసేపూ తన మాటలు నిజమేనని ఒప్పుకొంటారు వాళ్ళు. తాము ఎలాంటి దుర్భర జీవితం గడుపుతోందీ గ్రహిస్తారు. కానీ ఎవరిళ్లు వారు చేరుకొన్నాక మళ్ళీ మామూలే!

ఓసారి తనకు వట్లమంది వాళ్ళందరి పేర్లూ యథాతథంగా ఉంచి వాళ్ళ భర్తలు వారినెంత క్రూరంగా, హింసిస్తోందీ ఓ వ్యాసం రాసి వార

పత్రికకు పంపించింది. అది ప్రచురింపబడిన వెంటనే తను పేటంతా పెద్దగాలి దుమారం చెలరేగింది. తమ జీవితాలలా పేపరుకెక్కించడం తమకేమీ నచ్చలేదంటూ తమ నిరసన తెలియజేశారు వాళ్ళు. కొద్ది రోజులు అసలు తనతో మాట్లాడడం కూడా మానివేశారు.

సాయంత్రం నాలుగవుతుండగా చంద్రకాంత్ వచ్చాడు.

వెంటనే తను రాసిన కాగితాలు తీసుకొచ్చి అతనికందించింది హేమ.

"థాంక్యూ అండీ!" కృతజ్ఞతతో చూస్తూ అన్నాడతను.

"కొంచెం ఘాటుగా రాశాను. ఏమీ ఫరవా లేదుగా?" అడిగింది నవ్వుతూ.

అతను బిడియంగా నవ్వాడు.

"మీరు ఎలా రాసినా ఫరవాలేదండీ! చక్కగానే ఉంటుందది!" హేమ నవ్వేసింది గట్టిగా.

"మాకు ట్రాన్స్‌ఫర్ అయిపోయిందండీ! వారం రోజుల్లో హైద్రాబాద్ వెళ్ళిపోతున్నాము..." అన్నాడు చంద్రకాంత్ కొద్దిక్షణాల తర్వాత.

హేమ ఆశ్చర్యపోయింది.

"అరె! ఇంత హఠాత్తుగానా?" అన్నది అతని వంక కళ్ళు పెద్దవిచేసి చూస్తూ.

"అవును! నిజం చెప్పాలంటే మాకెవ్వరికీ ఈ ఊరు వదలడం ఇష్టం లేదు!" అన్నాడతను. ఆ మాట చెప్తుంటే అతని మనసంతా బాధతో నిండిపోయింది.

"ముఖ్యంగా నాకు అసలు ఇష్టం లేదు హేమ గారూ! మిమ్మల్ని చూడకుండా ఉండడం నాకు ఎలా సాధ్యమో అర్థం కావడంలేదు...." అనాలనుకొన్నాడతను. కానీ ఆ మాట మనసులోనే ఆగిపోయింది.

"అలాగయితే నాకు వసుంధర కంపెనీ ఉండదన్నమాట ఇక...." నిరుత్సాహంగా అంది హేమ. స్నేహం కలసి కొద్దికాలమే అయినా ఆమె తనకెంతో ఆప్తురాలయిపోయింది.

"వస్తానండీ! వెళ్ళేలోపు మళ్ళీ కలుస్తాను" అంటూ లేచి బయటకు నడిచాడతను.

చాలాసేపు వసుంధరతోపాటు గడిపిన రోజులు తల్చుకొంటూ అక్కడే కూర్చుండిపోయింది హేమ.

"ఏమిటమ్మా ఆలోచిస్తున్నావ్?" అంటూ అప్పుడే ఆఫీస్ నుంచి వచ్చిన తండ్రి పలుకరించే వరకూ ఈ లోకంలోకి రాలేదు.

"మా ఫ్రెండ్ వసుంధర వాళ్ళకు హైద్రాబాద్ ట్రాన్స్‌ఫర్ అయిపోయిందిట డాడీ!" బాధగా అందామె.

రామరాజు నవ్వేశాడు.

"ఓష్! అదేనా? దాంట్లో ఆశ్చర్యమేముందీ? వాళ్ళ నాన్నగారి ఉద్యోగం అలాంటిది. ఎక్కడా పట్టుమని పదేళ్ళు ఉండడానికి వీల్లేదు." అన్నాడు తనూ ఆమె కెదురుగ్గా కుర్చీలో కూర్చుంటూ.

ఫ్లాస్కులోని 'టీ' తీసుకొచ్చి ఇద్దరికీ చెరో కప్పులో నింపింది హేమ.

"ఏమో డాడీ! వసుంధర దూరమవుతోందంటే నాకు అదోలా ఉంది!" బాధగా అందామె.

రామరాజు గ్రహించాడది.

"అయినా మీ ఇద్దరూ దూరంగా ఉండేది ఎన్ని రోజులని? మరో రెండు నెలల్లో నీకు పెళ్ళి అవనే అవుతుంది. అప్పుడిక ఎలాగూ హైద్రాబాద్‌లో మీ అత్తయ్య ఇంటి దగ్గరే ఉంటావుగా! రోజూ వసుంధరని కలుసుకోవచ్చు...." అన్నాడు ఆమెను తేలికపర్చడానికి. హేమకు చటుక్కున సుధీర్ తనతో బస్‌స్టాండ్ దగ్గర జరిపిన సంభాషణ గుర్తుకొచ్చింది.

తను మర్చేపోయింది. అతని అభిప్రాయం తన తల్లిదండ్రులకు తెలియజేయాల్సిన బాధ్యత తనమీదుంది.

"సుధీర్ నేనూ పెళ్ళి చేసుకోబోవటం లేదు డాడీ!" సూటిగా చెప్పేసిందామె. రామరాజు తృళ్ళిపడ్డాడు.

"ఏమిటి?" అన్నాడు తను విన్న విషయం నమ్మలేక.

"అవును డాడీ! నేనిక్కడకు వచ్చేముందు బస్‌స్టాండ్‌లో ఇద్దరం మనసువిప్పి మాట్లాడుకొన్నాం! మా ఇద్దరివీ విభిన్న మనస్తత్వాలు. చాలా విషయాల్లో ఇద్దరికీ అభిప్రాయభేదాలున్నాయి. అంచేత వివాహం చేసుకోవడం అవివేకమవుతుందని నిర్ణయించుకొన్నాం!" శాంతంగా మాట్లాడింది హేమ. రామరాజు కొద్ది క్షణాలవరకూ మాట్లాడలేకపోయాడు. అతను ఇలాంటి పరిస్థితిని బొత్తిగా ఊహించలేదు. హేమ విషయంలో తను నిశ్చింతగా ఉన్నాడు ఇన్నాళ్ళూ! ఆమెకు కాబోయే భర్త



డా॥ ఎం. కె. దేవకి

తెలుగులో బాలల సాహిత్య వ్యాప్తిని, వైశిష్ట్యాన్ని గురించిన సమగ్ర పరిశోధన గావించి "తెలుగులో బాలగేయ సాహిత్యం — సవిమర్శక సమీక్ష" పేరిట సిద్ధాంత వ్యాసం శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి సమర్పించి డాక్టరేట్ పట్టం పొందిన వనిత – మహాసముద్రం కోదండ రెడ్డి దేవకి.

చిత్తూరు జిల్లా వరిగపల్లె నివాసియైన దేవకి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ద్వారా భాషా శాస్త్రంలో డిప్లొమా పొందారు. 1974 లో ఎం. ఏ. ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణురాలై శ్రీ తిక్కవరపు రామిరెడ్డి స్వర్ణపతకాన్ని, శ్రీ వెంకటకృష్ణారావు స్మారక బహుమతినీ పొందారు.

బాల సాహిత్య రచనా వ్యాసంగంలో అభిలాష పెంపొందించుకున్న దేవకి కథలు, గేయాలు, వ్యాసాలు అనేక పత్రికలలో ప్రచురింపబడ్డాయి. ఆమె సేకరించి సంపాదకత్వం వహించిన 'చిన్న పిల్లల పాటలు' గేయ సంకలనాన్ని రాష్ట్ర బాలల అకాడమీవారు ప్రచురించారు.

అంతర్జాతీయ బాలల సంవత్సరాన్ని పురస్కరించుకుని తెలుగు బాల సాహిత్య రచయితల జీవిత విశేషాలను గ్రంథ రూపంలో వెలుగులోకి తేవాలన్న సంకల్పంతో బాల సాహిత్య రచయితల జీవిత విశేషాలను సేకరిస్తున్నారు.

—బి. సౌభాగ్యమ్మ

సుధీరేనన్న ధీమాతో వేరే సంబంధాలు వచ్చినా తిరగగొట్టేశాడు. తన స్నేహితుడు రంగారావ్ హేమను చూసి ముచ్చటపడి అతని కోడలిగా చేసుకొంటానని అడిగినా తను అంగీకరించలేదు. అతని కొడుకు సెంట్రల్ గవర్నమెంట్ ఆఫీసరు. అలాంటి అవకాశాలు నాలుగయిదు వచ్చాయి. మరి సుధీర్ గానీ, హేమగానీ ఇలాంటి నిర్ణయానికొస్తారని తెలుస్తే వాటిల్లో ఏదో ఒకటి నిశ్చయమయిపోయేది. ఈపాటికి ఈమె ఓ బిడ్డ తల్లి కూడా అయేది.

"మీకు కోపం వచ్చిందా డాడీ?" తండ్రి మౌనం చూసి అడిగింది హేమ.

"కోపం కాదమ్మా! ఈ విషయం అప్పుడే తెలుస్తే నిన్ను కావాలని చేసుకోడానికి ముందుకొచ్చిన సంబంధాల్లో ఏదో ఒకటి నిశ్చయించేవాడిని కదా అని ఆలోచిస్తున్నాను...."అని కొద్ది క్షణాలాగి

"అది సరేగాని హేమా! ఇది నీ నిర్ణయమా, సుధీర్ నిర్ణయమా?" అనడిగాడతను.

"ఎవరిదయితే మాత్రమేం డాడీ! ఏమయినా తేడా వుంటుందా?" చిరునవ్వుతో తండ్రినడిగిందామె.

"ఊహు! అది కాదమ్మా! ఇందులో నాకేదో కపటం కనబడుతోంది. నిజం చెప్పు! ఇది సుధీర్ నిర్ణయమేకదూ? అతని ఆలోచనలేకదూ?" సూటిగా కూతురివంకే చూస్తూ అడిగాడు రామరాజు.

"అవును డాడీ! ముందు బావే తన మనసులోని అభిప్రాయం చెప్పాడు. ఆలోచించి చూస్తే బావ ఆలోచనలు సహజమైనవేననిపించింది నాకు కూడా! మా ఇద్దరికీ ప్రతి విషయంలోనూ చుక్కెదురే! మీకూ తెలుసుగా! అందుకే నేనూ అదే మంచిదనుకొన్నాను...." నిర్మొహమాటంగా చెప్పిందామె.

"అయితే అవ్వచ్చు! కానీ నాకో అనుమానం కలుగుతోంది. సుధీర్ ఇంకెవరినయినా అమ్మాయిని ప్రేమించి నిన్ను వివాహం చేసుకోకుండా తప్పించుకోడానికి ఈ నాటకమాడుతున్నాడేమోనని!"

కొంచెం కోపంగా అన్నాడు రామరాజు.

హేమ నవ్వేసింది.

"మీరు భలేవారే డాడీ! సరే పోనీ ఒకవేళ మీ అనుమానం నిజమేననుకోండి! ఆ పరిస్థితుల్లో కూడా మా వివాహం జరగదుకదా! 'అతనికి మనసయిన అమ్మాయిని చేసుకొనే హక్కు లేదంటారా?"

"ఊహు అదికాదమ్మా నా ఉద్దేశం! ఇలా డొంకతిరుగుడు వ్యవహారం కాకుండా సూటిగా మనసులోని విషయాలు చెప్తే బావుండేదని! అంతే!" నిట్టూరుస్తూ అన్నాడు రామరాజు.

హేమ టీపాయ్ మీదున్న ఇంగ్లీష్ మాగజైన్ తీసుకొని పేజీలు తిరగేయసాగింది.

"మీ అమ్మేదీ?" అడిగాడు రామరాజు.

"క్లబ్‌కెళ్ళింది డాడీ! రాత్రికిగాని రానంది! ఏదో పార్టీ ఉందట!"

"ఓహో...." చికాకుగా అన్నాడతను.

హేమ వివాహం విషయం వెంటనే ఆమెతో చర్చించాలని ఉందతనికి. తనకి ఆవేదన కలిగించే విషయాలన్నీ ఆమెతో పంచుకొంటే సగం భారం తగ్గినట్లనిపిస్తూంటుందతనికి. ఇలాంటి సమయంలో ఆమె క్లబ్‌కెళ్ళడం అతనికి మరింత చికాకు కలిగించింది.

లేచి తన గదిలోకెళ్ళిపోయాడతను.

హేమ కొద్దిసేపు నిశ్చలంగా కూర్చుండిపోయింది. మనసునిండుగా ఏవేవో ఆలోచనలు ముసురుకొన్నాయి.

తన వివాహ విషయం మూలంగా తండ్రి అంతగా అప్సెట్ అవడం బాధగా ఉందామెకి. ఇందులో అంతగా ఆలోచించాల్సిన అవసరమేమిటో తనకు అర్థం కావడం లేదు. సుధీర్ చేసుకోకపోయినంతమాత్రాన మునిగేదేమిటి? సుధీర్ కాకపోతే ఇంకొకరు! వారు కాకపోతే మరొకరు. ఒకవేళ ఎవ్వరూ చేసుకోకపోతే మాత్రం నష్టమేమిటి? మగవాళ్ళు ఎంతమంది జీవితాంతం బ్రహ్మచర్యం పాటించడంలేదు? అలా స్త్రీలు మాత్రం ఎందుకుండలేరు? ఉండగలరని తనే ఋజువు చేస్తుంది. రోషంగా అనుకొందామె. ఆమె మొఖం మరింత ఎర్రబడింది -పెదాలు కోపంతో అదిరినయ్.

*

ఆ రోజు శ్రీనివాసరావ్ ఆఫీస్ పని కల్పించుకొని సుధీర్‌వాళ్ళ సెక్షన్‌కి చేరుకొన్నాడు. అతనిని చూస్తూనే ఆప్యాయంగా పలుకరించాడు సుధీర్.

"అవేవో సర్క్యులర్స్ తెమ్మని పంపించాడు మా బాస్! అందుకని వచ్చాను...." అన్నాడు శ్రీనివాసరావ్.

"పద! కాంటీన్‌కెళ్దాం!" అన్నాడు సుధీర్ లేచి అతనితోపాటు బయటకు నడుస్తూ.

ఇద్దరూ కాంటీన్‌లో కౌంటర్ దగ్గర రెండు కప్పులు 'టీ' తీసుకొని ఓ టేబుల్‌ముందు కూర్చున్నారు.

"ఏమిటి మీ డ్రామా విశేషాలు? కొత్తదేమయినా టేకప్ చేశారా?" అడిగాడు శ్రీనివాసరావ్. వెంటనే హేమ విషయం అడిగితే అతను మరోలా భావిస్తాడేమోనని సంశయంగా ఉందతనికి.

"అవును! 'ఆచార్య నాగార్జున' అనే చారిత్రాత్మిక నాటకం రిహార్సల్స్ ప్రారంభించాము. చాలా బావుంటుందిలే అది! నీక్కూడా ఓపికుందంటే చెప్పు! ఇంకా రెండు చిన్న కారెక్టర్స్‌కి మనుషులు కావాలి!" అడిగాడు సుధీర్.

శ్రీనివాసరావ్ అతనికి రెండు చేతులెత్తి నమస్కరించాడు.

"బాబ్బాబు! నాకు మళ్ళీ లేనిపోని ఆశలు పెట్టకు!" అన్నాడు నవ్వుతూ.

"సరే! నీ ఖర్మ! అలాంటి గొప్ప నాటకం వేసే రాత నీకు లేదు! ఏం చేస్తాం?" తనూ నవ్వుతూ అన్నాడు సుధీర్.

"అది సరేగాని, ఇంక ఎప్పుడూ ఈ నాటకాలూ వేషాలూ వేయడమేనా? పెళ్ళీ పెటాకులూ చేసుకోవా?" సంభాషణని తనక్కావలసిన విషయం వేపు మళ్ళిస్తూ అడిగాడు శ్రీనివాసరావ్.

సుధీర్ గట్టిగా నవ్వేశాడు.

"నా పెళ్ళి మీద అంత శ్రద్ధ పుట్టుకొచ్చిందేమిటి? మీ తరఫున ఎవరయినా పెళ్లి కావలసిన అమ్మాయిలున్నారా?"

"అదేం కాదులే! ఊరికే అడుగుతున్నాను. అయినా నీకు వేరే అమ్మాయి లెందుకింకా! మీ హేమ సిద్ధంగానే ఉందిగా!" గుండెలు వేగంగా కొట్టుకొంటూండగా అన్నాడతను. సుధీర్ ఏం జవాబు చెప్తాడోనని ఆందోళనగా ఉందతనికి.

"హేమా! హేమను నేను పెళ్లి చేసుకొంటానని ఎవరు చెప్పారు నీకు?" అడిగాడు సుధీర్ తాపీగా.

శ్రీనివాసరావ్ తడబడిపోయాడు.

"అబ్బే! ఎవరూ చెప్పలేదు! ఆమె మీ మావయ్య కూతురుకదా! అందుకని ఒకవేళ వివాహం చేసుకొంటున్నావేమోనని అనుకొన్నాను"

"మామయ్య కూతురయినంతమాత్రాన వివాహం చేసుకుతీరాలని రూలుందా ఏమిటి? అసలీ దగ్గర సంబంధాలు చేసుకోవడం మంచిది కాదని

మన శాస్త్రజ్ఞులు నెత్తిన నోరు పెట్టుకుని మొగుతున్నారు. అవునాకాదా ?''

శ్రీనివాసరావ్ ఆనందంతో ఉక్కిరిబిక్కిరయిపోసాగాడు. సుధీర్ చెప్పేది నిజమేనా ? తను అసంభవాలను కొన్నవి సంభవాలయే అవకాశం ఉందా ?

సుధీర్ మాటల్లో '' అతను హేమను వివాహం చేసుకోబోవడం లేదు '' అన్న మాటే అతను విన్నాడు. ఆ తరువాత ఇంకేమీ వినిపించడం లేదతనికి. అతని మనసు అతనిని అక్కడి నుంచి ఎంతో దూరం మోసుకెళ్లిపోయింది. తన జీవితంలో ఇంతటి ఆనందం బహుశా ఎప్పుడూ అనుభవించి ఉండడు.

'' అదీగాక అసలు మా ఇద్దరి ఆలోచనల్లోనూ చాలా వ్యత్యాసం ఉంది. హేమ లాంటి ఆధునిక యువతంటే నాకు నచ్చదు. నువ్వు నన్ను ఏ విధంగానయినా ఊహించుకో ! కానీ నాకు పురాతన సాంప్రదాయాలంటేనే గౌరవం, ఇష్టమూనూ ! ఆడదంటే ఆడదాని లాగానే ఉండాలి. చీర కట్టుకోవాలి. గాజులు వేసుకోవాలి. జడ వేసుకోవాలి. బొట్టు పెట్టుకోవాలి. మగవాడంటే గౌరవమియ్యాలి. పరాయి పురుషుల ఎదుట సిగ్గుపడాలి. తొలగిపోవాలి ! — అంతేగాని నా పెళ్ళాం కూడా నాలాగానే పాంటూ, షర్టూ వేసుకొని, వాచీ పెట్టుకొని '' హలో హౌడూయూడూ '' అంటూ కనపడినవాడినల్లా పలుకరించి చేతులు కలుపుతూ తిరుగుతూ ఉంటే నేను సహించలేను. అది '' స్త్రీజాతి అభివృద్ధికి చిహ్నం '' అంటే నేనొప్పుకోను....'' తాపీగా మాట్లాడాడు సుధీర్.

''అలా అని నన్నో బూజుపట్టిన భావాల మనిషిగా జమవేయకు ! భర్తని భార్య ఎలా గౌరవించాలో భార్యను భర్త కూడా అదే గౌరవంతో చూడాలని కూడా నేనంటాను !'' కొద్ది క్షణాల తర్వాత తిరిగి అన్నాడతను.

శ్రీనివాసరావ్ చిరునవ్వు నవ్వాడు. అతనికి సుధీర్ మాటల్లోని సారాంశం ఏమిటో ఏ మాత్రం తెలీలేదు. అసలతని మనసక్కడలేదు. తను హేమను ఎంతగా ప్రేమిస్తోందీ, ఆమెను వివాహం చేసుకోవాలన్న ఆలోచనా—అన్నీ చెప్పాలనుందతనికి. కానీ అందుకుతగ్గ అవకాశం లభించడం లేదు.

'' నీకో విషయం చెప్పేదా ?'' నెమ్మదిగా అడిగాడు శ్రీనివాసరావ్. తన మనసుని ఎంత త్వరగా అతనికి తెలియజేద్దామా అని ఉందతనికి.

'' ఏమిటది ?'' అడిగాడు సుధీర్ సిగిరెట్ ముట్టించుకొంటూ.

'' నువ్వు అన్యధా భావించనని మాట ఇవ్వాలి !''

'' బావుంది ! అదేమిటో తెలీకుండా ఎలా ?'' నవ్వుతూ అన్నాడు సుధీర్.

'' నీకు హాని కలిగించే విషయమేమీ కాదులే !''

'' అలాగయితే ఇంక నేను మరోలా ఎందుకు భావిస్తాను ! పరవాలేదు ! చెప్పు !'' ప్రోత్సహిస్తూ అన్నాడు సుధీర్.

'' నేను మీ మామయ్య కూతురు హేమను వివాహం చేసుకోవాలనుకొంటున్నాను !'' వేగంగా కొట్టుకొంటున్న గుండెలతో అన్నాడు శ్రీనివాసరావ్. తృళ్లిపడ్డాడు సుధీర్. అతనికి రెండు నిమిషాలవరకూ నోట మాటరాలేదు.

'' హేమను వివాహం చేసుకొంటావా ?'' అంటూ రెట్టించి అడిగాడు నమ్మకం కలుగనట్లు.

'' అవును ! ఆమెకు అంగీకారమయితే !''

'' అసలు హేమనే చేసుకోవాలని ఎందుకనుకొంటున్నావ్ ?'' అడిగాడు సుధీర్.

'' ఏమో ! ప్రమాణపూర్వకంగా చెబుతున్నాను. ఆమెలో ఏ అంశం నన్నాకర్షించిందో నాకు తెలీదు. కానీ ఆమెను వివాహం చేసుకోకపోతే ఇంక అసలు వివాహమే అనవసరం అనేంత గాఢంగా ఆమె ప్రేమలో పడిపోయాను........'' కల్మషం లేకుండా అన్నాడు శ్రీనివాసరావ్.

'' అలా వెనుకాముందూ చూడకుండా ప్రేమలో పడిపోతే ప్రమాదం ! నవ్వుతూ అన్నాడు సుధీర్.

'' ఆ సంగతి పడిపోయాక చెప్తే ఏం లాభం ?'' తనూ నవ్వుతూ అన్నాడు శ్రీనివాసరావ్.

'' అవును ! ఆ మాటా నిజమేలే !''

'' నాకు హేమ గురించి కొన్ని విషయాలు తెలుసుకోవాలనుంది...'' అడిగాడు తను.

'' ఏమిటవి ? ఆమె ఎలాంటిదనా ?''

'' ఊహూ ! ఆమె వ్యక్తిగత విషయాలు కాదు నాక్కావలసింది. వివాహం గురించి ఆమెకు గానీ, ఆమె తల్లిదండ్రులకు గానీ ఉన్న అభిప్రాయాలు. ఉదాహరణకి కొంతమందికి తమ కూతురిని కేవలం డాక్టర్కే ఇచ్చి పెళ్లి చేయాలనో, లేదా కేవలం ఇంజనీరుకే ఇవ్వాలనో – లేదా మరో ఆఫీసరనో - ఇలా ఎన్నో ఉద్దేశ్యాలుంటాయ్. అలాగే హేమకు కూడా తన క్కాబోయే వరుడు ఇలా ఉండాలని ఏమయినా పట్టింపు లుండవచ్చు ! వాటి గురించి నీకేమయినా తెలుస్తే చెప్పు !''

సుధీర్ కొద్ది క్షణాలు ఆలోచనలో పడ్డాడు.

'' నాకు తెలిసినంతవరకూ వాళ్ళెప్పుడూ అసలామె వివాహం గురించే ఆలోచించలేదు....'' అన్నాడు నెమ్మదిగా.

'' ఎందుకని ?'' ఆశ్చర్యంగా అడిగాడు శ్రీనివాసరావ్.

గ్వాలియర్ సమీపంలోని సాలిగ్రామంలో ఈమధ్య ఓ వరుడు ' వింత కట్నం ' కోరాడు. అతని మామగారికి విపరీతంగా బీడీలు పీల్చే అలవాటుందిట. దాంతో అతని ఊపిరితిత్తులకి క్యాన్సర్ వ్యాధి వచ్చింది. డాక్టర్లు—బీడీలు కాల్చకూడదూ అన్నా వినకుండా ఆ మహానుభావుడు రోజుకు ఇరవై చొప్పున బీడీలు తగలెట్టేస్తున్నాడట. ఈ విషయం కాస్తా వరుడికి తెలియవచ్చింది. దాంతో అతగాడో షరతు పెట్టాడుట. మామగారు బీడీలు మానేస్తానని ప్రమాణం చేస్తే తనకి కట్నం అవసరంలేదనీ, అసలు బీడీలు మానేస్తేనే శోభనం గదిలోకి అడుగు పెడతాననీ మొండికెత్తాడట ! పాపం ఆ మామగారు కాస్తా కాస్సేపు ' అలవాటైన



బీడీలా.... ప్రాణప్రదమైన కూతురు కాపురమా ' అని తెలుగు సినిమాలోలాగా ఝుంయూటపడి చివరకి బీడీలు మానెయ్యడానికి నిశ్చయించుకుని ఆ విధంగా ప్రమాణం చేశాడుట. అబ్బ.... అలాంటి మామగారున్నా లేకపోయినా ఇంటింటికీ యిటువంటి అల్లుళ్ళుంటే ఎంత బాగుండునో కదా !

" మొదట్నుంచీ హేమను నాకిచ్చి చెయ్యాలనే మావాళ్ళందరి అభిప్రాయం! కానీ ఆమెను వివాహం చేసుకోవడం లేదని ఈ మధ్యే నేను వాళ్ళకు తెలియజేశాను...."

శ్రీనివాసరావ్ సుధీర్ కళ్ళల్లోకి చూశాడు.

" నీకేమీ అభ్యంతరం లేకపోతే అందుకు కారణం నాకు చెప్పగలవా?" అడిగాడు కుతూహలంగా.

" ఇందులో చెప్పకూడనిదేముందీ? హేమలో ఇటీవల చాలా మార్పు వచ్చింది. ఆడది మగవాడూ సమానమని స్లోగన్స్ ఇస్తే తప్పని కాదు. కానీ ఆమె తప్పు ఆలోచనా ధోరణిలో పడిందని పించింది నాకు. ఆమెలో మూర్ఖత్వం చోటు చేసుకుంది. అందువల్ల ఆమెను వివాహం చేసుకుంటే వైవాహిక జీవితాన్ని కోరి కలతలమయం చేసుకొన్నట్లవుతుందని సంశయించాను." తాపీగా అన్నాడు సుధీర్.

శ్రీనివాసరావ్ నవ్వాడు.

" చాలా చిన్న విషయం ఇది...." అన్నాడు సుధీర్ వంక చూస్తూ. సుధీర్ శ్రీనివాసరావ్ వైపు ఆశ్చర్యంగా చూశాడు.

" అంటే?"

" పెళ్ళికాక ముందు ఆడపిల్లలు కాలక్షేపం కోసం ఏవేవో మాట్లాడతారు, చేస్తారు. అవన్నీ సీరియస్‌గా తీసుకోకూడదు!" అన్నాడతను నవ్వుతూ.

" హేమ మాటలు కాలక్షేపం మాటలు కాదు! సరే – నువ్వంత తేలిగ్గా తీసుకుంటానంటే – గో ఎ హెడ్! నేనింక చెప్పేదేమీ లేదు...."

హేమ మీద అంతటి అయిష్టాన్ని ఏర్పరుచుకొన్న సుధీర్‌ని చూస్తుంటే ఆశ్చర్యంగా ఉంది. అతని మనసులోని ఆలోచనలు తెలుసుకున్నదంటే ముందు హేమే సుధీర్‌ని చేసుకోనని చెప్పేస్తుంది.

" అయితే నువ్వు హేమను వివాహం చేసుకొంటానంటావ్! అంతేగా?" అడిగాడు సుధీర్ కొద్ది క్షణాల తర్వాత.

" అవును!"

" ఇందులో వాళ్ళు అభ్యంతరం చెప్పేందుకేముందీ? నువ్వు అడిగితే తప్పక ఒప్పుకుంటారనే అనుకుంటాను..." ఆలోచిస్తూ అన్నాడతను.

" అంటే వాళ్ళకు కులం, శాఖ వగయిరా పట్టింపులేమీ ఉండవన్న మాట...."

" ఊహుఁ! అవన్నీ ఆడదాని అభివృద్ధికి ఆటంకాలని మామయ్య అభిప్రాయం! కనుక వాటి గురించి నీకేమీ సమస్య ఉండదు...."

" సరే - అలాగయితే వాళ్ల అడ్రస్ రాసివ్వు." జేబులో నుంచి డైరీ తీసి ఇస్తూ అన్నాడు శ్రీనివాసరావ్.

సుధీర్ మాట్లాడకుండా అతని డైరీలో అడ్రస్ రాసి ఇచ్చేశాడు.

" మరి నే వెళ్ళిరానా?" లేచి నిలబడుతూ అన్నాడు శ్రీనివాసరావ్.

" విష్ యూ బెస్టాఫ్ లక్...." తనూ లేస్తూ అన్నాడు సుధీర్.

ఇద్దరూ బయటకు వచ్చారు.

" ఒక్క విషయం నీకు చెప్తాను. హేమలో ఆ ఒక్క అంశం తప్పిస్తే మరే లోపమూ లేదు. నువ్వు ఇందాక అన్నావు చూడు 'వాళ్లవన్నీ కాలక్షేపం మాటలని!' ఆ మాట గురించే ఎన్నో ఆలోచనలు వస్తున్నాయ్. నీ అభిప్రాయం నిజమయినదేనేమో అనిపిస్తోంది. నిజమయితే బావుండునని కూడా ఉంది. చాలామంది జీవిత ప్రవాహంలో పడిపోయాక ఎటు కొట్టుకుపోతారో చెప్పడం కష్టం, అభిప్రాయాలూ, ఆశయాలూ అన్నీ ఆ ప్రవాహానికి అనుగుణంగా కొట్టుకుపోవలసిందే! ఎక్కడో ఒకరిద్దరు తప్ప మిగతా వారంతా అంతే! కనుక హేమ కూడా పెళ్లయ్యాక ఆ ప్రవాహంలో పడిపోతుందనే నాకూ ఆశగా ఉంది. అలా జరిగితే నీఅంత అదృష్టవంతుడెవరూ ఉండరు. ఎందుకంటే షి ఈజ్ మోస్ట్ లవబుల్ గాళ్ ఇన్ ఆల్ అదర్ రెస్పెక్ట్స్. జీవితంలో ప్రతిక్షణం నువ్వు ఆనందించేదిగా ఉంటుంది. ఆమె మాటలు, చేష్టలూ, అన్నీ ఎంత అద్భుతంగా ఉంటాయో – ఎంత రొమాంటిక్‌గా, థ్రిల్లింగ్‌గా ఉంటాయో - అవన్నీ మాటల్లో చెప్పటం సాధ్యం కాదు. ఇవన్నీ నేను వదులుకుంటున్నానంటే కేవలం ఒకే ఒక్క కారణంవల్ల. ఐ డోంట్ వాంట్ టు టేక్ రిస్క్! అంతే...."

అతని మాటలు వింటూంటే ఎంతో ఆనందం కలిగింది శ్రీనివాసరావ్‌కి.

" థాంక్యూ!" అన్నాడు అతని వంక ఆప్యాయంగా చూస్తూ.

[సశేషం]



ఎన్. పరిమళ

చక్కగా సంగీతం పాడేందుకు, బహు చక్కగా నాట్యం చేసేందుకు కూడా సాధన అవసరం. పసితనం నుంచే వారు ఈ విద్యలు నేర్చుకోవడం ప్రారంభిస్తే ముందు ముందు మరింతగా రాణిస్తారు. అయితే ఇందుకు ఆ పిల్లలలో తగిన ఉత్సాహం వుండాలి. తల్లిదండ్రుల ప్రోత్సాహం లభించాలి. ఆ రెండూ కూడా సమంగా వున్న నర్తకి ఎనిమిదేళ్ళ పరిమళా నిప్పాణి. సికింద్రాబాదులోని సెయింట్ ఫిలోమినా హైస్కూల్‌లో నాలగవ తరగతి చదువుతున్న పరిమళ చదువులో ముందంజ వేస్తూనే తీరిక వేళల్లో నటరాజ రామకృష్ణ 'నృత్య నికేతన్'లో నాట్యం నేర్చుకుంటున్నది. గత సంవత్సరం ప్రారంభంలో హైద్రాబాదు రవీంద్రభారతిలో ప్రముఖుల ఎదుట 'రంగప్రవేశం' చేసి అందరి మన్ననలూ అందుకున్న పరిమళ 'ఉత్తమ నర్తకి'గా ఖ్యాతి గడించాలన్న ఆశయాన్ని వ్యక్తం చేసింది. —ఎస్. విజయలక్ష్మి






ఈ నెల పుట్టిన రోజులు గల శిశువుల్లో ఏడాది పిల్లల గ్రూపులో ఎల్. హర్షవర్ధన్; రెండేళ్ల పిల్లల గ్రూపులో ఎస్. అనుపమ 'పుట్టిన రోజు బహుమతుల'కు ఎన్నికైనారు. నిర్ణయింపబడిన పై ఇద్దరితోపాటు, మొత్తం మీద మూడు గ్రూపులలోనూ ఆరోగ్యంగా కనిపిస్తున్న మరో ముగ్గుర్ని ఎన్నిక చేసి విడిగా ప్రచురిస్తున్నాము. మార్చి సంచికలోని ఈ శీర్షికకు ఫొటోలు పంపే వారు - వివరాలతో సహా (ఫొటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి. ఫొటో వెనుక పెన్సిల్‌తో వివరాలు రాయాలి. ఫొటోలు 'క్వార్టర్ సైజుకు తక్కువ సైజులో వుండకూడదు. తిప్పి పంపడానికి తగినన్ని తపాలా బిళ్లలు గల కవరు జతపరచాలి.) ఫిబ్రవరి 5 వ తేదీలోగా మాకు చేరేలా పంప గోరుతున్నాము.



ఎస్. అనుపమ (గుంతకల్) పుట్టిన తేదీ: 24-2-78 తల్లి పేరు: ఎస్. పద్మ

ఎల్. హర్షవర్ధన్ (కాశీబుగ్గ) పుట్టిన తేదీ: 28-2-79 తల్లి పేరు: ఎల్. ప్రమీలారాణి

పి. ఉదయకుమార్ (ఒంటిమిట్ట) పుట్టిన తేదీ: 16-2-78 తల్లి పేరు: పి. అమృత

ఆర్.వి.యస్. రాజేంద్రకుమార్ (కొవ్వూరు) పుట్టిన తేదీ: 11-2-77 తల్లి పేరు: ఆర్. ధనలక్ష్మి

---

సి. శరత్‌చంద్ర (చెర్లోవంగల్లు) పుట్టిన తేదీ: 25-2-79 తల్లి పేరు: సి. శైలజా వెంకటరెడ్డి







కృష్ణంరాజు సమర్పించు



రాధాకృష్ణా మూవీస్

# శివమెత్తిన సత్యం

ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం: వి.మధుసూదనరావు    నిర్మాత: జి. సత్యనారాయణరాజు

అన్నపూర్ణా ఫిలింస్

ANNAPURNA

# పైలట్ మాలిని



ప్రతి రంగంలోనూ స్త్రీ పురుషులకు సమాన ప్రాతినిధ్యం ఇస్తాము - అని అందరూ అంటూనే వున్నా ఆచరణలో మాత్రం అది అసలు కనుపించదు. అయితే పురుషులకు సైతం చాలా అరుదైన అవకాశంగా భావించబడే కొన్ని శాఖలలో వనితలు గుర్తింపు పొందడం చాలా అరుదైన విషయం. అలాంటి శాఖలలో విమానం నడపడం కూడా ఒకటి. పిన్నవయసులోనే విమానం నడపడంలో శిక్షణ పొంది పలువురి ప్రశంసలు అందుకున్న వనిత కుమారి పైలట్ మాలిని. ప్రస్తుతం మద్రాసు విశ్వ విద్యాలయంలో ఎం. యస్సి, చివరి సంవత్సరం చదువుతూన్న కుమారి మాలిని అప్పుడే పైలట్ లైసెన్స్ పొందడం విశేషమే!

మద్రాసు 'హోలీ ఏంజెల్స్ కాన్వెంటు'లో చదువుతూన్న రోజులలో విమానం గురించి పాఠాలు విన్నప్పుడల్లా తను పైలట్‌గా విమానం నడుపుతూన్నట్టు ఊహాలోకాలలో తేలిపోయేది మాలిని.

మాలిని తండ్రి డాక్టర్ విశ్వనాథన్ అమెరికా ఓహియో రాష్ట్రంలోని వైమానిక పరిశ్రమ కేంద్రంలో రిసెర్చ్ సైంటిస్ట్‌గా పని చేయడం— అప్పుడు మాలిని తండ్రితోపాటు కొన్నాళ్ళు అక్కడ గడపడం ఆమె జీవితంలో సరికొత్త మలుపును తీసుకొచ్చాయి.

నగరంలో ఎటు చూసినా రంగురంగుల



సిగ్నల్స్; రకరకాల విమానాలు! ఇవన్నీ మాలిని మనసులోని పైలట్ కావాలన్న ఆశను జట్ వేగాన్ని పుంజుకునేట్టు చేశాయి. అమెరికాలో వున్నన్నిదినాలు తరచూ విమాన నిలయానికి వెళ్ళి విమానాలను చూడడం; విమానాల 'కాక్‌పిట్'లో కూర్చుని అందులోని వరికరాలను జాగ్రత్తగా పరిశీలించడం మాలినికి అనుదిన చర్యగా తయారయింది.

మద్రాసుకు తిరిగివచ్చాక విమన్స్ క్రిస్టియన్ కాలేజిలో బి. యస్సి లో చేరింది. అప్పుడే మద్రాసు 'ఫ్లైయింగ్ క్లబ్' ఉపకార వేతనంతో శిక్షణ ఇచ్చే పథకాన్ని ప్రకటించింది. దినపత్రికలలో ఈ ప్రకటనను చూసీ చూడ్డంతో దానికి దరఖాస్తు చేసింది మాలిని.

దృఢమైన దేహారోగ్యం, మంచి బుద్ధి నైశిత్యం గల వారు మాత్రమే ఈ శిక్షణకు అర్హులు. సీట్లు కూడా చాలా పరిమితం. అంచేత ప్రవేశ పరీక్షలు చాలా కఠినంగా వుంటాయి.

ఈ పరీక్షలో పాల్గొని నెగ్గినవారు ముప్పై మందయితే అందులో మాలిని మాత్రమే వనిత!

1977 - 78 సం॥లో తొమ్మిది నెలలపాటు ఆమె శిక్షణ పొందారు. ఇద్దరు మాత్రం కూర్చొ డానికి అనువుగా ఒకే ఇంజన్ వుండే 'పుష్పక్' విమానంలో శిక్షణ ప్రారంభమయింది. విమానం గురించి ప్రాథమిక విషయాలు తెలుసుకున్న తర్వాత ఒక పరీక్ష వుంటుంది. ఈ పరీక్షలో నెగ్గినవారికి మాత్రమే పైలట్ లైసెన్స్ ఇస్తారు. ఏవియేషన్‌కు సంబంధించిన వివిధ విషయాలలో విశేషమైన ప్రతిభ కనబరచడంతో మాలినికి ప్రైవేట్ పైలట్ లైసెన్స్ కూడా ఇవ్వబడింది.

శిక్షణాకాలంలో ఎదురైన సాధక బాధకాలను గురించి వివరిస్తూ "పైలట్‌కి ప్రథమ విరోధి వాతావరణం. తెల్లవారుజామున ఇంటి నుంచి బయలుదేరేటప్పుడు, వాతావరణం హాయిగా మామూలుగా వుండేది. అయితే విమాననిలయం చేరగానే మబ్బులు పట్టేసి వర్షం వచ్చేది. లేదా విపరీతంగా గాలి వీచేది. పర్యవసానంగా అవాళ శిక్షణ రద్దయ్యేది. ఇలా చాలాసార్లు జరిగాయి. అయితే ఈ ఆటంకాలన్నీ నాలోని పట్టుదలను మరింత పెంచాయేగాని ఏ మాత్రం తగ్గించలేదు." అన్నారామె.

"ఆ సంవత్సరం శిక్షణ పొందినవారిలో నేను మాత్రమే స్త్రీ కావడంతో నన్ను మొదట

ఒంటరిగా విమానంలో పంపడానికి కొంత వెనుకాడారు. అయితే విమానం గురించిన విషయాలు నాకు అంతకుముందే పరిచితాలుకాబట్టి పరీక్షలలో మంచి మార్కులు సంపాయించి ప్రథమస్థానం కూడా పొందగలిగాను. అయినప్పటికీ నన్ను ఒంటరిగా పంపడానికి అందరూ సంకోచించారు. ఈ పరిస్థితి నాకు మొదట కాస్తా బాధ కల్గించినప్పటికీ పోనుపోను మరింత పట్టుదల, ఆత్మ విశ్వాసం పెంపొందించుకోడానికి దోహదం చేసింది. తొలిసారిగా పాండిచ్చేరివరకు ఒంటరిగా విమానం నడిపి పెద్దల ప్రశంసలు పొందినప్పుడు ఎంతో సంతోషించాను.

దాదాపు నాలుగువేల అడుగుల ఎత్తులో ఎగురుతూన్నప్పుడు కలిగే ఆనందం వర్ణనాతీతం. 'ఆన్‌ది టాప్ ఆఫ్‌ది వరల్డ్' అంటారే, అలాంటి అందమైన అనుభవం అది!'' అంటూ మురిసిపోయే మాలిని, స్త్రీలకు ఈ శాఖలో అంతగా అవకాశాలు కల్గడంలేదే అన్న విచారం వ్యక్తం చేశారు.

వనితలు ఈ శాఖలో అంతగా పాల్గొనలేకపోడానికి గల కారణాలను వివరిస్తూ ''ఏయిర్ ఇండియా, ఇండియన్ ఎయిర్ లైన్స్ మొదలైన సంస్థలలో పైలట్ కావాలంటే సి. పి. యల్. అనబడే కమర్షియల్ పైలట్ లైసెన్స్ పొందాలి. అందుకు కనీసం 250 గంటల ఫ్లైయింగ్ అనుభవం వుండాలి. రాత్రుల్లో విమానం నడిపే శిక్షణ పొంది వుండాలి. అయినా పైలట్ అనగానే పురుషుడే అయివుండాలన్న అభిప్రాయం మన దేశ విమాన సంస్థలలో బాగా నాటుకుపోయింది. అలాంటప్పుడు స్త్రీలకు అవకాశం ఎలా వస్తుంది? పైగా సి. పి. యల్ లైసెన్స్ పొందాలంటే కొన్నివేల రూపాయలు ఖర్చవుతుంది. ఇంత ఖర్చుచేసి తీరా లైసెన్స్ పొందాక కూడా కొందరికి ఉద్యోగాలు లేవు అన్న స్థితి వుంది. వనితలు అంతగా పైలట్‌లుగా రాకపోవడానికి ఇది కూడా ఒక కారణం.'' అన్నారామె,

భరత నాట్యంలోనూ ఈత కొట్టడంలోనూ శిక్షణ పొందిన మాలినికి వీణ వాయించడం అంటే ఎంతో ఇష్టం. ఆమె మంచి రచయిత్రి కూడా. తన విమాన అనుభవాలను గురించి ఈమె రాసిన ''ఎట్ ది కాక్ పిట్'' అన్న వ్యాసం పలువురి ప్రశంసలు పొందింది.

—శ్రీమతి ప్రకాష్

యస్. యస్. ఆర్

నాకు వివాహమై ఎనిమిదేళ్ళయింది. ఇద్దరు పిల్లలు. కాని నా భర్త మనసు నాకు అర్థంకాదు. భార్య అంటే కేవలం ఒక బానిస అన్న ఉద్దేశంతోనే ఎప్పుడూ చూస్తాడు. తాను చెప్పిన పనల్నింటినీ యాంత్రికంగా చెయ్యవలసిందే. ఆయన ఇంటికి వచ్చే వేళయిందంటే, ఇల్లంతా అంతలో నిశ్శబ్దమై పోతుంది! భర్త అంటే ప్రేమ, ఆప్యాయత, అభిమానం చూపించాల్సింది పోయి, ఎప్పుడూ భయంతో జీవితం గడుపుతున్నాను. దేనికీ మనశ్శాంతి వుండడంలేదు. ఈ 'యాంత్రికజీవి'కి మీరిచ్చే సలహా ఏమిటి?

'మగవారి ఆధిక్యత' ఎక్కువగా గల మన దేశంలో మీదీ ఒక ఉదాహరణ! మన దేశంలో ఎన్నో సంవత్సరాలుగా ఈ 'పురుష ఆధిక్యత' అమలులో వున్నది. స్త్రీ చదువుకోదు; ఉద్యోగం చెయ్యదు. మగవాడు ఉద్యోగం చేసి, డబ్బు సంపాయిస్తాడు. అంచేత, పైచెయ్యి అతనిదేనన్న భావం ఆది నుంచి వుంది. రానురాను, సంఘం మారుతోంది; వ్యక్తుల మనస్తత్వాలు మారుతున్నాయి. అయినా, ఇంకా చాలా చోట్ల భర్తలు భార్యలను 'బానిసలు'గానే చూస్తున్నారు. ఐతే, ఇప్పుడు మీరు మీ భర్తను మార్చలేరు! అది, మీకు పెళ్ళయిన తొలి రోజుల్లోనే జరిగి వుండాల్సింది. సాధారణంగా ఇలాంటి వాటికి ఒక్కొక్కప్పుడు కొంతవరకూ భార్యే కారణమవుతూ వుంటుంది. తానుగా భర్తకు ఆధిక్యతను అంటగట్టి, బానిసగా మారిపోతుంది. ఈ దృక్పథం మారాలి! తాను చెయ్యబోయే ప్రతి చిన్న విషయాన్నీ భర్తనే నిర్ణయించమంటూ వుంటారు భార్యలు! సంసారంలో భార్య, భర్త ఇద్దరూ ఒకటేననీ, ఒకరికొకరు తోడు నీడా అని పురుషులు గ్రహించేట్టుగా చెయ్యవలసిన బాధ్యత స్త్రీలమీదనే వుంది. పోతే, మీకు ఇద్దరు పిల్లల్లోనూ అబ్బాయి గనక వుంటే, అతనికి ఇప్పట్నుంచే స్త్రీ మీద గౌరవం చూపమనీ, స్త్రీ కూడా మనిషేననీ బాగా బోధించండి. లేకపోతే, ఎదురుగా వున్న తండ్రిని చూసి, తనూ అలాగే ప్రవర్తించే ప్రమాదం వుంది!

వి. పి.

నేను ఒకతన్ని ప్రేమించాను. అతను మాకు దగ్గర బంధువు కూడా. కాని, అతను నాకంటె మూడు సంవత్సరాలు చిన్నవాడు. అయినా, మేము పెళ్ళి చేసుకోవాలనే నిర్ణయించుకున్నాము. కాని, మా పెళ్ళిని పెద్దలు అంగీకరించరని అతను అంటున్నాడు. భార్య భర్తకంటె ఎక్కువ వయసుగలది కాకూడదంటున్నాడు. మరి, మేము ఏం చెయ్యాలి?

ఇద్దరూ ఒకరిని ఒకరు ప్రేమించుకుంటున్నంత కాలం, ఒకరి మీద ఒకరికి అభిమానం వున్నంత కాలం - వయసు ఎంతైనా వున్నాసరే, ఆ ఇద్దరూ పెళ్ళి చేసుకోవచ్చు. అందులో సంప్రదాయ సిద్ధంగా 'తప్పు' వున్నా, నిజానికి తప్పులేదు. అలా పెళ్ళి చేసుకున్నంత మాత్రాన అందులో హానీ లేదు! కాని మన దేశంలో ''ప్రేమ'' అన్నమాటకి వయోభేదం లేకపోయినా, పెళ్ళి దగ్గరకు వచ్చేసరికి, 'వయసు' ప్రసక్తి గట్టిగా వస్తుంది. ఇలాంటి వాటికి సంఘమూ ఒప్పుకోదు; బంధువులూ అంగీకరించరు. అంచేత సంఘమూ బంధువులనూ ఎదిరించగలిగివుండాలి. ఎదిరించి నిలవగలమన్న ధైర్యం వుండాలి. 'తర్వాత ఎలాంటి కష్టనష్టాలు వచ్చినా నిభాయించుకోగలం' అన్న విశ్వాసం మీ యిద్దరిలోనూ వుంటే, తప్పకుండా చేసుకోండి.

మన దేశంలో కూడా ఒక అసాధారణమైన విషయం వుంది. కర్ణాటకలోని కూర్గ ప్రాంతంలో వివాహాలు చేసేటప్పుడు, అమ్మాయి వయసుకంటె, అబ్బాయి వయసు తక్కువగానే వుండేలా చూసి, అక్కడ వివాహాలు చేస్తారు! అక్కడ అది తప్పులేదు. అయితే, మానసికమైన పరిపక్వత అబ్బాయిలో వున్నప్పుడు అదేం ఇబ్బందికరమైన విషయం కాదు; 'వయసు' కంటె మానసికమైన వయసు-ముఖ్యమైనది.

పి. జి.

నేను ఒక ఆయనా ప్రేమించుకున్నాము. మా ప్రేమ ఫలించలేదు. పద్నాలుగు సంవత్సరాల తర్వాత కలుసుకున్నాము. అతనికి భార్య, పిల్లలూ వున్నారు, నాకు నలుగురు పిల్లలున్నారు. నాలుగేళ్ళ క్రితం నేను నా భర్త నుంచి 'విడాకులు' మూలంగా విడిపడ్డాను. (దురలవాట్లతో ఆయన పెట్టే బాధలు భరించలేక) ఉద్యోగం చేసుకుంటూ పిల్లల్ని పోషించుకుంటున్నాను. సంవత్సరం క్రితం నా పాత మిత్రునితో నాకు సంబంధం ఏర్పడింది. ఈ విషయం అతని భార్యకు తెలుసు. మా వాళ్ళకి కూడా

## సమస్యలూ పరిష్కారాలూ

నిర్వహణ: కమలా వసంత కుమారి

ఈ విషయం తెలిసింది. అయినా ఎవరూ మమ్మల్ని ఇబ్బంది పెట్టడం లేదు! వారించడనూ లేదు! అయితే నా తొలి భర్త ఇంకా నన్ను పీడిస్తూనే వున్నాడు. నా భవిష్యత్తు ఏమిటి? ఈ నా కథ ఎలా ముగుస్తుంది?

మీ భర్తా మీరూ చట్టప్రకారం విడిపోయిన తర్వాత, మీకు ఇంకా భయమెందుకో నాకు అర్థం కావడంలేదు. మీ 'కొత్త సంబంధం' గురించి, ఆయన భార్య కూడా ఏమీ పట్టించు కోడం లేదంటున్నప్పుడు, సమస్య ఏమిటి? అయితే, విడాకులు తీసుకున్న తర్వాత, ఆ భర్త వచ్చి, 'పీడించడం' అన్న ప్రసక్తే లేదు. అతనికి మీ మీద ఎలాంటి హక్కూలేదు; వుండదు! అతను మిమ్మల్ని చిక్కుల్లో పెడుతూ వుంటే, మీరు పోలీసు సహాయాన్ని, న్యాయస్థానం సహాయాన్నీ అర్థించవచ్చు! 'ఏం జరుగుతుందో' అని భయపడితే, ఏమైనా జరగవచ్చు గదా!

యస్. యస్. యల్.

ఆర్థికమైన ఇబ్బందులవల్ల మా తండ్రిగారు నన్ను చదివించలేకపోయారు. నాకు మాత్రం చదువు మీద చాలా శ్రద్ధ. బి. ఎస్ సి. మొదటి సంవత్సరంతో ఆపేయవలసివచ్చింది. మా యింట్లోని తక్కిన వారంతా బాగా చదువుకుంటున్నారు. ప్రైవేట్‌గా చదువుకోవాలని నాకూ ఆశగా వుంది. మాది చిన్న పల్లెటూరు. ట్రైప్ నేర్చుకుందామన్నా, ఇక్కడ సౌకర్యం లేదు. పోని, వివాహం చేస్తే ఈ సమస్య వుండదేమో అనుకుంటే మా యింట్లో అలాంటి ప్రయత్నాలేమీ కనిపించవు. నాకు వయసు మీరు తోంది. (పాతిక సంవత్సరాలు) పెళ్ళికాక, చదువూ లేక ఇలా వుండడం ఎంతగానో నన్ను కల్లోల పరుస్తూంది. నన్నేం చెయ్యమంటారు?

నిజంగా మీ సమస్య జాలి కలిగించే సమస్య. మీకు ఉత్సాహం వున్నా చదువుకోలేకపోవడం, విచారించదగ్గ విషయమే. అయితే మీరు నిరుత్సాహపడకుండా, బి. ఏకి 'కరెస్పాండెన్స్ కోర్సు' అభ్యసించవచ్చు. దానికి సంబంధించిన వివరాలను పంపించమని ఈ క్రింది చిరునామా లకు ఎవరికైనా, రాయండి. పంపుతారు.

1. రిజిస్ట్రార్, ఆంధ్ర యూనివర్శిటీ, వాల్తేర్, విశాఖపట్నం.
2. కరస్పాండెన్స్ కోర్స్, మదురై యూనివర్శిటీ, మదురై.
3. కరస్పాండెన్స్ కోర్స్, మైసూరు యూనివర్సిటీ, మానస గంగోత్రి, మైసూరు
4. కరస్పాండెన్స్ కోర్స్, శ్రీ వెంకటేశ్వరా యూనివర్శిటీ, తిరుపతి.

పి. యమ్.

నేనూ మా బంధువుల అబ్బాయీ గాఢంగా ప్రేమించుకుంటున్నాము. నేను ఆయన్ని మరీ విపరీతంగా ఆరాధిస్తాను. కాని, అప్పుడప్పుడు నాకు ఒక సందేహం కలుగుతూ వుంటుంది - ఆయన కూడా నిజంగా-నేను ప్రేమించినంత గాఢం గానూ ప్రేమిస్తున్నారా అని! ఎందువల్లనంటే, ఆయన చాలా అందంగా వుంటాడు, నేను అంద గత్తెను కాను! అంచేత ఆయన నా మీద చూపే ప్రేమ నిజమైందా, కాదా? అని భయం. ఆయన్ని చూడకుండా ఒక్క రోజు కూడా నేనుండలేను. కాని మా పెళ్ళి జరుగుతుందన్న నమ్మకం కూడా నాకు లేదు. మరి, నాకు గత్యంతరం ఏమిటి?

మీరు చాలా సంఘర్షణలో పడి, అనవసరంగా బాధపడుతున్నారు! అతని ప్రేమ నిజమా కాదా అని బాధ; మీ వివాహానికి పెద్దలు అంగీకరించ రని బాధ; అతన్ని విడిచి వుండలేనని బాధ! ఇవన్నీ వున్నా మీరు అతన్ని గాఢంగా ప్రేమిస్తు న్నారు. దానికొక్కటే మార్గం: మీరు అతనితో మీ వివాహప్రసక్తి తీసుకురావడం; అతనికి ఇష్ట మైతే, బంధువులకు దూరంగా బతగ్గలం అను కుంటే-వివాహం చేసుకోవడం! లేదనుకుంటే, అతన్ని పూర్తిగా మరచిపోవడం! అంతేగాని, అనవసరంగా ఆలోచనల్లోపడి, అతన్నీ మీ బంధువుల్నీ సందేహిస్తూ కాలం వృధా చెయ్య కండి! పండంటి మీ జీవితాన్ని పాడు చేసుకో కండి! దానివల్ల మున్ముందు మీరే బాధపడవలసి వస్తుంది.

## కొత్త వస్తువులు




### ఎలక్ట్రానిక్ క్లాక్

ఎలక్ట్రానిక్ అంకెలు గల ఈ అలారం గడియారం ఆడోర్‌మైనర్ ఎలక్ట్రానిక్ క్లాక్. దీనిని గోడకు అమర్చుకోవచ్చు. డ్రెస్సింగ్ టేబుల్ మీద గాని, ఆఫీస్ టేబుల్ మీద గాని అమర్చు కున్నట్లయితే అలంకారంగా కూడా వుంటుంది. కళ్ళు చెదరకుండా వుండడానికని అంకెల చుట్టూ పచ్చరంగు డయల్ అమర్చబడివుంది. ఉదయం, సాయంకాలం, గంటలు, నిముషాలు, క్షణాలు గల ఈ గడియారంలో అలారం కూడా అమర్చబడి వుంది. వెనుక పక్క బేటరీ అమర్చబడిన ఈ గడియారానికి విద్యుత్తు కూడా చాలా తక్కువే అవుతుంది. రాత్రుల్లో నైట్‌లాంప్‌గా కూడా పని చేసే ఈ గడియారం ధర పన్నులతో సహా 550 రూ॥లు ఈ గడియారం గురించి పూర్తి వివరాలు కావలసిన వారు సంప్రదించ వలసిన చిరునామా :

ADVANI-OERLIKON LIMITED,
MADRAS-2.



పంచివారిని కాపాడడానికి దేవుడు వస్తాడనే కథలు; భక్తుల కష్టాలను భగవంతుడు తీర్చాడని చెప్పే గాథలు ఏమత గ్రంథం చూసినా కోకొల్లలుగా కనిపిస్తాయి. అయితే దేవుడి విగ్రహానికి కల్గిన కష్టాన్ని చూసి కరిగిపోయి తన కంటిని పెకలించి విగ్రహానికి అమర్చి తరించిన భక్తుల గాథలు చాలా అరుదుగా వుంటాయి. చదువు సంధ్యలు, వంశ ప్రతిష్ఠలు ఏమాత్రం లేని తిన్నడు—కల్లాకపటం లేని పాలమనసుతో కాళహస్తీశ్వరునికి తన కనుల నర్పించి భక్తకన్నప్పగా మారి శివసాయుజ్యం పొందాడని చెప్పే కథ ఆ కోవలోనిది!

అనంత జీవకోటిలో మనుజ జన్మ ఉదాత్తమైనది. బుద్ధి ప్రధానమైన జన్మ కావటం వల్ల అలా అంటారు. పరిపూర్ణ జీవనవికాసానికి, దైవసాక్షాత్కారానికి మనిషి జన్మ చాలా అరుదైన అవకాశం అని కూడా అంటారు. అయితే ఎలాంటి శాస్త్రవిజ్ఞానమూ, వేదపరిజ్ఞానమూ లేని సాలెపురుగు, పాము, ఏనుగు వినిర్మల భక్తితో పరమేశ్వరుని పూజించి తరించాయని కాళహస్తి స్థలపురాణం చెబుతుంది.

శాస్త్రపరిజ్ఞానం, ఆచారసంప్రదాయాల కన్నా మనిషికి కావలసింది కల్లాకపటం లేని మనసు! మంచి మనసుకు దేవుడు బందీ – అని చాటే పురాతన ఆలయం శ్రీ కాళహస్తి దేవాలయం!

తిరుపతికి ఇరవైఅయిదు మైళ్ళు ఈశాన్యంగా-యుగయుగాలుగా హైందవ భక్తులను ఆకర్షిస్తున్న ఈ ఆలయం తిరుపతి కన్నా ప్రాచీనమైనదని కొందరి అభిప్రాయం.



తీర్థయాత్ర చేస్తూ అర్జునుడు 'విజ్ఞానక్షేత్ర' మైన శ్రీ కాళహస్తిని దర్శించి – అక్కడే వున్న భారద్వాజ ముని ద్వారా ఆధ్యాత్మిక తత్వ విషయాలు విని మరీ వెళ్ళాడని స్కాందపురాణం చెబుతోంది.

పతనమవుతున్న నైతిక విలువలను పునరుద్ధరించి సనాతన సంస్కృతికి నవ్యస్ఫూర్తిని కల్గించిన ఆదిశంకరులు కూడా ఈ ఆలయదర్శనం చేసుకున్నట్టు ఆయన రచించిన 'శివానందలహరి' స్తోత్రం ద్వారా తెలుస్తోంది.

లలితమైన తెలుగు పలుకులతో ఈశ్వర లీలలను అతులితమాధురీ మహిమతో అభివర్ణిస్తూ-శ్రీ కాళహస్తీశ్వర మహాత్మ్యం-అన్న సాహితీ ఆలయం నిర్మించిన ఆంధ్రకవి మన ధూర్జటి!

ఆంధ్ర శాతవాహనుల తర్వాత దక్షిణాంధ్రను పాలించినవారు పల్లవులు, చోళులు. తొలుత ఈ ఆలయనిర్మాణం పల్లవరాజులు ప్రారంభించగా తొండమండలాన్ని పరిపాలించిన తొండమాను చక్రవర్తి, ఆ తర్వాత చోళరాజులు ప్రధాన ఆలయ నిర్మాణానికి కృషి చేశారు. పదకొండవ శతాబ్దంలో కులోత్తుంగ చోళుని కాలంలో దక్షిణ ద్వార గోపురం నిర్మించబడింది. పన్నెండవ శతాబ్దంలో వీరనరసింహయాదవరాయల హయాంలో వెలుపలి ప్రాకారం; నాలుగు వైపులా ద్వార గోపురాల నిర్మాణం జరిగాయి. గాలిగోపురం; నూరుకాళ్ళ మంటపం మరికొన్ని మంటపాలు పదహారవ శతాబ్దంలో విజయనగరరాజుల కాలంలో ముఖ్యంగా కృష్ణదేవరాయల హయాంలో జరిగాయని శిలాశాసనాలవల్ల తెలుస్తోంది. 1912లో తొమ్మిది లక్షల రూపాయల వ్యయంతో పునరుద్ధరణ పథకం చేపట్టి ఆలయానికి ప్రస్తుత పరిపూర్ణ స్వరూపం కల్పించారు - దేవకోటకు చెందిన నాట్టుకోట చెట్టియార్లు!

శ్రీ కాళహస్తి పట్టణానికి కుంకుమబొట్టులా శోభను చేకూర్చే ఈ ఆలయ పడమటి ప్రాకారాన్ని ఆనుకుని ప్రవహిస్తోంది స్వర్ణముఖి నది.

భిక్షాల గోపురం గుండా ఆలయంలో ప్రవేశించగానే మన దృష్టిని ఆకర్షించేది కాశీ విశ్వనాథ, అన్నపూర్ణ ఆలయాలు. ఆ తర్వాత బాలజ్ఞానాంబ గోపురం. గోపురానికి కొద్ది దూరంలో పాతాళ గణపతి గుడి. ఒక్కొక్కరుగా మాత్రమే ప్రవేశించడానికి వీలుగా ముప్పై అడుగుల లోతులో ఓ చిన్న గణపతి విగ్రహం వుంది. దాపున ప్రవహించే స్వర్ణముఖీనది నీటి మట్టాన్ని సూచించడానికి ఈ విగ్రహ ప్రతిష్ఠాపన జరిగిందట.

పాతాళ గణపతిని దర్శించుకుని ముందుకు వెళితే సూర్యపుష్కరిణి, చంద్రపుష్కరిణి బావులు సూర్యనారాయణ ఆలయం వున్నాయి. ఆలయ పశ్చిమ ద్వారానికి ఎదురుగుండా స్వర్ణముఖీనదికి మెట్ల దారి వుంది. అక్కడి నుంచి తిన్నగా దక్షిణంగా వెళ్ళామంటే బ్రహ్మగుడి, ఆ తర్వాత కైలాసగిరి మీది కన్నప్ప గుడి వస్తాయి.

భగవంతుడి కన్నా మంచి భక్తుడే గొప్ప – అని సూచించడానికే అన్నట్టు-శివాలయం కైలాసగిరి పాదాల వద్ద వుంటే, విల్లంబులు ధరించిన భక్త



మన దేవాలయాలు:

# శ్రీకాళహస్తి

కప్పబడిన గర్భగృహ ముఖద్వారం చేరుకుంటాము.

మూడడుగుల పానవట్టం (పేదిక) మీద దూరం నుంచి చూస్తే పడగవిప్పినపాములా కనబడే నాలుగడుగుల లింగం—అడుగున సాలెపురుగు, మధ్య ఏనుగుదంతాలు, పైన ఐదు తలల చిన్న సర్పాకారంతో వుంది. కన్నప్ప సమర్పించిన నేత్రానికి సంకేతంగా ఒక కన్ను వుంది. ఈ చిహ్నాలను శంకరుడు భక్తవశంకరుడు అనడానికి సంకేతాలుగా భక్తులు చెప్పుకుంటారు. మూల విరాట్టుకు ముందున్న దీపకళిక నిరంతరం చలిస్తూ వుంటుంది. శ్రీ కాళహస్తీశ్వరుడు వాయులింగ స్వరూపుడు అనడానికి ఇది తార్కాణం అంటారు భక్తులు! అక్కడి నుంచి ప్రదక్షిణంగా వెళ్లామంటే జ్ఞానప్రసూనాంబ సన్నిధి చేరుకుంటాము. తూర్పు

మహాశివరాత్రి (ఫ్రిబవరి పద్నాలుగు) పర్వదిన సందర్భంగా శ్రీ కాళహస్తి దేవాలయ విశేషాలను ఇక్కడ వివరిస్తున్నాము.-





పంచముఖేశ్వరలింగం

కన్నప్పగుడి కొండపైన వుంది.

కన్నప్పగుడి నుంచి చూస్తే-చుట్టూరా సుందరమైన ప్రకృతి దృశ్యాలు; అందమైన పట్టణం; పట్టణానికి ఉత్తర దిశ కొండ మీద దుర్గాంబ మందిరం; తూర్పు గుట్ట మీద సుబ్రహ్మణ్యస్వామి గుడి; పట్టణ మధ్యభాగంలో వరదరాజస్వామి దేవాలయం కన్నులపండుగ చేస్తాయి.

కన్నప్పగుడి నుంచి దిగి దక్షిణంగా నడిచామంటే నటరాజ రంగస్థల మంటపం చేరుకుంటాము. శివలీలలను వివరించే దారుకావన భిక్షాటనం; నటరాజ నృత్యం; వీణాపాణియైన దక్షిణామూర్తి; ఆది దంపతుల ప్రణయ స్వరూపం మొదలైన పురాణ గాథలు—సుందర శిల్పాలుగా కుడ్య చిత్రాలుగా సాక్షాత్కరిస్తాయి.

బ్రహ్మచేత పూజలందుకున్న పవిత్ర మూర్తిగా కీర్తించబడే పంచముఖేశ్వరలింగం అక్కడే వుంది. జీవకళ వుట్టిపడే పంచముఖేశ్వరలింగం మన దేశంలోని అపురూప శిల్ప కళాఖండాలలో ఒకటిగా చెబుతారు.

వీటన్నిటినీ సందర్శించుకుని మళ్ళీ ఆలయానికి వచ్చామంటే దక్షిణాభిముఖంగా వుండే ఆలయ ప్రధాన ద్వారం చేరుకుంటాము. లోపల అడుగుపెట్టగానే ఎదురుగా జ్ఞానమూర్తియైన దక్షిణామూర్తి; ఎడమ చేతి వేపుగా వెడితే బంగారు రేకులతో ముఖంగా చతుర్భుజాలతో నిలబడిన భంగిమలో అమ్మవారి విగ్రహం వుంది.

ఈ గుడిలో జరిగే ఉత్సవాలకన్నిటికి మకుటాయమానం — మహా శివరాత్రి మహోత్సవం! నిద్రాహారాలతోనే జీవితాన్ని వృథా చెయ్యకుండా - సచ్చిదానంద స్వరూపుడైన పరమేశ్వరుని మనసారా ధ్యానించడానికి భక్తులు నిర్దేశించిన పర్వదినం - మహా శివరాత్రి! ఆ రోజంతా ఉపవాసం చేసి, 'లింగోద్భవ' దర్శనంతో రాత్రంతా జాగరణ చెయ్యడానికి దేశం నలుమూలల నుంచీ ఏటా వేల కొలది భక్తులు శ్రీ కాళహస్తికి వస్తూ వుంటారు! □



మలాయ్ గోబిదాలా

కావలసిన పదార్థాలు: 1 పెద్ద సైజు కాలిఫ్లవర్, 1 కప్పు పంచదార, ½ లిటర్ పాలు, ½ కప్పు జీడిపప్పు, బాదంపప్పు ముక్కలుగా చేసిన మిశ్రమం, 4 స్పూన్ల వెన్న, ½ స్పూను ఏలకుల పొడి, చిటికెడు కేసరి పౌడరు.

తయారు చేయవలసిన విధానం: ముందుగా కాలిఫ్లవర్ అడుగున వున్న కాడ భాగాన్ని తీసివేసి పువ్వును చిన్న చిన్న ముక్కలుగా తరుగుకోవాలి.

ఆ తరువాత బాణలిలో రెండు స్పూన్లు వెన్న వేసి, అది వేగాక అందులో జీడిపప్పు, బాదం పప్పు మిశ్రమం వేయాలి. ఈ మిశ్రమం బంగారు వన్నె వచ్చేదాకా వేగనిచ్చి అందులో తరిగి వుంచుకున్న కాలిఫ్లవర్ వేసి బాగా వేయించాలి.

ఇప్పుడిక పాలల్లో ఏలకుల పొడి, కేసరి పౌడర్ వేసి బాగా కలిపి స్టవ్ మీద వుంచి సన్నటి సెగ మీద పాకంలా వచ్చేవరకూ మధ్య మధ్యలో గరిటతో కదుపుతూ కాచాలి. ఇందులో పంచదార, కాలిఫ్లవర్ మిశ్రమం వేసి, అడుగంటకుండా కలుపుతూ వుండాలి.

ఈ మిశ్రమం కోవా పక్వానికి రాగానే రెండు స్పూన్లు వెన్న వేసి బాగా కలియదియ్యాలి. ఆ తరువాత నెయ్యి పూసిన ఒక పళ్లెంలో ఈ మిశ్రమాన్ని పోసి చదునుగా చేసుకోవాలి. దీనిమీద కావాలనుకున్న వాళ్ళు చెర్రీపళ్ల ముక్కలను అమర్చుకోవచ్చు. ఇవి లేకపోయినా పర్వాలేదు. ఈ మలాయ్ గోబిదాలా చల్లారాక డైమండ్ ఆకారంలో ముక్కలుగా కోసుకోవాలి. ఇది విందు భోజనాలకు అనువైన ఫలహారం.

—భువనేశ్వరి

## రూ 100 లు బహుమతి పొందిన ఈ నెల వంటకం

### బొప్పాయి కోఫ్తా

కావలసిన పదార్థాలు: 1 మధ్య సైజు బొప్పాయి కాయ; ¾ టీస్పూను మిరపపొడి, 2 టీస్పూన్లు పచ్చి శెనగపిండి, 2 టీస్పూన్లు ధనియాలపొడి, ½ టీస్పూను జీలకర్ర, 4 టొమోటోలు, చిటికెడు పసుపుపొడి, తగినంత ఉప్పు, వేయించడానికి తగినంత నూనె. ఇవికాక మసాలాకి రుబ్బుకోవాల్సిన వస్తువులు: 3 ఉల్లిపాయలు, 10 వెల్లుల్లిపాయలు (విడివి); 3 పచ్చి మిరపకాయలు, 1 టీస్పూను గసగసాలు, 3 లవంగాలు, కొంచెం దాల్చినచెక్క.

తయారు చేయవలసిన విధానం: ముందుగా మసాలా వస్తువులన్ని పచ్చివిగానే మెత్తగా రుబ్బి విడిగా వుంచుకోవాలి. (గరంమసాలా దినుసులు నచ్చనివారు అవి లేకుండా కూడా చేసుకోవచ్చును).

తరువాత బొప్పాయికాయ శుభ్రంగా కడిగి, కోసి దానిలోని గింజలు తీసివెయ్యాలి ఇలా గింజలు తీసేసిన తరువాత గుమ్మడికోరు కోరుకున్నట్లుగా బాగా సన్నగా తురుముకోవాలి. ఈ కోరుని పిడికిలిలో బాగా అదిమి అందులోని నీరు పిండెయ్యాలి.

ఇప్పుడిక శెనగపిండి తీసుకుని అందులో రుచికి కాస్త ఉప్పు కలుపుకుని ఈ బొప్పాయి కోరుని శెనగపిండితో బాగా కలిసేటట్లుగా కలపాలి. బాణలిలో నూనె తీసుకుని స్టవ్ మీద పెట్టి ఈ కోరుని పకోడీల్లాగా బాగా దోరగా వేగేదాకా వేయించి విడిగా ఒక పాత్రలోకి తీసి అట్టే పెట్టుకోవాలి.

ఒక వెడల్పాటి పాత్రలో 4 స్పూన్ల నూనె పోసి మరగనిచ్చి, అందులో జీలకర్ర వేసి వేయించాలి. జీలకర్ర వేగిన తర్వాత రుబ్బి వుంచుకున్న మసాలా మిశ్రమం, తగినంత ఉప్పు, మిరపపొడి, పసుపు పొడి, ధనియాలపొడి, ముక్కలుగా తరిగిన టొమోటోలు వేసి దోరగా వేయించాలి. తరువాత అందులో 1 కప్పు నీరు పోసి 10 నిముషాలు బాగా మరగనివ్వాలి. ఇప్పుడు ముందుగా చేసి వుంచుకున్న బొప్పాయి పకోడీలను అందులో వేసి మూత పెట్టి, సన్నటిసెగలో 10 నిముషాలు ఉడకనిచ్చి దింపెయ్యాలి. ఇలా చేసుకున్న బొప్పాయి కోఫ్తా చపాతీలలోకి, పూరిలలోకే కాకుండా అన్నంలోకి కూడా రుచిగా వుంటుంది.

—సి. సుజాత, మీరట్

మీరు ఎన్నో వంటలు తిని వుంటారు; తయారుచేసి వుంటారు. అలా ఒకరి ద్వారా నేర్చుకున్నవీ, చూసినవీ కాకుండా మీ పాక పరిజ్ఞానంతో మీరు ఏదైనా కొత్త వంటకం కనిపెట్టగలరా? అదీ స్వీటయినా, హాటయినా మరేదైనా పర్వాలేదు; కొత్త రకంగా వుండాలి; రుచికరంగా వుండాలి; చెయ్యడానికి తేలికగా వుండాలి. అలాంటి వంటకాన్ని చేసి మీరు తిని, "బాగుందీ, అందరూ మెచ్చుకుంటారు" అనిపించినపుడు ఆ వంటకం గురించి - అదెలా తయారుచెయ్యాలి? ఏమేం పదార్థాలు వెయ్యాలి? అన్న వివరాలతో మాకు రాసి పంపండి. మీ వంటకం కొత్తగా వుండి, బాగుందనిపిస్తే ఆ వంటకానికి—

## నూరు రూపాయలు బహుమతి!

ఇక్కడ ప్రచురిస్తున్న రెండో వంటకం—మా తమిళ పత్రిక "మంగై" లో బహుమతి పొందిన వంటకం. 'వంటల పోటీ'లో రూ. 100 ల బహుమతికి ఎన్నిక అయిన తర్వాత తక్కిన వంటకాల్లో ఒక దాన్ని ఎన్నుకుని దానికి రూ. 25 లు ప్రత్యేక బహుమతిగా ఇవ్వడానికి నిర్ణయించుకున్నాము. ఈ బహుమతి వచ్చే నెల నుంచి వుండగలదు. తక్కిన వంటకాల్లో బాగున్న వాటిని కూడా, మామూలు "వంటలు" పేజీలో ప్రచురిస్తాము. వాటికి ఒక్కొదానికి రూ. 10 లు పారితోషికంగా పంపుతాము.

చిరునామా: వంటల పోటీ, వనిత—చందమామ బిల్డింగ్స్ మద్రాసు 600026

# జుట్టుకు సిల్క్‌వంటి మృదుత్వము నిచ్చుటకు నైసర్గిక ఉపాయము...



శుద్ధమైన షీకాయిలోని సహజ లాభకర గుణములు స్వస్తిక్ షీకాకాయ్ సబ్బులో నింపబడినవి. వాడడానికి అనువైనది. లిక్విడ్ షాంపూ కంటే ఎంతో పొదుపైనది.



దీని పుష్కలమైన, మృదువైన నురగ మీ జుట్టును మెత్తగా, పూర్తిగా శుభ్రపరుస్తుంది. మీ జుట్టును ఆరోగ్యంగా, నిగనిగాలాడేలా వుంచుతుంది. తాజా సువాసన నింపి పట్టువంటి మృదుత్వాన్ని ఒసగుతుంది.




## 卐 సువస్తిక్ షీకాకాయ్ సబ్బు

ఇందులో షీకాయి కలిసి వుంది. భారత స్త్రీల అందమైన జుట్టుకు పారంపర్యమైన రహస్యము.

shilpi dm 25/79 tel

# అవసరమైతే కాన్పు ఎలా నిర్వహించాలి?

విరా ఇంట్లో అక్కయ్యో, వదినో, చెల్లెలో ఎవరో ఒకరు గర్భవతి. ప్రసవ కాలం కూడా సమీపించింది. అనుకోకుండా వున్నట్టుండి ఆమెకు పురిటి నొప్పులు ఆరంభమయ్యాయి. ఇక కొద్ది సేపట్లో ప్రసవం అయిపోతుంది. అయితే ఈ విషయంలో పూర్వానుభవమో దానిని గురించిన వివరాలో తెలిసిన వారు ఎవరూ లేరు - డాక్టర్‌గాని నర్సుగాని అందుబాటులో లేరు! ఆ సమయంలో మీరు మాత్రమే వున్నారు. అలాంటి పరిస్థితిని మీరెలా ఎదుర్కొంటారు? ఈ విషయాన్ని వయసు వచ్చిన ప్రతి స్త్రీ కూడా తెలుసుకోడం ఎంతైనా అవసరం.

ఇలాంటి పరిస్థితిలో భయానికిగాని తొందరపాటుకిగాని చోటివ్వకూడదు. ఓరిమితోనూ జాగ్రత్తగానూ వుండాలి. ఎందుకంటే మీరు అనుకునే దానికన్నా కొద్ది ఆలస్యంగానే ప్రసవం జరుగుతుంది.

మొదట గర్భిణీ స్త్రీని బాగా వూపిరిపీల్చి వదలమని చెప్పాలి. ఆమెను వెల్లకిలా పడుకోబెట్టి మోకాళ్ళను ముడుచుకోమని నిదానంగా దుస్తుల్ని విప్పి వేయాలి. నడుము క్రింద దృఢమైన చిన్న దిండు వుంచాలి. ఇలా చేస్తే ఆమెకు పడుకోడానికి ఎంతో తేలిగ్గా వుంటుంది. అంతే కాదు. ఏటవాలుగా పడుకోడంవల్ల ప్రసవద్వారం నుంచి పాప బయటికి రావడం సులభమవుతుంది.

ఆ తర్వాత ప్రసవించనున్న ఆమెను గట్టిగా ఊపిరి బిగబట్టి వదలమని చెప్పాలి. రెండు కాళ్లను దూరంగా వుంచుకోమనాలి. మొట్టమొదట పాప తల శిరోజాలు మాత్రం కనబడతాయి. కొద్ది కొద్దిగా తల బయటికి వస్తుంది. తల బయటికి రాగానే మీ చేతిని ఆనించి పట్టుకోవాలి. అయితే పాపను బలవంతంగా బయటికి తీయడానికి ప్రయత్నించకూడదు. తర్వాతి నొప్పికి భుజాలు బయటికి వస్తాయి. భుజాలు వెలుపలికి వచ్చాక మిగతా శరీరం చాలా త్వరగా వెలుపలికి వచ్చేస్తుంది.



పాప పుట్టిన వెంటనే కాళ్ళను మాత్రం పట్టుకు ఎత్తాలనే అవసరం లేదు. అయితే అప్పుడే పుట్టిన పాప జారుతూ వుంటుంది కాబట్టి చాలా జాగ్రత్త తీసుకోవాలి. తీసుకుని తల్లి తొడ మీద బోర్లా పడుకోబెట్టాలి. అప్పుడు పాప తల కింది వేపుకి వాల్చి వుంచాలి. ఇలా చెయ్యడం వల్ల పాప నోటి నుంచి, ముక్కుగుండా అనవసరమైన ద్రవపదార్థాలు బయటికి వచ్చేస్తాయి. పాప బాగా శ్వాసిస్తుంది. శుభ్రమైన గుడ్డను పాప మీద కప్పి కాస్సేపు అలాగే వుంచాలి.

పాప తర్వాత, తల్లి కడుపు నుంచి మిగతావి బయటపడడానికి కనీసం ఇరవై నిముషాలు పడుతుంది. ఈ లోపల అనుభవజ్ఞులైన పెద్దలను, వైద్యులను రప్పించడం శ్రేయస్కరం.



వెంటనే వైద్యసహాయం లభించలేదు అనుకుంటే-తల్లి కడుపు నుంచి బొడ్డు తీగ (నాభిరజ్జు) బయటపడగానే పాపను తల్లి తొడ మీది నుంచి తీసి వాటికి దిగువగా వుంచాలి. ఇలా చేస్తే పాప నుంచి రక్తం స్రావం వాటి మీదికి పోకుండా ఆపడం సాధ్యమవుతుంది.

పాపను పడుకోబెట్టిన దానికన్నా కాస్త ఎత్తైన ప్రదేశంలో ఒక బేసిన్ వుంచి నాభిరజ్జు అందులో వుంచాలి. బొడ్డు తీగను కత్తిరించాలి. అనుభవజ్ఞులైనవారు మాత్రమే ఇలాంటివి చేయడం మంచిది. అందువల్ల వారికి కబురు పంపి వారు వచ్చేలోపల పాప బొడ్డునుంచి రెండు అంగుళాలు వదలి - చిత్రంలో చూపిన ప్రకారం-బొడ్డు తీగకు శుభ్రమైన దారంతో రెండు కట్లు కట్టాలి.

అనుభవజ్ఞులైనవారు శుభ్రమైన కత్తితో బొడ్డు తీగను వేరు చెయ్యడమే సరైన విధానం అయితే అదే సమయంలో తల్లి గర్భాశయం నుంచి రక్తస్రావం తగ్గించడానికి గర్భ ద్వారానికి అడ్డుగా శుభ్రమైన దూదిని కొద్దిగా వుంచడం ఎంతైనా శ్రేయస్కరం. బొడ్డు తీగను వేరు చేశాక పాపను తల్లి ప్రక్క పడుకోబెట్టి శుభ్రమైన పలుచటి గుడ్డతో కప్పాలి. తల్లి వెచ్చని కౌగిలింత అయినా చాలు.

— జానకి


మైసూర్
శ్యాండల్
Mysore Sandal Soap
గొప్ప భారతీయ సంప్రదాయంలో విశిష్టమైన స్నానపు సబ్బు

## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు-56' చందమామ బిల్డింగ్స్, మద్రాసు – 600 026 చిరునామాకు ఫిబ్రవరి (80) 29వ తేదీ లోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1980 ఏప్రిల్ సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు - అడ్డము

1. పక్షితో సంబంధం గల పట్నం
2. తిరుపతి చెందిన జిల్లాకు చెందినదే, ఈ ఊరు
3. బహువచనంలా కనిపించినా, ఒకటే శరీరావయవం
4. విశాఖపట్నం జిల్లాలోని ఒక పల్లి ముందు భాగం
5. తిరగబెడితే, కుదుతుంది.
6. తొలి అక్షరంలో దీర్ఘం వుంటే, నీరు పోవడానికి వీలవుతుంది
7. కొన్ని గ్రామాల పేర్ల వెనక వుంటుంది.
8. అడవి జంతువు
9. ప్రమద
10. దుఃఖించుట
11. కొత్తవారు కనిపించగానే ముందుగా మనం అడిగేది తిరగబడింది.
12. దండలో వుండేది
13. కలయిక
14. శుభకార్యాలకి ముత్తైదువుల్ని పిలవడం (అక్షరాలు తారుమారు)

### ఆధారములు - నిలువు

1. కనుక
2. తోకలేని పిట్ట
4. ఉన్నదాన్ని ఉన్నట్టుగా నిజం చెప్పేది - అటూ ఇటూ అయింది.
6. వధువు అలిగినట్టుంది-చెదిరింది
10. సహాయం
15. తండ్రి
16. కింద నుంచి పైకి చదివితే, పానీయం
17. నెల్లూరు దగ్గర ఒక వూరు
18. యజ్ఞానికి ఆహుతి అయ్యేది.
19. ఒక పక్షి విప్పుతుంది
20. లుదా
21. ఊర్లో ఒక భాగం
22. నేల విడిచి చెయ్యకూడనిదిట.

# వనిత మాటల కొలువు-56
## రూ 150 లు బహుమతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 15 | | | 2 | | 16 |
| | | | | 3 | | | |
| | 4 | | 17 | | | 5 | |
| 6 | | | 7 | | 18 | | |
| 8 | | | | | 9 | | 20 |
| | | | | 10 | | | |
| 11 | 21 | | 12 | | | 22 | |
| 13 | | | | 14 | | | |

పేరు ..........................................................................................

చిరునామా ....................................................................................

..................................................................................................

..................................................................................................

---

వహి—

శివరాత్రి వస్తోంది చూశారా-ఈ చలికాలంఅప్పటి వరకూ వుంటుందిట. శివరాత్రి రాగానే శివుడికి భయపడుతూ 'శివశివ' అంటే ఆ చలి పారిపోతుందిట. ఐతే, శివుడు చలిని_మరింత గడగడ వణికించి పారదోలుతాడో లేదో గాని_శివరాత్రినాడు తనను ఏరకంగా పూజించినా కూడా వారు చేసిన పాపాలు మాత్రం గడగడ వణుకుతూ పటాపంచలయిపోతాయట!

శివరాత్రి మాసం మాసం వస్తుంది. ఐనా మాఘ మాసంలో వచ్చే శివరాత్రికి విశిష్టత ఎక్కువ. అందుకే దీన్ని 'మహా శివరాత్రి' అన్నారు. శివుడికి చెందిన పర్వదినాల్లో – మహాశివరాత్రి ఎంతో ముఖ్యమైనది.

మనకో నమ్మకం వుందర్రా—ఏదైనా వ్రతం గాని, పూజగాని చేసినప్పుడు అతినిష్ఠగా, శ్రద్ధాభక్తులతో చెయ్యాలనీ, అలా చేస్తేనే ఆ వ్రత ఫలితం సిద్ధిస్తుందనీ. కాని శివరాత్రి వ్రతానికి మాత్రం ఆ నియమం ఏమీ లేదు. శ్రద్ధ వున్నా సరే, లేకపోయినా సరే, ఈ వ్రతాన్ని ఏవిధంగా ఆచరించినా కూడా పాపపరిహారం అయిపోతుందని, మన పురాణాలు చెబుతున్నాయి.

అయితే ఏమిటీ శివరాత్రి మహాత్యం?_దానికో కథ వుంది.

యుగయుగాంతరాలక్రితం, పరమేశ్వరుడు సంహార కార్య నిమగ్నుడై వున్నాట్ట. ప్రళయం ఏర్పడింది. భూమి మునిగిపోయింది. అప్పుడు విష్ణువు-వరాహరూపం ధరించి, భూమిని పైకెత్తి నిలిపి, తన శ్రమను తీర్చుకోడానికి పాలసముద్రం మీద పడుకుని విశ్రాంతి తీసుకుంటున్నాడు. భూమి యథాస్థితికి వచ్చిన తర్వాత, బ్రహ్మదేవుడు పునః సృష్టి ఆరంభించాడు. మళ్లీ మనుషులు, చెట్లు, చేమలూ, జంతువులూ, కీటకాలూ పుట్టడం ఆరంభించాయి. బ్రహ్మ అది చూసి, తన శక్తికి మురిసిపోయాడు. తాను లేకపోతే, ఈ ప్రపంచానికి మోక్షమే లేదుగదా – అనుకున్నాడు. ఆ అనుకోడంలో అతనికి అహం కూడా కలిగిందిట. ఆ అహంకారం ఎంత దూరం పోయిందంటేట— విష్ణుమూర్తిని చూసి కూడా, నువ్వెంతవాడి వన్నట్టు బ్రహ్మ నిర్లక్ష్యంగా ప్రవర్తించాట్ట. అది చూసి, విష్ణువుకు కూడా అహంకారం కలిగింది. తానే భూమిని ఉద్ధరించి యథాస్థానానికి తెచ్చి వుండకపోతే, ఈ బ్రహ్మ సృష్టి ఎలా చెయ్యగలిగేవాడు?




అటువంటిది అతనికే అహంకారం వుంటే, తనకెందుకు వుండకుండాపోవాలి? — అనుకున్నాడు విష్ణు. ఒకర్నొకరు అదోలా చూసుకున్నారు. 'శివుడి ఆజ్ఞలేందీ చీమైనా కుట్టదు' అన్న విషయం మరిచిపోయారు. తమ ఇద్దర్నీ ఆయా కార్యాలకు నియమించినవాడు శివుడే అన్నది కూడా మరిచిపోయారు. ఒకర్నొకరు ఈర్ష్యతోనూ కోపంగానూ చూసుకుని ద్వంద్వ యుద్ధం ఆరంభించారు. ఓసారి విష్ణువు గెలుస్తున్నాడు; మరోసారి బ్రహ్మ గెలుస్తున్నాడు. ఎవరిది గెలుపు? ఎవరిది ఓటమి?— నిర్ణయించడం వాళ్లకి సాధ్యం కాలేదు. ఇహలాభం లేదని, ఎలాగైనా విష్ణువును ఓడించాలని బ్రహ్మ నిశ్చయించుకున్నాడు. మహాశివుడు తనకు ఇచ్చిన పాశుపతాస్త్రం గుర్తొచ్చింది. ఎంతో విషమ పరిస్థితి ఏర్పడినప్పుడు గాని, ఈ అస్త్రాన్ని ఉపయోగించరాదు! అది ఇప్పుడు ఉపయోగించాలనుకున్నాడు. కాని, అదే అస్త్రం విష్ణువు దగ్గర కూడా వుంది. బ్రహ్మ పాశుపతాస్త్రం ప్రయోగించగానే, విష్ణువూ ఆ అస్త్రాన్ని ప్రయోగించాడు. ఇంకేముందర్రా—రెండు అస్త్రాలూ ఒకదాన్నొకటి ఢీకొని, సరిసమానమైన బలంతో పోరాడసాగాయి. కొంతసేపటికి, ఆ అస్త్రాల మధ్య నుంచి ఒక అగ్నిస్తంభం లేచిందిట. అది ఎంత ఎత్తు వున్నదీ, ఎంత లోతు నుంచి వున్నదీ-వాళ్ళకి అంతుబట్టలేదు. పైకి ఎంతగా వ్యాపించి వుందో, పాతాళానికి అలాగే వ్యాపించి వుందిట. అప్పుడు వాళ్ళకి అర్థమైంది. 'ఇది ఆ సర్వేశ్వరుడి మాయేగాని మరోటికాదు' అనుకున్నారు. తమ అహంభావాలను అణగదొక్కడానికి పరమశివుడే ఇలా చేశాడని తెలుసుకుని, ఇద్దరూ శివుని స్తోత్రించారు. ఆ స్తోత్రానికి శివుడు ప్రత్యక్షమై, వాళ్ల అవివేకాన్ని వివరించి, ఒకరి మీద ఒకరు అలా అస్త్రాలు ప్రయోగించుకోకూడదని మందలించాడు. ఇద్దరూ తమ తప్పిదం తెలుసుకున్నారు. శివుని దయ కలగడానికి ఏదైనా వ్రతం వుంటే చెప్పమన్నారు. అప్పుడు శివుడు మహాశివరాత్రి గురించి చెప్పాడు. ఆనాడు ఉదయం నుంచి, నియమంతో వుండి, పూజలు చేసి, రాత్రి జాగారం చేసినట్టయితే, తన అనుగ్రహం కలుగుతుందనీ, సమస్త పాపాలూ హరించి, శివసాయుజ్యం లభిస్తుందనీ చెప్పాడు. అప్పుడు, ఆ ఇద్దరూ ఆ వ్రతాన్ని ఆచరించారని, పురాణ కథ. అయితే మీరో మాట అడగొచ్చునర్రా—విష్ణువు, బ్రహ్మల వంటి దేవదేవులకేమిటి_అహంకారాలు కలగడం ఏమిటి?—అని. అంటే, ఎంత గొప్పవారికైనా, 'అహం' అనేది వుంటుందనీ, అది ఏదో పరిస్థితిలో బయట పడుతుందనీ, ఆ అహాన్ని త్యజిస్తేనే వారు మహాపురుషులు, మహాదేవులూ అవుతారనీ_ సారాంశం.

ఇంకోటుందర్రా. శివరాత్రి వ్రతం ఎలా ఆచరించినా పాపాలు పోవడం మాట అలా వుంచి- ఈ వ్రతం చూసినా కూడా అంతటి పుణ్యఫలమూ లభిస్తుందని పురాణాలు చెబుతున్నాయి. పురాణాల్లో దీనికి సంబంధించిన సుకుమారుడి కథను ఉదాహరణగా చెబుతాను.

ఈ సుకుమారుడు అన్నవాడు, యజ్ఞదత్తుడు అనే మంత్రి కొడుకు. కాని, చిన్నతనంనుంచి యథేచ్ఛగా తిరగడం అలవాటయింది. అతను చెయ్యని పాపం అంటూ ఏదీ లేదుట. దుర్వ్యసనాలు సరేసరి! చివరికి, తాను ఒక కడజాతి స్త్రీ ద్వారా కన్న కూతురు మీదికే కామ దాహంతో ఎగబడిన పాపాత్ముడు! ఒక శివరాత్రి రోజున సుకుమారుడు తప్పతాగి వున్నాడు. పువ్వులు కోసి స్త్రీలకు ఇచ్చి, మోహింప జేసుకోవాలన్న ఉద్దేశంతో శివాలయం ఆవరణలో ఎక్కువగా పూల మొక్కలు వుండడం వల్ల అక్కడికి వెళ్లాడు. అక్కడ గుడిలో అభిషేకం జరుగుతూ వుంటే, చూశాడు. లోపలికి వెళ్ళబోయాడు. అందరూ స్నానాలు చేసి తడిగుడ్డలతో లోపల వుండడంవల్ల నేలంతా తడిసిపోయి వుంది. సుకుమారుడు, మద్యపానంతో తూలిపోతూ, తడి నేలమీద జారి, శివలింగానికి ఎదురుగా అనుకోకుండా సాష్టాంగ పడ్డాడు! పైన పళ్లెంలో వున్న విభూతి గాలికి ఎగిరి వచ్చి అతని మీద పడడంతో_ అదంతా వంటిమీద పూసుకున్నట్టయింది. నెమ్మదిగా లేచి, అలా కూచుని పూజలన్నీ చూశాడు—

అందరూ ఎప్పుడు వెళ్ళిపోతారా అని! ఆ విధంగా రాత్రంతా జాగారం చేసినట్టయింది.

కొంతకాలానికి వ్యాధి మూలంగా సుకుమారుడు మరణిస్తే, యమకింకరులూ, శివదూతలూ వచ్చారట. ఘోర పాపాలు చేసినవాడు గనక, యమలోకానికి రావాలని యమదూతలు, శివరాత్రి పూజను, జాగారం చేసి చూసినవాడు గనక కైలాసానికి చేరవలసిందేనని శివదూతలూ పట్టుబట్టారు. రెండ పక్షాలవాళ్ళూ యుద్ధం కూడా చేసుకోవాల్సి వచ్చిందట. చివరికి, వ్రత దర్శన బలమే నెగ్గి అతను శివసాయుజ్యమే పొందాట్ట! అంతటి మహత్తు శివరాత్రి పూజలకి వుందని మన పురాణాలు చెబుతున్నాయి.

ఇంకో కథ కూడా వుంద్రా. ఒక దొంగ. ఆ దొంగ, ప్రతి రాత్రిలాగే శివరాత్రి నాడు కూడా దొంగతనానికి బయల్దేరాడు. అయితే, అందరూ జాగారాలు చేస్తూ వుండడంవల్ల, దొంగతనం సాధ్యం కాలేదు. శివాలయంలో జనం ఎక్కువగా గుమిగూడి వుంటారని, అక్కడికి వచ్చే స్త్రీల మెడల్లోంచి నగలు గుంపులో లాగెయ్యొచ్చుననీ అనుకున్నాడు. అలయానికి వెళ్ళాడు. అంతా కోలాహలంగా వుంది. ఏదీ అందుబాటులో లేదు. అమ్మవారి విగ్రహాన్ని, లింగాన్ని బాగా అలంకరించడం చూశాడు. త్వరలోనే ఊరేగింపుకు అందరూ వెళ్లిపోతారని విన్నాడు. ఆ తర్వాత, సులభంగా తన దొంగతనం నెరవేర్చాలనుకున్నాడు. కాసేపు అలా అలా తిరిగొచ్చేసరికి, గుడి అంతా నిశ్శబ్దంగా వుంది. ఊరేగింపు ఎక్కడో వుంది. తెల్లవార వస్తోంది. ఇదే సమయం అని దొంగ గర్భగుడిలో ప్రవేశించాడు. వస్తువులు బాగా కనిపించాలన్న ఉద్దేశంతో, సెమ్మెలో మండుతున్న వత్తిని పెద్దది చేశాడు. తనకి కావలసిన నగలు దొంగిలించాడు. లింగం నిండా విభూతి అలముకుని వుండడంతో, దాని కింద నగలేమైనా వున్నాయేమోనన్న ఉద్దేశంతో, లింగాన్ని బాగా నీళ్ళతో కడిగి చూశాడు. ఏమీ కనిపించలేదు. దక్కినవేవో తీసుకుని పారిపోయాడు. ఈ దొంగకే చచ్చిపోయిన తర్వాత శివసాయుజ్యం లభించిందట. గుళ్లో నూనె పోసి, వత్తి పెద్దది చెయ్యడం, లింగాన్ని అభిషేకించడం, రాత్రలా జాగారం చెయ్యడం - ఇవన్నీ అనుకుని చేసినవి కాకపోయినా, అతను శివాలయంలోనే దొంగతనం చేసినా – అతనికి పరమేశ్వరుడు తన కైలాస స్థానం కల్పించాడు!

శివరాత్రి మహాత్యం గురించి ఇలాంటి కథలు మన పురాణాల్లో ఎన్నో కనిపిస్తాయి. ఒక వ్రతం వెనక, ఒక పూజ వెనక ఎంతటి శక్తి, మహత్తూ ఫలితం లేకపోతే – కోటానుకోట్ల మంది ఎందుకివన్నీ ఆచరిస్తారంటారు మరి? చెప్పండి!

# ప్రశ్నలకు జవాబులు

సాహిత్య, సిరిసిల్లా

సాధారణంగా శుభకార్యాల్లో ముత్తైదువలు చెంపలకి పసుపు (గుండ్రని బొట్టంత) పెట్టుకుంటారు ఎందుకని బామ్మగారూ?

ఎందుకేమిటమ్మా — శుభ కార్యాలకీ ముత్తైదువులకీ పసుపు. బొట్టు అలంకారాలు గదా. పైగా శుభకార్యం ఎలాంటి సంప్రదాయమో, అవీ అలాంటి సంప్రదాయాలే.

రుక్మిణి, హైదరాబాదు

అంటూ, ఎంగిలీ కలపవద్దని మా మామ్మగారు తెగ బాధిస్తూ ఉంటారు. అలా కలిపితే అన్నం పుట్టదనీ ఇంకా ఏమిటేమిటో చెబుతూ ఉంటారు. ఇది ఎంతమటుకు నిజం అంటారు?

ఎంగిలి ఎలా కలుపుకుంటాం – అది ఎంతో అనారోగ్యం. 'అన్నం – అంటు' అన్న సిద్ధాంతం వుంది. బహుశా 'అన్నం పరబ్రహ్మం' అని అన్నానికి దైవ స్వరూపం కల్పించడంవల్ల, దాన్ని విడిగానూ ప్రత్యేకంగానూ, పవిత్రంగానూ ఉంచాలన్న ఉద్దేశంతో 'అంటు' కల్పించబడి వుండొచ్చు.

కోట నాగరాజకుమారి, బేస్తవారపేట

రజస్వలానంతరం స్నానం చేయించి ఇంట్లోకి వచ్చిన తరువాత ఆ రోజు పెద్ద ఎత్తున మండపం కట్టించి అందులో అమ్మాయిని కూర్చోపెట్టి తెల్సిన వారినంతా పిల్చి భోజనాలు పెడతారు-ఎందుకు? ఊరందరికి వాళ్ళమ్మాయి రజస్వల ఐనదని-తెలపాలా? అలా తెలియపర్చకుంటే ఏమైనా కీడు జరుగుతుందా?

ఇవన్నీ పూర్వపు సంప్రదాయాలమ్మా. అప్పట్లో బాల్య వివాహాలు ముమ్మరంగా జరిగేవి. అమ్మాయి పెద్దపిల్ల కావడం గొప్ప విశేషంగా తీసుకున్నారు. అప్పట్లో, పెళ్లికాని పిల్లలయితే, పెళ్లీడుకొచ్చిన విషయం బంధువులకీ మిత్రులకీ తెలుస్తుందనీ, తద్వారా అమ్మాయి ఎదిగే వయసులో వున్న యవ్వనరూపం తెలుస్తుందనీ మన పెద్దవాళ్లు ఈ ఏర్పాటు చేశారు. పట్టణాల్లో ఇప్పుడిప్పుడు ఈ తతంగాలు తగ్గిపోతున్నాయి.

మద్రాసులోని 'కళాసాగర్' అంతర్జాతీయ బాలల సంవత్సరాంతంలో 'బాలోత్సవ్' పేరిట ఉత్సవం నిర్వహించింది. ఎందరో బాలలు పాల్గొన్నారు. 'చందమామ' అడిగిన ఒక 'చిక్కు లెక్క' (పోటీ)ను నాలుగు నిమిషాల వ్యవధిలో పూర్తి చేసి, 'చందమామ' ఇచ్చిన గడియారాన్ని నాటి సభాధ్యక్షులు తమిళనాడు గవర్నర్ శ్రీ ప్రభుదాస్ పట్వారీ ద్వారా అంటుకుంటున్న యమ్. కిశోర్‌కుమార్.



# సంగతులూ సమాచారాలూ

పెంపుడు జంతువులన్నిట్లోకీ చాలా విశ్వాసమైనది కుక్క అంటారు. మనిషి కన్నా కుక్కే విశ్వాసపాత్రమైనది అని భావించేవాళ్లూ వుంటారు. అయితే తన యజమాని కనబడకపోవడంతో నీళ్ళు కూడా ముట్టుకోడం మానేసిందట ఓ రెండేళ్ళ కోతిపిల్ల - సేలం సమీపంలో రామలింగం అన్న యువకుని మద్యనిషేధ నేరం క్రింద పోలీసులు ఖైదు చేశారు. రామలింగం రాము అన్న ఒక కోతిని పెంచేవాడట. అది రోజూ తన యజమానితో కలిసే ఆహారం తీసుకునేదట. రామలింగం లేకపోవడంతో ఆయన తల్లిదండ్రులు ఎంత ప్రయత్నించినా ఆహారం ససేమిరా తీసుకోనందట కోతికి కల్గిన ఈ దైన్యస్థితిని పోలీసు అధికారులకు తెలియజేయగా వాళ్ళు రామలింగాన్ని చూడడానికి అనుమతించారు. పోలీసుస్టేషన్లో తన యజమానిని చూసీ చూడ్డంతో అమాంతం కౌగిలించుకుని ముద్దు పెట్టి - అతడు అందించిన ఆహారాన్ని తీసుకుని తన ముప్పై రెండు గంటల నిరాహారదీక్షను విరమించుకుందిట 'రాము!'

పెళ్ళిపీటల మీద కూర్చోవలసిన శుభ ఘడియలను ఇద్దరు ప్రేయసీ ప్రియులు చెరసాలలో గడపవలసిన నిర్బంధం ఏర్పడింది. సమస్తిపూర్ సమీపంలోని బార్ - ఆరా గ్రామాలకు చెందిన ఆ యువతీ యువకులిద్దరూ పెళ్ళి చేసుకోడానికి నిశ్చయించుకున్నారు. పెళ్ళికి ఒక నెల ముందుగా తమ పేర్లను నమోదు చేసేసుకున్నారు కూడా. పెళ్లికి ఓ రోజు ముందుగా వేసుకున్న పథకం ప్రకారం తమ ఇళ్ళు వదలివెళ్ళారు. అయితే అమ్మాయి తండ్రి తన కూతురిని ఫలానావాడు తీసుకువెళ్ళాడని పోలీసుకు రిపోర్టు చేశాడు. వెంటనే పోలీసులు వాళ్ళను అరెస్టు చేశారు. ఇంతకూ అసలు విషయమేమిటంటే వాళ్ళిద్దరూ ఇంతకుముందే పెళ్ళయినవారట!

అంటరానితనం అపరాధమనీ, కుల విచక్షణ పాటించడం నేరమనీ బస్సుల మీద నినాదాలు కనబడుతూవుంటాయి. ఈ విజ్ఞాన యుగంలో అసలా విషయమే అప్రస్తుతం, అర్థరహితం అని కొందరు వాదిస్తారు కూడా. ఈ వాదం ఎంతటి అమాయకమైనదో నిరూపించింది కర్ణాటక రాష్ట్రంలో జరిగిన ఓ సంఘటన! ఉత్తర కెనెరాజిల్లా సిర్సీ ప్రాంతం గ్రామం అది. ఆ గ్రామంలో ప్రభుత్వ వైద్యశాల వున్నా డాక్టర్ల దగ్గరికి వెళ్ళి తమ వ్యాధులకు మందులు తీసుకోడానికి ఆ పల్లె ప్రజలు వెనుకాడారట. ఆ ఆస్పత్రిలో పని చేసే డాక్టర్లు ఇద్దరూ హరిజనులు కావడమే దీనికి కారణం. గ్రామ ప్రాంతాలలో ఇవాళ కూడా గూడుకట్టుకున్న ఈ అనాగరిక పరిస్థితిని తీవ్రంగా విమర్శిస్తూ ఈ విషయం తెలియ చేశారు కర్ణాటక రాష్ట్ర వ్యవసాయ శాఖామంత్రి!

అమ్మాయిలకు సిగ్గే సింగారం-ఆభరణం అంటారు. అందమైన సిగ్గే కాస్తా ఎక్కువయితే ప్రాణం మీదికి వస్తుందని నిరూపించింది జయంతి ఉదంతం!

పదహారేళ్ళు నిండీనిండని విద్యార్థిని జయంతి. కోయంబత్తూరుకి చెందిన ఈ అమ్మాయి స్కూలుకి రోజూ బస్సులోనే వెళ్ళేది. ఆ రోజు సాయంకాలం స్కూలు అయిపోగానే ఇంటికి బస్సెక్కింది. బస్సులో ఎక్కగానే మోకాళ్ల మీద ఏదో పాకుతున్నట్టు గ్రహించింది. అయితే క్రిక్కిరిసిన జనం మధ్య దానిని గురించి పట్టించుకోడానికి సిగ్గుపడింది. మరి కొంతసేపటికి తొడల మధ్య చురుక్కుమంది. పళ్లు కరుచుకుని బాధనంతా భరించగల్గిందేగాని ఏం కుట్టిందీ ఎక్కడ కుట్టిందీ చూసుకోలేకపోయింది. ఇంతలో దిగవలసిన బస్ స్టాప్ రాగానే దిగి పరుగుపరుగునా ఇంటికెళ్ళి బట్టలు విప్పి విదిలించింది. తొడల మీద నాలుగయిదు గాట్లు చేసిన నల్ల తేలు ఎగిరి క్రిందపడింది. అంతే ముచ్చెమటలతో మూర్ఛపోయింది జయంతి. లబోదిబోమంటూ ఆమె తల్లిదండ్రులు ఆమెను ఆస్పత్రికి తీసుకెళ్ళారు. అయితే జయంతి ప్రాణాలు మాత్రం కాపాడలేకపోయారు.

భారతీయ సంప్రదాయం అలాంటిది. మానం కోసం ప్రాణాలు అర్పించింది జయంతి అని ఊరు ఊరంతా ఔరా అన్నారు. అయితే కొందరు "చదువుకుందేగాని బుద్ధిజ్ఞానం లేకుండా ప్రాణాలు పోగొట్టుకుంది" అని నొచ్చుకున్నారు. బాలబాలికలలో సరైన లైంగిక పరిజ్ఞానం లేకపోవడమే ఇలాంటి దారుణాలకు కారణం అని మరికొందరు వ్యాఖ్యానించారు.

ఐదు పైసలకోసం పోట్లాడి ఓ పెద్ద మనిషి అమాంతం ప్రాణాలనే పోగొట్టుకున్నాడు. మద్రాసులో వ్యాపారం చేసుకునే మఖన్‌సింగ్ తన మిత్రులతో కలిసి మెరీనాబీచ్‌కి వెళ్ళాడు. పిచ్చాపాటీ కబుర్లు చెప్పుకుంటూ వేరుశెనగలు అమ్మే కుర్రాడిని పిలిచి ఐదు పైసలకు వేరుశెనగలు కొన్నాడు. మఖన్‌సింగ్‌ని ఐదు పైసలు అడిగాడు వేరుశెనగల అబ్బాయి "ఇచ్చేశాను. తీసుకువే ఎందుకిలా అబద్ధమాడతావు" అని గట్టిగా చీవాట్లు పెట్టారు మఖన్‌సింగ్ అతని మిత్రులు. అంతే మాటామాటా పెరిగింది. ఈ గొడవ చూసి సమీపంలో వున్న గుడిసెలనుంచి కొందరు వేరుశెనగల కుర్రాడికి సహాయంగా వచ్చి మఖన్‌సింగ్‌నూ అతని మిత్రుల్నీ చితకతన్నారు. మఖన్‌సింగ్ అక్కడే స్పృహ తప్పి పడిపోయాడు. ఇంటికి చేర్చేసరికి ప్రాణాలు పోయాయి. ఈ సంఘటనకు సంబంధించిన ఆరుగురిని పోలీసులు అరెస్టు చేశారు.



విశాఖపట్నం లయనెస్ క్లబ్బు ఆధ్వర్యంలో రామ్‌నగర్‌లోని అనాథ శిశు శరణాలయం ''శిశు నికుంజ్''కు రాష్ట్ర స్త్రీ శిశు సంక్షేమ శాఖా మంత్రిణి శ్రీమతి రోడా మిస్త్రీ ప్రారంభోత్సవం చేసి జ్యోతిని వెలిగిస్తూన్న దృశ్యం. ''శిశుని కుంజ్'' అధ్యక్షురాలు లయనెస్ డా॥ లావణ్య ముఖర్జీ, కార్యదర్శి శ్రీమతి ఇంద్రాణి జగ్గారావు, లయనెస్ క్లబ్బు అధ్యక్షురాలు శ్రీమతి దిగుమర్తి సరస్వతీదేవి, జిల్లా కలెక్టరు శ్రీ సి. అర్జునరావు, శ్రీమతులు ఆరతి మురుగేష్, విజయప్రసన్న కుమార్‌లు ఈ చిత్రంలో ఉన్నారు. విలేకరి

మద్రాసులోని ప్రముఖ సాంస్కృతిక సంస్థ 'కళా భారతి' కొత్తా సూర్యనారాయణరావు హాలులో కవి సన్మానం, విద్వత్సభ కార్యక్రమాలను నిర్వహించారు. పండితులకు జరిగిన ఆ సన్మాన సభలో పాల్గొన్న క్వీన్‌మారీస్ కళాశాల ఆంధ్రోపన్యాసకురాలు కుమారి లలితా పీటర్స్‌ను కార్యకర్తలు ఉచిత రీతిన సత్కరించారు.





హైద్రాబాదు బాలల అకాడమీ ఇటీవల రాష్ట్ర స్థాయిలో నిర్వహించిన భరతనాట్యం (జూనియర్స్) పోటీలలో శ్రీకాకుళం సెయింట్ జోసఫ్ కాన్వెంట్ విద్యార్థిని కుమారి మమత ప్రథమ బహుమతి పొందింది.




బాలల దినోత్సవం సందర్భంగా విశాఖపట్నం నార్తు లయన్ లేడీస్ ఆక్సిలియర్ చిన వాల్తేరులోని పురపాలక ప్రాథమికోన్నత పాఠశాలలో నిర్వహించిన సాంస్కృతిక పోటీలలో బాల బాలికలు ప్రదర్శించిన ''జిప్సీ డాన్సు'' దృశ్యం.

ముఖ్య అతిథిగా విచ్చేసిన జోన్ ఛెయిర్మన్ లయన్ డి. సిహెచ్. తిరుపతిరాజు క్లబ్బు తరఫున పాఠశాల ఉపాధ్యాయులకు కుర్చీలు, నల్లబల్లలు, బోధనా పరికరాలు, విద్యార్థులకు పెన్నులు, కంపాస్ బాక్సులు వగైరాలను అందజేసి, ఆటల సాంస్కృతిక పోటీలలో గెలుపొందినవారికి బహుమతి ప్రదానం గావించారు. అధ్యక్షురాలు లయన్ లేడీ టి. సరస్వతీదేవి క్రీడాకారులు, కళాకారులకు అభినందన తెలిపారు. —విలేకరి



అమలాపురంలో ఇటీవల సమతా రచయితల వారోత్సవాల సందర్భంగా మహిళా దినోత్సవం జరుపబడింది. ఆనాటి సభకు డాక్టర్ పి. వి. వి. సత్యవతి అధ్యక్షత వహించారు. సమతా రచయితల సంఘం అధ్యక్షులు కొల్లూరి సూర్యనారాయణమూర్తి సభ ప్రారంభించారు. వక్తగా విచ్చేసిన వారణాశి జానకీదేవి 'కథానిక, వుట్టుపూర్వోత్తరాలు', 'సాహిత్య రంగంలో (కథానిక) స్త్రీలు' అనే అంశాలపై ప్రసంగించారు.

# వార్తావని(త)



వరంగల్ ఇన్నర్‌వీల్ క్లబ్ సభ్యులు ఇటీవల వరంగల్ కోటలోని వెనుకబడిన జాతుల పిల్లలకు బట్టలు పంచిపెట్టారు. ఆ సందర్భంగా తీసిన ఈ చిత్రంలో సాంఘిక సంక్షేమశాఖ అధికారిణి లక్ష్మిదేవి సరోజిని కూడా వున్నారు.

అంతర్జాతీయ బాలల సంవత్సరాన్ని పురస్కరించుకొని మధురాకోట్స్ సంస్థ ఆధ్వర్యంలో విశాఖ ఇన్నర్‌వీల్ నార్త్ క్లబ్బు స్థానిక టింపానీ స్కూలులో ఇటీవల నిర్వహించిన "ఏంకర్ ఎంబ్రాయిడరీ (త్రెడ్ గ్రూప్)" పోటీలలో పాల్గొన్న బాలబాలికలు, పోటీలను పరికిస్తూన్న కార్యకర్తలు ఆహుతులు. శ్రీమతి శోభా అహిక్రృష్ణ, కుమారి వి. కృపావతి పోటీలకు న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు. మధురాకోట్స్ ప్రతినిధి విజేతలకు బహుమతులు అందజేయగా, విశాఖ నార్త్ ఇన్నర్‌వీల్ అధ్యక్షురాలు శ్రీమతి కనకవల్లీ రాంగోపాల్ ధన్యవాదాలు తెలిపారు. —విలేకరి



రాజమండ్రి ఇన్నర్‌వీల్ క్లబ్ వారు తాము నిర్వహించే ఉచిత కుట్టు శిక్షణా కేంద్రంలో శిక్షణ పొందబోతున్న విద్యార్థినులకు కుట్టు నేర్చుకోవడానికి అవసరమయ్యే వస్తువులను బహూకరించారు.



శ్రీకాకుళం శ్రీనివాస మహిళామండలి అంతర్జాతీయ బాలల దినోత్సవం జరిపారు. ఆ కార్యక్రమంలో ముఖ్య అతిథిగా వేదవతీ ప్రభాకరరావు, అధ్యక్షురాలు తిమ్మరాజు హైమవతి, కార్యదర్శి వరదా సరోజిని పాల్గొన్నారు. –టి.వి.






చీరాల కెమెరాక్లబ్ అధ్వర్యంలో ఇటీవల ద్వితీయ అఖిల భారత ఛాయాచిత్ర ప్రదర్శనలు జరిగాయి.

ప్రదర్శనల ప్రారంభోత్సవ సందర్భంగా జ్యోతిని వెలిగిస్తున్న ప్రకాశం జిల్లా కలెక్టర్ సతీమణి ఆర్. పి. హేమలతా అగర్వాల్.



విజయనగరం జిల్లా చీపురుపల్లిలోని కస్తూరిబా మహిళామండలివారు తమ పదవ వార్షికోత్సవాల సందర్భంగా 'ఆరోగ్యవంతమైన శిశువు'లకై పోటీ నిర్వహించారు. ఈ చిత్రంలో ఆ పోటీలో గెలుపొందిన బాలిక విశాలాక్షిని అందుకుంటున్న ముఖ్య అతిథి బి. కళావతి, నివేదికను సమర్పిస్తున్న కార్యదర్శి దేవరాజుసీత వున్నారు



అనకాపల్లి జెసిరెట్స్‌వారు ఇటీవల జరిగిన 'జేసీ వారోత్సవాల' సందర్భంగా స్థానిక భీముని గుమ్మం పాఠశాల విద్యార్థులకు జేసీరెట్స్ అధ్యక్షురాలు చిన్నకోట రామలక్ష్మి అధ్వర్యంలో బట్టలు పంచిపెట్టారు.

కడప లయవెస్ క్లబ్ వారు ఇటీవల 'ఆరోగ్య శిశు పోటీ' నిర్వహించారు. ఆ సందర్భంగా తీసిన ఈ చిత్రంలో పోటీలో గెలుపొందిన బాలబా లతో క్లబ్ సభ్యులు వున్నారు.








విశాఖ వాసవీ మహిళామండలివారు ఇటీవల నిర్వహించిన సాంస్కృతిక కార్యక్రమాలలో ముఖ్య అతిథిగా విచ్చేసిన "బాలవికాస్" కన్వీనర్ రోహిణి వివిధ పోటీలలో గెలుపొందినవారికి బహుమతి ప్రదానం చేసారు. మహిళామండలి కార్యదర్శి శ్రీమతి పాలూరి శేమస్వామి ఈ కార్యక్రమాలను విజయవంతంగా నిర్వహించారు. పాలూరి రాజేశ్వరి వందన సమర్పణ చేసారు.

—విలేకరి



Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026.

REGD. No. TN/MS(S)/64 VANITHA (Telugu) February 1980